# జగచ్ఛిల్పము

卐

శ్రీ కోలవెన్ను పరబ్రహ్మ తీర్థ
విరచితము

卐

ప్రకాశకులు :
ఆంధ్రశిల్పకళాపరిషత్తు, తెనాలి.

ఏ జగన్మాతృ సత్కృపాదృష్టి విశ్వ
సృష్టితత్వము సాక్షాత్కరింపజేయ
నీ జగచ్ఛిల్పమును రచియింతు నట్టి
తల్లి గాయత్రి కిది యంకితము నొనర్తు.

# 1

## నివేదిక

సృష్టిలోని సర్వమానవుల కాజన్మాంతము నిత్యముపయోగపడునట్లు మహర్షోత్తములచే నాదికాలమున నిర్మితములైన జగదుపకరణ శిల్పపంచకము ఐహిక జీవనార్థమగుటయేకాక పారమార్థికముగగూడ సర్వవిధముల తోడ్పడి జీవసంతరణమును గూర్చుచున్నదనుట సర్వానుభవసిద్ధము. ఇట్టి శిల్పమునకు కారణమగు పరదేవతాకమును మహాకారణమగు పరాత్పరదేవతాకము నగునదియే జగచ్ఛిల్పము. దానినే జగత్సృష్టియు నందురు. దానిని దెలిసినగాని మానవుడు జీవిత పరమావధిని బొందలేడు. అందుచే జ్ఞానధనవంతులమైన మనము ఆసృష్టి తత్వమును బుద్ధిసాధ్యమగునంతవఱకు తెలిసికొందము.

## సృష్టి

అనాదియు నామరూపక్రియాది రహితమును అఖండమునైన దానినుండి ఏవో కొన్ని భిన్న పరిణామములు కలిగిన పిమ్మట గదా ఆపరిణామములకు తగినట్లు నామరూపక్రియ లేర్పడుట? కావున ముందు క్రియలచేత రూపమేర్పడగా ఆరూపమునకు దగినట్లు నామ మేర్పడును. ఈ నామ రూప క్రియా గుణములకు మూలమేదన్న మాయయనబడు మహాప్రకృతియే. ఎట్లన? నిరాకారమైనదానిని శాశ్వతమైనదని యెంచి సత్తనిరి. దానినుండి చిత్తొకటే (అసత్తు) బింబమునుండి కిరణముద్భవించినట్లు అధోభాగమున వెడలినది. బింబమున కిరణము లైక్యమగునట్లు ఆచిత్తు స్వస్థానమున నైక్యమగుచు మఱల వెడలుచు నిట్లు పలుసార్లు రాకపోకలు జరిపి మొదట శిశువుగను పిమ్మట బాలగను, తరువాత యువతిగను అయ్యెను. ఇట్లగుటయే సృష్టి

పరిణామమునకు ప్రారంభమన్నమాట. చిత్తు పలుసార్లు సత్తు లోనికి పోయివచ్చుటచేతనే యందలి సత్తాసంపత్తిని గ్రహించుచు శక్త్యాది రూపపరిణామములను పొందజాలినదని యిచ్చట తెలియవలయును. అయనాది సిద్ధమగు అద్వైత సద్వస్తువునుండి ప్రమ్ముకశక్తిని స్వీకరించియే మాయ మహాశక్తిసంపన్నురాలాయెను.

ఇక నామె కేమిక్కడుదువ? ఆమె విశ్వకర్మ (సర్వకర్మా) స్వరూపముదాల్చి అణువునకంటె నణువుగను, మహత్తునకంటె మహత్తుగను (అణోరణీయాన్ మహతో మహీయాన్) నగుటకును, భావి విశ్వకర్మలను జలప్రవాహమునకును, విశ్వశిల్పనిర్మాణమునకును మహాకారణరూపముగా కర్మజల బిందువను నొక యంత్రమును నిర్మించెను. నిరాకారమును అఖండమునునగు విద్యుత్తు శిల్పప్రభావమున నిర్మించిన గాజుకుప్పెలలో ఖండరూపమున సాకారముగా వెలుంగునట్లు ఆ కర్మజలబిందువందు నిరాకారమగు సద్వస్తువుయొక్క శక్తి ఖండరూపమున జ్యోతియై వెలిగెను. ఈ సందర్భమున బిందువనగా జలబిందువనియే గ్రహింపవలెను. ఈ జలబిందువు అనేకకర్మలను జలప్రవాహములకు కారణభూతమగుచున్నది గావునను, కర్మలను జలములతో బోల్చుచున్నారు (సంసార సముద్రము మున్నగురీతిగా) గావునను దీనిని తెలబిందువనక జలబిందువనవలసి వచ్చినది. కావున సచ్ఛక్తిని గ్రహించి జ్యోతిరూపముగా ప్రకాశించిన ఆబిందువును 'ఆపోజ్యోతి' యనిరి. ఈ రహస్యమునే "1 ఆపో 2 జ్యోతి 3 రసః 4 అమృతం 5 బ్రహ్మ 6 భూ 7 ర్భువ 8 స్సువ 9 రోమ్" అనుచు ప్రణవతత్వమును సూచించుచున్న వేద మంత్రము

తెలుపుచున్నది. ప్రణవము—ఓంకారము ఒక్కటిగా లోకమున వ్యవహరింపబడు చున్నను ఆరెంటికిని భేదమున్నదనియు, ప్రణవము అగాధతత్త్వరహస్య యుక్తమనియు, నారహస్యములు సద్గురు పరంపరాముఖమున నెఱుంగవలయుననియు పాఠకులకు మనవిచేయుచున్నాను. అంతమాత్రమున లోకవ్యవహారము దోషయుక్తము గాదనియు మనవి. పైనవకమంచు బ్రహ్మశబ్దమునకు వ్యుత్పత్తి గొందునది యనియు, ఓం శబ్దమునకు నాదమొనగునది యనియు నర్థము భావింపవలయును. తక్కిన పదములయర్థము లాయా మంత్రభాష్యముల గనవచ్చునని విస్తరభీతి విరమించితిని. పైబిందువు ననుసరించి తనశిల్పనైపుణ్యముచే బింబమును నొక గోళకయంత్రము నిర్మితముకాగా ఆబిందువు బింబాకారమయ్యెను. అందుండి నలుగురు పురుషులుగను, ముగ్గురు స్త్రీలుగను, ఇద్దరు నపుంసకులుగను మొత్తము తొమ్మండుగురు వెడలిరి. వారి యొక్కరూపనుగు నవకమే ప్రణవమయ్యెను. ఆమె ఆబింబమునకు ఆత్మయని పేరుపెట్టి ఆయాత్మయే నేనన్నది కావుననే ఆత్మయన్నను నేనన్నను తానన్నను ఒక్కటియే యాయినది.

శ్లో. యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ
యచ్చాస్య సంతతోభావ స్తస్మాదాత్మేతి కీర్త్యతే॥

అను లక్షణమునుబట్టి అన్నింటిని బొందుచు విషయోపభోగములనర్పుచు సంతత భావముగలది ఆత్మ యని తెలియుచున్నది. "అతతీత్యాత్మా" అను వ్యుత్పత్తినిబట్టి చూచినను గమనశీలము — లేక చలనశీలముగల పూర్వోక్త బింబరూపయంత్రమున కాత్మశబ్దము తగు చున్నది. ఈ యాత్మ సత్తు

చిత్తుల సమైక్యముతో జరుపు ప్రేమలీల యానందస్వరూపము కావున నిది సచ్చిదానంద లక్షణము, సచ్చిదానందస్వరూపమునై, లక్షణత్రయ స్వరూపత్రయ యుక్తమై ప్రకాశించినది.

ఇట్లీ మాయాశక్తి ఆత్మనామము పొంది పదునైదు శిల్పములు గల బ్రహ్మపట్టణమును నిర్మించి పంచదశీనామమును గూడ పొందెను. పదునైదు కళలుగల పున్నమనాటి చంద్రబింబము తనకు పదుడు (భిన్నుడు) ను భర్తయునగు సూర్యుని నుండి పదునాఱవకళను బొంది షోడశకళాపరిపూర్ణమైనట్లు, ఆత్మనామము పొంది పంచదశియైన తాను తన మూలస్థానమగు నద్వైతాత్మనుండి పదునాఱవకళను బొంది పరిపూర్ణయై భర్తృ సమాగమార్హ కాగా నామెయందు కేవలాద్వైత పరమాత్మ తేజస్సు ప్రతిబింబించి ప్రత్యగాత్మరూపపురుషుడుగా భావింపబడెను. ఇట్లీ యిరువురు నొకరు మహాకారణదేహముగాను నింకొకరందు ప్రతిఫలించిన మహాకారణదేహిగాను నయి మహాబ్రహ్మాండనాయకులగు ఆదిమదంపతులై యొప్పిరి. దీని పూర్ణవివరము జగచ్ఛిల్పము రెండవభాగమునగల బ్రహ్మపట్టణ నిర్మాణ వివరణమున్న పీఠికయందు గాంచనగు.

జగచ్ఛిల్ప తత్త్వము నంతరవలోకనముచే నెఱింగిన శిల్పయోగులగు పంచర్షి మండలమువారు మానవులు తరించుటకై శ్రీచక్రనిర్మాణమును శాసించునట్టి "బిందుత్రికోణ వసుకోణ దశార యుగ్మమ్" ఇత్యాది లక్షణములుగల శిల్పశాస్త్రమును రచించుటే కాక శ్రీచక్రమనుపేర సృష్టితత్త్వ మూలమగు బ్రహ్మపట్టణ నిర్మాణమును మహాకారణరూపమును గ్రహించుటకు బిందువును బంగారుచేతను క్రింది నవాంతస్థులు నవలోహముల

చేతను నిర్మించియు, హిరణ్మయమని చెప్పినాఁగు గాన చక్రము నంతటిని బంగారుమయముగాగాని చేసియు ఉపాసకుల కందించి లోకోద్ధరణము సల్పిరి. ఈచక్రమే ప్రణవతత్వమును గూడ తెలుపుచున్నది. ఇట్టి యీ శ్రీచక్రపు సనాతనతత్వము కలిలో మఱుగుపఱుపబడి యేవేవో క్రొత్తసిద్ధాంతములతో ఆశ్రీవిద్యను కామ్యసిద్ధులకై యుపయోగించుకొను చున్నారు. తదనుసారమే ఆధునిక శాస్త్రములును కొన్ని బయలుదేరినవి. శ్రీ శంకరాచార్యులవారు మాత్ర మీవిశేషముల నన్నిటిని తడవక శ్రీచక్రస్థ బిందువునే గ్రహించి "సహస్రారమధ్యస్థ బిందుస్వరూపమ్" అని గానము చేసినారు.

ఈ బిందువునందలి ద్వైత (బింబప్రతిబింబ) భావముచే నేర్పడిన ఆదిమదంపతులు, వారి పూజాపురస్కారములు పంచర్షి మండలము వారికాలమున (కలికి పూర్వము) ప్రచారములో నుండెడివి. ఈపురాణదంపతుల సృష్టితత్వ చరిత్రము నుగ్గడించు పురాణములును నాడు ప్రచారములో నుండెడివి. ఇటీవల ఏ జ్ఞానియు ఏమహాకవియు ఆదిమదంపతీధ్యానమొనర్చిన పాపమున బోలేదు. ఒక్క కాళిదాసమహాకవి మాత్రము పూర్వసంస్కార వాసనాఫలముగ పేరులేవిపెట్టకను "జగతః పితరౌ వన్దే" అని ఆదిమదంపతీ నమస్కారము చేసినాడు. ఇందు కాతడు శిల్పసంస్కార సంపన్నుడగుటయే కారణము.

## మహాబ్రహ్మాండము

ఇది కారణములకెల్ల మహాకారణమగుటను, బ్రహ్మాండములకెల్ల మహాబ్రహ్మాండమగుటను దీని కీపేరు పెట్టవలసివచ్చినది. ఇది నిరాకారమగు కేవలాత్మశక్తి ఆధిష్ఠానముగా నేర్పడిన

సాకారమహాబ్రహ్మాండము. దీని కధిపతు లాదిమదంపతులగు హిరణ్మయీ ప్రత్యగాత్మలు - లేక గాయత్రీ విశ్వకర్మలు. వీరు సకలభువనసృష్టి సలుపుచుండగా నది హిరణ్మయమండలమై యొప్పుచుండును.

## బ్రహ్మాండము

ఇది నిరాకార విద్యుచ్ఛక్తి యధిష్ఠానముగా నిర్మితమైన సాకారబ్రహ్మాండము. దీని కధిపతులు బ్రహ్మాండదంపతులైన చంద్రసూర్యులు విద్యున్నిలయమగు నీబ్రహ్మాండమున గ్రహ నక్షత్రాదులు శిల్పకౌశలము చేత సంచరించు చుండును. ఇది రజతమయ మండలముగా నొప్పును. కొందఱీ మండలము తామ్రమయమని చెప్పుచున్నారు.

## పిండాండము

ఇది పంచభూతములలోని నిరాకార ప్రాణశక్తి అధిష్ఠానముగా నిర్మితమయిన సాకారపిండాండము. దీని కధిపతు లవిద్యా జీవులను దంపతులు. వీరు బ్రహ్మాండ మొసగునట్టి కాలగతుల దెలిసికొనుచు జనన మరణముల కగు కర్మముల నొనర్చుచుందురు. ఈ పిండాండము అయోమయమండలమై యొప్పును.

ఇట్లు కేవలాత్మశక్తియు, విద్యుచ్ఛక్తియు, ప్రాణశక్తియు నను త్రిశక్తులును నిరాకారములే. జీవుడుగూడ నిరాకారుడే. పంచభూతములలో వాయ్వాకాశములు నిరాకారములే. విద్యుత్ ప్రాణాదిశక్తులు నిరాకారము లయ్యును శిల్పమహిమచేత అద్భుతకార్యము లొనర్ప గలుగు చున్నవి. ఇట్టితఱి ఈ శక్తుల కన్నిటికిని మూలభూతమగు నాత్మశక్తి యెన్ని చిద్విలాసములను బచరింపనేరదు ? ఆత్మశక్తి ఆయా విలాసముల (రూపముల)

ప్రకటించుటయే శిల్పము. ఆదిమదంపతులు కారణభూతులై 84 లక్షల జీవరూపములను గల్పించుటయు శిల్పమహిమ కాదా? కావున మా పుట్టి సృష్టి శిల్పము నెఱింగినగాని, ఆ శిల్ప మార్గమున స్వస్థానము జేరి ప్ర విమలానందము పొందనేరదు.

" సిశ్చలత్వముగను నిర్వికల్ప సమాధి
సత్యలోక మగి నిత్య మచట
విశ్వశిల్పి నల్పు విశ్వకర్మల సత్య
శీలనమ్మొనర్ప శిల్పమగును."

ఈ జగచ్ఛిల్పము ననుసరించి పంచభూతములతో ప్రపంచము నిర్మాణమైనట్లు సానగాది పంచఋషులును మన్వాది పంచబ్రహ్మలును, పంచవృత్తులచే జగదుపకరణ శిల్పముల నిర్మించి ప్రాణిలోక కృతజ్ఞతకు పాత్రులైరి. ప్రాణుల నైహికలీల యంతయు నీ శిల్పములోనే ప్రకాశించుచున్నది. శిల్పములేనిది మానవుల యాటసాగదు.

" జనుని జన్మమొదలు జన్మాంతమగుదాక
నీడ నిలువ, జలకమాడ, ద్రావ,
పండ, గట్ట, గుడువ, నుండ శిల్పవిశేష
ణములుగాక జీవనమ్మ లేదు."

" విశ్వశైల్పికమగు విశ్వజీవిజనాళి
కవసరమ్ములైన యన్నిపనులు
శిల్పరచన మగును శిల్పేతరంబైన
పనియొకండు గానబడదు జీవ!"

శిల్ప ప్రభావమిట్లు పారమార్థికముగను ఐహికముగను పరిపూర్ణ రూపము నొంది మానవుల కుపయోగించుచున్నను, దాని ప్రశంస గ్రంథములలో విశేషించి యగపడక పోవుట దేశ దౌర్భాగ్యమో, కలిమాహాత్మ్యమో గాని సత్యద్రష్టలకు మాత్ర మిది శోచనీయాంశ మనుట నిజము. ఇది కలి ప్రభావ మను వారిలో నేనొకడను. కలిలో అసత్యమునకు మూడుపాళ్లు బల మున్నను, ఒకపాలు బలమైనను సత్యమున కుండవలయునుగదా! వేదములందు సృష్టికర్తృత్వము చేతను, పరాత్పరత్వము చేతను, భగవంతుడు విశ్వకర్మనామ మందియుండగా, పంచమూర్తులలో నొకడగువిష్ణుమూర్తి పరాత్పరుడుగా దేశములో బేర్కొనబడుట లేదా? పెక్కురు ఋషులు నీచజన్ములని వజ్రసూచికాదులలో బేర్కొనబడినను వారి ప్రభావమునకు లోటుగలిగెనా? ఇట్టి పెక్కు విషయములనుగూర్చి నేను బాల్యమునుండియు విచార పడుచుండు వాడను. ఇట్టి ప్రకృతిచిత్రమునకు చింతిల్లుచు ఆ ఒకపాలు సత్యమైనను బయటపడదా యని తలంచుచు అత్యంత పూర్వఋషులైన సానగాదుల శిల్ప సామ్రాజ్య చరిత్ర తెలిసికొన వెరవు లేదా యని వెదకుచుండ 1921 సం॥ ఫిబ్రవరి (అనిగుర్తు)ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో శ్రీ పానుగంటి లక్ష్మీనృసింహము పంతులుగారు 'సాక్షి' వ్యాసములలో వ్రాసిన "శిల్పుల ప్రాశస్త్యము - వారి పతనము" అను వ్యాసములో పెక్కు విషయములు కనబడెను. పిమ్మట 1934 ఫిబ్రవరి భారతి సంచికలో బ్ర॥ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిన "మహాత్ముడు హిందువుడు కాడా? హరిజనులు హిందువులు కారా" అను వ్యాసము కాననయ్యెను. ఆ వ్యాసమంతయు శిల్పుల

యొక్కయు, శిల్పముయొక్కయు, చరిత్రతో నిండియుండెను. ఆదిమశిల్పప్రవర్తకులగు బ్రహ్మలు ఐదుగురనియు వారివలననే పంచవిధశిల్పము లేర్పడెననియు, సృష్టియై దేశ మనాగరక దశలో నున్నప్పుడు ప్రథమమున నాగరికతను మార్చినవారు వీరేయనియు, వీరెదుగురై నందున పంచాననము వారైర నియు, వీరి యాద్యదైవము సృష్టికర్తయగు విశ్వకర్మయ నియు, మొదలగు అత్యంత ప్రాచీనచరిత్రాంశము లెన్నియో అందు వివరింపఁబడినవి. దానిం జదువుటచే నా యుత్సాహము మఱింత యినుమడించెను. అది శ్రీ గాయత్రీమాతృ సేవా ఫల ముగా నెంచి 1948 సం॥ లో నీ జగచ్ఛిల్పగ్రంథమును రచింపప్రారంభించితి. ఈ గ్రంథము కర్మకాండము, ఉపాసనా కాండము, జ్ఞానకాండము నను మూడుభాగములుగా విభజింప వచ్చును.

అందు మొదటిదైన కర్మకాండములో సృష్టితత్త్వము. దానికి హేతుభూతులైన ఆదిమదంపతులు, తనువులు - అవ స్థలు, కర్తవ్యము ఆదిమదంపతీ మంత్రరహస్యము, తదుపా సనా ప్రాధాన్యము, పిండబ్రహ్మాండములు, జ్ఞానవిజ్ఞానములు మొదలగు ననేకాంశములు కర్మసంబంధములు వివరింపఁబడెను.

రెండవదగు నుపాసనాకాండము ఆదిమూలముతో నారంభమయి శ్రీచక్ర బ్రహ్మపట్టణముల యైక్యరహస్య మును వివరింపుచు తదుపాసనా ప్రాధాన్యము నుగ్గడించుచు, దేవలోకము శిల్పసామ్రాజ్యము మొదలగు సనాతన రహస్య ములను బయలుపఱచి దానికి కారణమగు కలిమహాదేవి ప్రభావమును తాకుచు ముగియుచున్నది.

ఈ కాండములో పద్యములందు వివరింపఁబడిన విషయములకును, బ్రహ్మాపట్టణ వివరణముచేసిన వచనములోని విషయములకును, నించుక భేదమును, క్రమవిపర్యాసమును, నుండవచ్చును. దానికి కారణ మా విషయములు వచనములోనె విస్తరముగా వివరింపఁ దలచుట.

ఇక మూఁడవదగు జ్ఞానకాండము సృష్టిపరిణామముతో నారంభింప బడుచున్నది. ఈ సృష్టిపరిణామము జ్ఞానకాండాత్మకము. ఈ పరిణామము 24 విధముల కాన్పించినది.

వానిలో శిశువు, బాల, యువతి అను మూఁడు పరిణామములు మాత్రమే నేను వ్రాయగల్గితిని. పిమ్మట పంచభూతములు, పంచమూర్తులు, బ్రహ్మాండ పిండాండములు, జీవాత్మవిద్యలయుత్పత్తి వివరింపబడెను. ఈ అవిద్యాజీవులే పిండాండాధిపతులగు దంపతులు. శరీరములను యంత్రములుగను, రథములుగను, సౌధములుగను– సకలాధ్యక్షులును నాదిమదంపతులును నగు గాయత్రీ విశ్వకర్మలు నిర్మించిరి. తనురథ నిర్మాణముచేత వారాదిమ రథకారులును, శరీర సౌధనిర్మాణముచేత ఆదిమ వాస్తుపురుషులునై జగదారాధ్యులుగా నొప్పిరి. శరీరమును సౌధముగా పోల్చి చెప్పుటచేత పారమార్థిక రహస్యములు వివరింప వీలుచిక్కినది. అవిద్యాజీవుల నందు గృహప్రవేశము చేయించుటకును, ఆ ఆల్మగల నడవళ్ళనుగూర్చి బోధించుటకును, చక్కని యవకాశ మేర్పడినది. పరమార్థసాధకులగు సజ్జను లీ యంశములను తమ సాధన ప్రణాళికలో నుపయోగమునకు తెచ్చుకొని మేలు పొందుదురని యాశించుచున్నాను. అట్లే ఆగామిసంచిత ప్రారబ్ధముల కిచ్చిన వ్యాఖ్యా

నములగూడ సాధకులు లోతుగా విచారించి అనుసరింతురని వాంఛింతును. సత్యపథ్యాది సాధన విధానముగూడ ముముక్షువుల కత్యంతావశ్యక మని భావింతును. గ్రంథము దురవగాహ విషయములతో నిండియుండుటవలన నీని వేదికలో కొన్ని విషయములు విస్తరముగా బ్రస్తావింపఁ బడినవి. ఈ గ్రంథము చేత పారకులగు సాధకులకు సృష్టిశిల్పములకు గల గాఢసంబంధము తేటపడి వారి పారమార్థిక సందేహములు దీరి వారి మార్గములు సుగమము లగునెడల నా కృషి సఫలమైనదని భావింతును. R9.2131 294.51

## కృతజ్ఞత PLK

ఈ గ్రంథము నూరు పుటల వరకు అచ్చు పడినను భావప్రపంచమున మునిగి భాషాపటిమను పాటింప నైతిని. తదుపరి: తెనాలి కళాశాలలో ఆంధ్ర పండితులుగా పనిచేయు చున్న 'ఉభయభాషాప్రవీణ' 'దర్శనాచార్య' బ్రహ్మశ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు ఈ గ్రంథమునుచూచి భావపటిమకుఁదోడు భాషాపటిమకూడ నున్న బాగుండునని తమ సహజాదరాభిమాన సహనశక్తులతో తక్కిన భాగము నంతయు పరిష్కరించి యిచ్చుటేగాక ఉపోద్ఘాతమునుగూడ వ్రాసి నన్ను కృతజ్ఞతాబద్ధుని చేసిరి. వారు పాండిత్యములో పెద్దవారైనను వయస్సులో చిన్నవారైనందున ఇతోధికముగా దేశ, సంఘ, భాషాసేవాది సత్కార్యముల నొనర్ప వారి కాయురారోగ్యైశ్వర్యములు కలిగించునటుల జగచ్ఛిల్పియగు నా విశ్వకర్మ పరబ్రహ్మను ప్రార్థించు చున్నాను. ఈ గ్రంథమును విని అభిప్రాయము నొసంగిన కవిసార్వభౌమాది

బిరుదాంకితులును, ఆంధ్రప్రభుత్వాస్థాన కవులును, బహు గ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రుల వారికిని, తమ పరిషత్పక్షమున ఈ గ్రంథమును ప్రకటింప ననుమతించిన ఆంధ్ర శిల్పకళాపరిషత్తువారికిని, నా కార్థి కాని లోపము లెన్ని యున్నను వానిని సరకుసేయక గుణగ్రహణ పారీణులై గ్రంథమున కీ రూపమును కల్పించి యిచ్చిన జానకిరాం ప్రెస్ మేనేజరుగారగు బ్రహ్మశ్రీ పోచిరాజు పుండరీకాక్షుడుగారికిని, గ్రంథ ముద్రణకు విరాళ మొసంగిన దాతలకును నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

జగచ్ఛిల్పమున జ్ఞానకాండమునకు శ్రీ శ్రీ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ది 2-3-56 -వ తేదీన ప్రత్యేకముగా నభిప్రాయ మొసంగిరి. అది యపుడే ముద్రణమాయెను. తదుపరి తక్కిన రెండు కాండములనుగూర్చి గూడ నభిప్రాయ మీయుడనికోర, నట్లే యొసంగిరి. ఆ రెంటినికలిపి త్రికాండాత్మకమగు నీ జగచ్ఛిల్పములో నిప్పుడు ముద్రించినాడను.

ఇట్లు
గ్రంథకర్త.



# పరిచయము.

ఈజగచ్ఛిల్పము ఉపనిషత్తులతో తులదూగదగిన యొక మహాగ్రంథరాజము. దీనికర్తలు శ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థులవారు. తీర్థులవారు కొన్ని జన్మములనుండియు తత్త్వజిజ్ఞాసాపరు లనవచ్చును ఈ జన్మములో వారి జ్ఞానము పరిపక్వమయినది. వారి సాధనవిధానము సిద్ధిపొందినది. నా విద్యార్థిదశనుండియు శ్రీ తీర్థులవారితో నాకు గాఢ పరిచయమున్నది. నా హృదయముగూడ ఆధ్యాత్మిక వాసనా విలసితమగుటచేతను, చిన్నప్పటినుండియు తత్త్వసారస్వతమును మథించుచున్న కారణమునను వారితోడి నా నెయ్యము దినదిన ప్రవర్ధమానమగుచుండెడిది. ఆనాటికే వారు గాఢముగా గాయత్రీసముపాసనము చేయుచుండెడివారు. ఆ యుపాసన మందఱు చేయునట్టిది కాదు. అది యొక ప్రత్యేకతను గలిగినట్టిది. అనేక పారమార్థిక రహస్యములను తమ యీ ధ్యానయోగ సాధనములో సాక్షాత్కరింపజేసికొని జగద్రహస్యమును బ్రకటింప వారా విశిష్టోపాసనమును జేసెడివారు. వారు ధ్యానముద్రనుండి వచ్చినపిదప ఎన్నెన్నో రహస్యములను ముచ్చటించుచుండెడివారము. ఆ సంభాషణములో ఎన్నో క్రొత్త భావములు వారు వినిపించువారు. గాయత్రీమంత్రార్థ భావస్వరూపముల నేమి, సృష్టిప్రణాళికా రహస్యముల నేమి, గాయత్రీ విశ్వకర్మలు పంచశీర్షు లయిన కారణ మేమి, ఎన్నెన్ని భావములనో సహేతుకముగను, స్వానుభవపూర్వకముగను వినువారిబుద్ధికి నచ్చునట్లాయన వినుచువారు.

వా రాయా వేదాంత విషయముల బోధించునప్పుడు - ఉపని షత్తులలో విహరించుచున్నట్లు - అంతకుమించిన యొక స్వానుభూతిప్రపంచములో సంచరించుచున్నట్లు తలంచువాడను. ఏ భావములలోనైన ఏకీభావము కుదురకున్న మఱొకసారి ధ్యానానంతరము చెప్పెదమనువారు. అట్లే మఱల శ్రోతలబుద్ధికి నచ్చున ట్లాయా విషయములను దెలియపఱచుచుండువారు. యుగయుగాంతర రహస్యములు, తంత్రములు - ఎన్నియో ఒక మహర్షి కివలె వారికా సమాధిదశలో సాక్షాత్కారమగుచుండెడివా అని అప్పటిలో ననుకొనువాడను. అది నిజమే యని నేడీ గ్రంథమువలన తీర్థులవారు రుజువు చేసికొనుచున్నారు. నా చిన్ననాట నేను విన్న భావములు, విమర్శలు, రహస్యములు, ఇంక నెన్నో విశేషములతో నేడీ గ్రంథమున దర్శనమిచ్చినవి. ఇది అతీంద్రియద్రష్టలగు ఋషులు చేయదగిన పని. ఈ పనిని చిరతపస్సుచే తీర్థులవారు చేసి ఆ ఋషిత్వము తమకు గలదని చెప్పక చెప్పుచున్నారు. జ్ఞానపారమ్యమును బొందినవాడని ఋషి శబ్దమున కర్థము. ఋషులలో ఋషి, మహర్షి, పరమర్షి, దేవర్షి, బ్రహ్మర్షి మున్నగు కొన్ని యంతరములు గలవు. బ్రహ్మర్షిని మించిన ఋషి చెప్పబడలేదు. కాని, పరబ్రహ్మఋషి యని యేల యొక విభాగము చేయరాదు? నాదృష్టిలో ఈ గ్రంథకర్త యొక పరబ్రహ్మఋషి. నాదృష్టిలోనే కాదు, ఈ గ్రంథమును చదివి భావించినపిమ్మట మీదృష్టిలోగూడ వీరు పరబ్రహ్మఋషి కాగలరని నా నమ్మకము. ఇది అభిమానముతో గూడిన యతిశయోక్తి కాదు, మఱి సత్యసమ్మతమగు స్వభావోక్తియే.

అర్హుడగు నాధ్యాత్మికాధికారికి సర్వసమర్థుడగు సద్గురువు లభించుటయేకాక పూర్వజన్మసుకృతము. ఆసుకృతముగూడ వీరికి చేకూరినది. వీరి వేదాన్తగురువులు శ్రీమన్మడుపు సుబ్బయాచార్యులవారు. శ్రీ ఆచార్యులవారి సంప్రదాయము అనుభవప్రధానమైనది, అనేకాధ్యాత్మిక రహస్యములకు నిర్బాధమగు సమన్వయమును గూర్చినట్టిది. ఆ సంప్రదాయ రహస్యములను బిడికిట బట్టిన శ్రీతీర్థులవారు తమ తపశ్శక్తిచే వానికి క్రొత్తమెఱుగులు పెట్టుకొన్నారు. అష్టోత్తర శతసంఖ్యా రహస్యమునుగూర్చి నేను పెక్కురు పండితులను, పరివ్రాజకులను, పరమహంసలను శ్రీవిద్యోపాసకులను అడిగితిని. కొందఱు తటపటాయించినారు. మఱికొందఱు నీళ్ళు నమలినారు. ఇంక కొందఱా రహస్యములు తెలియకున్న వేదాన్తవిజ్ఞానము పూర్తికాదా యన్నారు. పుస్తకములు వెదకితిని. అగపడలేదు. ఆ రహస్యము నీగ్రంథము అనుభవసమన్వితముగను తర్కానుకూలముగను వివరించుచున్నది. (చూడు 110పుట) ఇట్టి మహావేదాన్త రహస్యము లెన్నో వీరికి సంప్రదాయసిద్ధముగా కరతలామలకము లయి యున్నవి. ఇది గూడ నీగ్రంథగౌరవమునకు హేతువే.

## ఏతద్గ్రంథస్థ విషయము

జగచ్ఛిల్పము:- జగదుత్పత్తికి హేతువులు ప్రకృతి, పురుషుడు. ఈ రెంటిలో ప్రకృతి జడము, త్రిగుణాత్మకమును, అది ఇరువదినాలుగు తత్త్వములై వెలయును. ఈ రహస్యము

సాంఖ్యాదిదర్శనములందు ప్రపంచితము. ఇక పురుషుడు సచ్చిదానందరూపుడు; జ్యోతిస్స్వభావుడు. ఈ పురుష తత్త్వప్రకాశముచేతనే క్షేత్రమగు శరీరాది జడవర్గము ప్రకాశించుచున్నది. ఇట్లే ప్రకృతి పురుష సంయోగజన్యమే జగత్తు. తద్విలాసమే జగచ్ఛిల్పము. సృష్ట్యాదిమకాలము నుండియు ప్రపంచమున భౌతికాధ్యాత్మికవాదములు రెండును ప్రచలితము లయియే యున్నవి. ముందు సూచించిన ప్రకృతి పురుష తత్త్వములలో జడమును - భూతాత్మకమును నగు ప్రకృతియొక్కటే ఆదిమపదార్థ (matter) మనియు, దాని పరిణామమే పురుషుడుగాని, ఆత్మగాని యనువారు భౌతికవాదులు. వీరు పురుషతత్త్వము - లేక పరమాత్మతత్త్వము ప్రత్యేకించి ''నాస్తి'' (లేదు) అన్నందున నాస్తికులయినారు. ఇక ప్రకృతి పురుష తత్త్వముల రెంటి నంగీకరించినవారు ఆధ్యాత్మికవాదులయినారు. ఈ ఆధ్యాత్మికవాదము నూతగాగొని మన వేదాన్త వృక్షము శతసహస్రశాఖలతో - నానావిధ భేదములతో వికసించినది. ఏతదాధ్యాత్మికవాదమునే ఈ గ్రంథముగూడ వివరించుచున్నది.

విశ్వసృష్టికి కారణభూతులగు ప్రకృతిపురుషులే ఆదిమ దంపతులగు జగత్పితలని ఆర్ష కవి వాణి. ఈ జగత్పితల తత్త్వముతో బాటు ఆత్మతత్త్వమునుగూడ సంపూర్ణముగా ఆకళించుకొన్నగాని సాధకు డమృతుడుగాడు. ఇందు కాతని సృష్టితత్త్వమవగతము కావలయును. పిండబ్రహ్మాండముల స్వరూప స్వభావములు గోచరింపవలయును. ఆ పిండబ్రహ్మాండములకు గల సంబంధము, కార్యకారణభావము, వానికి సంబంధించిన

వింక నెన్నియో రహస్యములు తెలియవలయును. సాధకుడగు వాడు తనను, తాను నడయాడుటకు సృష్టింపబడిన దేహ రధములను, ఆరెంటికి సంబంధమునుగూర్చు కర్మమర్మములను– ఆకర్మముల నాచరింపవలసిన విధానములను, సాధనములను – ఇదియది యననేల, సృష్టిలోని ప్రత్యణుపరమాణువుల రహ స్యములను గూడ సంపూర్ణముగా గ్రహింపవలసియున్నాడు. ఇంత సమగ్రమగు తత్వజ్ఞానమును, సృష్టిశిల్పరహస్యమును కరతలామలకము చేయుట కీగ్రంథము పూనుకొనుచున్నది. కావున ఆవశ్యకమైనపట్టుల యధార్థమగు తాత్వికవిమర్శనము గూడ చేయక తప్పదయ్యెను. మొత్తముమీద ఈగ్రంథ మును పూర్తిగాగాని, కొంతగాని యవగాహనము చేసికొను టకు విశిష్టుడగు నధికారి కావలసియున్నాడు. అసలు వేదాన్త శాస్త్రమే ప్రత్యేకాధికారి నపేక్షించుచున్నది. ఆ యపేక్ష ఈగ్రంథమునకుగూడ అత్యంతావశ్యక మందును. జిజ్ఞాసువు నకు – వేదాన్త పరిభాష తెలిసినవానికి – హైందవశిల్ప సభ్య తలో ప్రవేశమున్నవానికి ఈగ్రంథస్థవిషయము సులభముగా నుండును. ఏ నవలవలెనో, నాటకమురీతిగనో చదివి యానం దింప ననువైన కృతిగా దీనిని భావింపరాదు. ఇట్లంటినని విషయములోను – బోధనపద్ధతిలోను ఆకర్షణశక్తి లేదేమో యని భావింపవలదు. తత్వజ్ఞానాభిరుచికలవానికి – లేదా, కనీస మాసక్తియైన నున్నవానికి ఇది సులభముగా గ్రాహ్యమగు చునే యుండును. కొన్నిరహస్యములు మాత్రము గురుముఖ మునవే యెఱుంగవలసినవి ఇందు గలవు.

## కొన్ని విశేషములు.

ఇంకను ఈ గ్రంథము జగత్పితల యథార్థస్వరూపము నెఱుకపఱచి, వారియెడ భక్తిప్రపత్తులను బురికొల్పుచు పాఠకునిగూడ తత్త్వస్వరూపునిగ జేయుచున్నది. బాహ్య ప్రకృతిలోని చంద్రసూర్యులను తలిదండ్రులనుగా జెప్పుట, జ్యోతిశ్శాస్త్రములో చంద్రసూర్యులు మాతృపితృ కారకులగుటను సమన్వయించుట అనుభవనమునకు – శాస్త్రమునకు – చక్కని యనుసంధానమును గూర్చుచున్నది. 'జ్ఞానస్య విజ్ఞాన మాస్తిక్యం' అన్న గీతాసూక్తికి సరియగు వ్యాఖ్యానము చెప్పబడినది (పుట 68). ఆదిమూలమను భాగము సృష్టి ప్రణాళికను నిరూపించుచున్నది. ఇందు సూక్ష్మములగు అవ్యక్త మహదహంకారములు, త్రిగుణములు, త్రికర్మములు మున్నగునవి యెట్లు జగన్నిర్మాణమునకు హేతువులయ్యెనో వివరింపబడెను. అందలి బ్రహ్మపట్టణము, అమృతసరస్సు, ఆ సరసిలో విహరించు హంస జీవాత్మయగుట, సృష్టి పరిణామములోని వర్ణనము మొదలగు నిదియంతయు సత్యసమ్మతమును కవితాపూర్ణమును నగు మనోహరార్థ గుంభనము. బ్రహ్మపట్టణవృత్తాంతము విస్పష్టమగుటకు చక్కని చిత్రరువు గూడ పొందుపఱుపబడినది. గాయత్రీ విశ్వకర్మల దాంపత్యమేమి, సానగాది పంచఋషులచే జరిగిన నాగరికతా విస్తరణమేమి, ఆగామిసంచిత ప్రారబ్ధకర్మల రహస్యములేమి, అతి మనోహరముగను, సహేతుకముగను విమర్శింపబడి విస్తరింపబడినవి.

ఈ గ్రంథమున "దేవలోకము - శిల్పసామ్రాజ్యము" అనునదొక ప్రముఖఘట్టము. మొదట యజుర్వేదమున నుగ్గడింపబడిన పంచశిల్పఋషులు - తరువాత స్కాందాది పురాణములలోను, శిల్పశాస్త్రములలోను మానవనాగరికతా విస్తృతికి కారకులైన తీరు నాధారముగా జేసికొని వారి లోకసేవా విధానమును తీర్థులవారు సమగ్రముగా వివరించినారనవచ్చును. ఈ వివరణము నేటి మానవప్రపంచమును గలతపెట్టు పెక్కు రాజకీయార్థిక సాంఘికసమస్యలకు పరిష్కారములను సూచించుచున్నట్లున్నది. ఈ యంశములను విజ్ఞులు పూర్ణముగా నాలోచింపవలయును. ఇంకను దేవలోకములో నింద్రుని ఖాండవ, నందనవనముల యుదంతములు, బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యవేదములు, మనుశిలానగరాది విశ్వవిద్యాలయములు, పంచబ్రహ్మలు, పంచమూర్తులు మున్నగు విషయములన్నియు ఒకనాటి విశ్వభద్రతను తెలియజేయుచున్నవి. ఇంద్రుడు మహాశిల్పియనుట, ఆ యింద్ర విశ్వకర్మకు - సృష్టికర్తయగు విశ్వకర్మకు గల పోలిక చక్కగా సమన్వయింపబడినది. ఇందుకు వలసిన వేదమంత్రముల యాధారములును జూపబడినవి. ఇట్టి రహస్యములే పెక్కులు కోయంబత్తూరు వ్యవసాయకళాశాలాధ్యక్షుడు పండిత నారాయణగౌడ్ వ్రాసిన "ది మెస్సేజి ఆఫ్ ట్వెంటీయత్ సెంచరి" అనుఆంగ్లగ్రంథమునను అగపడుచున్నది. దేవలోకములోని పరిపాలనవిధానము కలయాపున నిరూపింపబడినది. పంచవేదముల ప్రశంస యిందు సరిక్రొత్తది. అందలి విషయవిభాగక్రమమును క్రొత్తదిగనే కనిపించును గాని ఇందు పంచమవేదమగు ప్రణవవేదముయొక్క ప్రస్తావన స్కాంద

మహాపురాణములో నగపడుచున్నది. పంచర్షుల కాలమున ఈ వేదములను గొందఱు చదువరాదను నిషేధము లేదు. చతుర్వేదవిభాగము జరిగి వర్ణవ్యవస్థ తలయెత్తినపిమ్మటనే కొందఱు మానవులు వేదవిజ్ఞానదూరులైరి. విశ్వవిద్యాలయములు, వానిదృష్టి, బ్రహ్మతత్వజ్ఞులగు బ్రాహ్మణులధర్మము విశేషించి తెలియదగినవి. ఇట్లనేక విమర్శనీయాంశముల సిద్ధాంతము అద్భుతముగా మనముందఱ నిడుచున్నది. ఇంద్రుడు–గోత్రభిత్తు – మేఘవాహనుడు అను నామములను బొందుట సోపపత్తికముగా నిరూపితమైనది. అట్లే సింహాసనము, అష్టదళపద్మము, సహస్రారము, పంచకర్మములు మున్నగు పలు శబ్దముల సార్థకత వివరింపబడినది.

సృష్టిపరిణామములో ప్రకృతి పురుషుల సమ్మేళనము, ఆదిమ దంపతిత్వము సుప్రకటము చేయబడినది. ఆదిమ దంపతులను విశ్వశిల్పకారకులుగను, గాయత్రీ విశ్వకర్మలుగను చెప్పుట వేదములలోని అత్యంత నిగూఢమగు రహస్యము. గాయత్రీ విశ్వకర్మ లిరువురు పంచతత్వాత్మకులును, పంచమూర్త్యాత్మకులును, పంచశక్తి – పంచబ్రహ్మస్వరూపులును, పంచకర్మప్రవర్తకులును, పంచర్షులును అగుటచే వారి దాంపత్యచిత్రణము యుక్తులకును, శాస్త్రమునకును, అనుభూతికిని సమ్మతమైన సత్యావిష్కారము. నిఖిలజీవకోట్లకు వాసయోగ్యములైన వసతులను (దేహములను) గల్పించినవారిని ఆదిమవాస్తు జనకులనుట ఎంత యొప్పిదమో చూడుడు. "వారాదిమ శిల్ప దంపతు లనుట కవిమాటయా, లేక వస్తుతః సత్యమా" అని మనము భావింపవచ్చును. ఆ యంశమునే

తిరువాయిమొళిగ్రంథము సమర్థించి సమన్వయింపుచున్నది. పిమ్మట దేహయంత్ర సృష్టి వర్ణనము. శరీరయంత్ర మహాద్భుతముగా నిర్మింపబడినదికదా! దానిని కవి మనోజ్ఞముగా చిత్రించినాడు.

ఈ శరీర మొక రథమని కఠోపనిషత్తులో మనోహర వర్ణనము కలదు. సుందరమును, ఉపయోగకరమును అగు నీ రథమును నిర్మించిన రథకారు డెవడు? ఎవఁడో యొకఁ డున్నాఁడు. ఆ రథకారుని చేరుకొనుటకే జీవరథికున కీ రథమని ఆ యుపనిషత్తు హృదయము. ఆ యాదిమరథకారుని తెలిసి కొనినగాని జీవు డమృతుడు కాజాలడు. అప్పటికిగాని యాతనికి జన్మ పరిపూర్తి కాదు. ఈ యంశము నీకవి యిట్లు సూచించెను_

"తండ్రి ప్రత్యగాత్మ తల్లి హిరణ్మయి
దంపతులయి నీకు తనురథాలు
రచన చేసినట్టి రథకారదంపతి
పూజన మొనర్పఁ బూనరావె!"

రథస్వరూప వివరణములో తనురథసృష్టికిగల యుద్దేశ్యమును మానవులు వమ్మొనర్చుచున్నారని కవి చింతించినాడు.

దేహ మొక యంత్రమును, రథమును మాత్రమే కాదు. అది యొక సౌధము కూడను. అది సాధనమైననే గాని పత్నీసహితు డగు జీవు డింటి (గృహ) ప్రవేశమయి మోక్షపురుషార్థమును బడయలేడు. అందుకే తిరువాయిమొళిగ్రంథములో సౌధాభివర్ణనము చక్కగా చేయబడినది. దేహసౌధములోని ఏడంతస్తులను పోల్చిన సప్తచక్రాభివర్ణన మద్భుతముగా నున్నది. సాధకు డెన్నియో రహస్యముల నా ఘట్టమునందు తెలిసికొనగలుగు

చున్నాడు. ఆధారమును మఱుగుదొడ్డి యనుట, మణిపూరకమును వంటయిల్లనుట, అనాహతమును నిద్రింపదగిన పడకటిల్లనుట, గాలికి నెలవనుట, విశుద్ధమును విశ్రాంతిభవనమనుట, సహస్రారమును దేవమందిరమనుట సాధకుల యనుభవములను సాధనమార్గమునకు ద్రిప్పుచున్నది. ఈరీతిగా నే డంతస్తులతో – ఏబదినాలుగు తిరుగుడుమెట్లుగల మేడ తయారైనది. దీనిని నిర్మించుట కెంతటిశిల్పకౌశలము కావలయునో చూడుడు. ఈ మేడ తయారగుట కైదు నెలలు పూర్తిగా బట్టినవి. ఆరవ మాసమున అవిద్యాజీవు లను – వధూవరుల గృహప్రవేశము, పిండోత్పత్తియైనదావి యారవ మాసమున జీవప్రవేశము జరుగునని వేదాంతశాస్త్ర సంప్రదాయము. ఈ సందర్భమున ఏబదినాలుగుమెట్ల మేడ యని దేహమును గూర్చి చెప్పుట సామాన్యము కాదు.

తరువాత వధూవరులనుగూర్చి చేసిన బోధ, గురు మహాదేవుని ప్రబోధము మొదలగునవి గర్భస్థ శిశువునకు గలుగు జ్ఞానమన్నమాట. అటుపిమ్మట అవిద్య కొంతకాలము మఱుగుపడగా (8౬వ పద్యము చూచునది) జీవున కాత్మదర్శనమైనది. తిరిగి మాయ యడ్డుపడుట, జీవుని విచారము, భార్య ప్రతారణము, గురుని జీవప్రబోధము – ఇది యంతయు సృష్టి పరిణామమే కదా!

ఈ సందర్భమున గురు డొనర్చిన ప్రబోధ మంతయు సాధనప్రణాళికయై యున్నది. ఏమార్గముల ననుసరించినచో జీవుడు దుఃఖదూరుడై యాత్మముక్తి నందునో తరువాతి గ్రంథము చూపించుచున్నది. ఈ ఘట్టమున 109వ పుటలో

వివరింపబడిన కర్మతత్త్వనిరూపణము సాధకులకు మిక్కిలిగా ప్రోత్సాహమునట్టిది. "గహనా కర్మణో గతిః" కర్మగతి సులభముగా తెలియబడునదికాదని గీత పలుకుచున్నది. కావుననే గీతాకారుడు కర్మాకర్మ వికర్మలనుగూర్చి ప్రస్తావించినాడు. ఆ కర్మప్రస్తావన కా యా భాష్యకారులు పలురీతుల నర్థములు చెప్పిరి. పలువు రా ఘట్టమున ఆగామిసంచిత ప్రారబ్ధములను తడవనేలేదు. గీతాకారుని దృష్టి ఈ త్రికర్మములమీదను ప్రసరించియుండకపోదు. అట్టి ఘట్టములలోని గంభీరార్థమును తీర్థులవారి యీ పద్యము వివరించుచున్నదా యని నాకు తోచుచున్నది.

"అనుభవించు కర్మ మది అకర్మంబౌను
దానియందు కర్మ మూనరాదు
ఆచరించు కర్మ మది కర్మమౌగాన
దానియందు కర్మమూను జీవ!

అను భావము చాల గంభీరమైనది. జీవు డీ జన్మమునం దనుభవించు కర్మను పూర్వజన్మములో చేసికొన్నట్టిది. కావున దానిని కర్మమనరాదు. ఆ పూర్వజన్మకర్మము ననుభవించుచు జీవుడు కొంత యాగామికర్మమును సృష్టించుకొనుచున్నాడు. అట్టి యాగామినే బంధకముకాగల కర్మనుగా భావించవలయునట. ప్రారబ్ధ మెట్టి యోగికైనను అనుభవింపక తప్పదు. ప్రారబ్ధముననుభవించుచు యోగియగువా డాగామిని సృష్టించుకొనకుండ మెలకువగా నడచుకొన్న, నట్టివాడు కర్మబంధవిముక్తుడు కాగలడు. ఈ రహస్యము కర్మమర్మముల నెఱింగి

అనుభవించుచు కర్మ చేయగల ఉత్తమోత్తమ సాధకునికి లేక సిద్ధునికో గాని తెలియనట్టిది. ఇట్టి మహత్త్వపూర్ణ రహస్యములను ఈ గ్రంథముఖమున వెల్లడించిన శ్రీగురువారు అనేక ముముక్షు సాధక ప్రపంచమునకు మోక్షమార్గ దర్శకులగు యుత్తమ వేదాన్తదేశికులై వారి శాశ్వతకృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. ఇట్టి విశేషము లనేకము లీగ్రంథమున గలవు. వాని నన్నింటిని విస్తరభీతి నీ చిన్న పరిచయమునందు వివరింపజాలను. ఇట్టి విశేషములచేతనే యీ కృతి ఉపనిషత్ప్రాయ మగుచున్నదంటిని.

తరువాత కామాదులజయించు పద్ధతి, త్రికరణములు, హాని కర్మగతులు, యజ్ఞశిల్పములు మున్నగునవి దంరాయి. సాధకు డాచరించవలసిన సాధనవిధానమే. ఈ రీతిగా—

అఖిలసృష్టి సలుపనయ్యె జగచ్ఛిల్పి
సృష్టిరచనమెల్ల శిల్పమె యగు
సృష్టిలోని జీవకృతు లౌను శిల్పము
అంత శిల్పమయమె అగును జీవ.

అని చెప్పుచు జగచ్ఛిల్పము ముగియుచున్నది.

మహానీయమగు నిట్టి జగచ్ఛిల్పము నెఱుంగక, జగచ్ఛిల్పి తత్త్వమును దెలియక, సాధనవిధానముల ననుసరింపక "అహం బ్రహ్మాస్మి" అను వాచావేదాంతమును మాత్రము ప్రకటించుట అనుభవపరులగు శ్రేష్ఠులవారి కిష్టముకాదు. కావుననే "నిత్యకర్మిష్ఠు"డగు కన్నతండ్రి నుదాహరణముగాజూపి

"అవశ్యం పిశాచాచారం" అను నీతిసూత్రమునకు ప్రాధా న్యము నిచ్చినారు.

ఈ గ్రంథములో "ప్రణవ" శబ్దమునందలి "నవ" పదమునకు త్రిభూతములు - త్రిగుణములు - త్రివర్ణములు నని యర్థముచెప్పుట క్రొత్తరహస్యము. త్రివర్ణములతో గూడినది ప్రణవమని యింతివరకును వినుచున్నాము. తనురథ నిర్మాత లగు నాదిమ దంపతులను - గాయత్రీ విశ్వకర్మలను రథకారు లనుటయు, దేహమును సౌధమని చెప్పుటయుగూడ నద్భుతార్థ రహస్యవివరణమే. ఇంకను ఏబదినాలుగు తిరుగుడుమెట్ల మేడ నుగా దేహమును బోల్చుటెంతయు సెన్నదగినది.

శ్రీ తీర్థులవారీ గ్రంథమున వ్రాసిన పద్యములన్నియు ఆటవెలదులలోనే నడిపినారు. వేదాంతవిషయ బోధ కాట వెలదుల నుపయోగించి కృతకృత్యుడైన మొదటికవి వేమన యోగి. అట్లే వీరును దేశిచ్ఛందమును నాటవెలదిలోనే వేదాంతబోధచేసి "అభినవ వేమన" యైనారు. వేమనగారి శైలి, సరళ మున్నగులక్షణములు వీరిపద్యములకు నలవడినవి. తీర్థులవారు భాషాపండితులు కారు. అనగా భాష రానివారని కాదు; కొందరుచూచిన పండితులుకారనియర్థము. కావుననే కొన్ని భాషాదోషము లగపడును. జ్ఞానవిజ్ఞానములలో సాటి లేని పండితులే. కావుననే ఒకబుద్ధిమైన సత్యములను జాటి నారు. గ్రంథనిర్మాణ విధానములోగూడ వీ రెక్కువ శ్రద్ధ చూపలేదేమో ననిపించును. ఆయా విషయములను వరుసగా గూర్చుకొనుటలోను, పునరుక్తి వాటిల్లకుండ చూచుకొనుట

లోను వీరు ఉపేక్షవహించిరా యని రచనాశిల్పము నెఱింగిన పండితుల కనిపించును.

తత్త్వరహస్య భరితమగు నీ మహత్తర గ్రంథమును పాఠకు లర్థము చేసికొని యందలి విషయముల నాచరించి ధన్యు లయినచో గ్రంథకర్తగారి కృషి సఫలము కాగలదు. తీర్థులవా రిట్టి గ్రంథముల నింక ననేకములను వ్రాసి భాషాసేవయొనర్ప నా జగచ్ఛిల్పి యనుగ్రహించునని యాశించు వినీతుడు —

ఆంధ్ర శిల్పకళాపరిషత్తు,
దుర్ముఖి - భాద్రపదము
తెనాలి. 6-9-56

ఇట్లు
కొంపూరు వీరరాఘవాచార్యులు

—*—

# పండితాభిప్రాయములు

## జగచ్ఛిల్పము

ఇది పరబ్రహ్మార్థకవి విరచితము. ఈయన ఇంటిపేరు కోలవెన్ను. శ్రీకృష్ణుని వేణుగానమువలె ఈయన కవితాగానము కోలలకు వెన్ను గల్గించుచు, మనోహరమగు ఆనందసస్యము నొసంగి శ్రోతల సొప్పుపడయగలదు. కొంతవడి శ్రీ వేమన గారి పద్యాలపోల్కి యీ పద్యాల కున్నట్లు చెప్ప నొప్పు. ఈయనపద్యములన్నియు నాటవెలదులే. "నాట్యకళాసక్తి నెల్లి విరియు ఈకాలనమున ఆటవెలదుల (నాట్యకన్యల) కన్న ఆనంద దాయక వ్యక్తు లేవి?" ఈ కవికిని నాకును సుమారు నలువది సంవత్సరములక్రింద నొకమారు కల్గిన పరిచయమే. మరల మొన్న చూచుటయే. ఆమాత్రపు మైత్రియే తనపుస్తకమునందు నాఅభిప్రాయము వలయుననుకోర్కెతో ఈ కవివరుని మొన్న మాయింటికి రప్పించినది. అబ్బా! "శ్లో॥ సతాంసాప్తపదీ" అనుసూక్తి యెంతసత్యమో గదా! కవిత్వము శుద్ధము, స్పష్టము, సరళము. అందరికిని అందుబాటులో నుండును. విషయము వేదములు మున్నగువానిలోని విషయమే. దానిని చిత్రముగా మార్చి రచించుటలో ఈయన ప్రతిభ గొప్పది. ఉదాహరణకు ఒక విషయము జూపుదును. ప్రణవ, శబ్దమున ప్ర, ఉపసర్గను లాగినచో, (నవ) అను పదము మిగులును. ఈపదమునకు, తొమ్మిది అని అర్థము. ౧ అవ్యక్త ౨ మహత్తు ౩ అహంకారం ౪ సత్వము ౫ రజస్సు ౬ తమస్సు ౭ అ ౮ ఉ ౯ మ్. మొత్తము తొమ్మిది సంఖ్య సరిపెట్టి, అనుభవమునకు

వచ్చునట్టి విలక్షణార్థములగు భావములను కవి పద్యములలో నింపినారు. ఇట్టివి చాలగలవు. ఈ గ్రంథము విద్యార్థులకత్యుపకరమనియు సర్వాదరణీయమనియు నా అభిప్రాయము.

'అవధాన శిరోమణి'
కాశీ కృష్ణాచార్య.

గుంటూరు
1-10-56.



౨

## 'శతావధాని' వేలూరి శివరామశాస్త్రి

తమ జగచ్ఛిల్పము చదివి ఆనందించితిని. ఇంపిలి విషయములు ఎంత దొడ్డవో తెలుపనక్కఱలేదు. వానిని ఈ ఆటవెలదు లెంత తేటగా ప్రదర్శించినవో కదా! ఒక ఛందస్సుతో ఒక లయతో ఒక సముద్ర మొచటికో ప్రయాణము చేయుచున్నటులున్నది. జగచ్ఛిల్పములోని మీశిల్పము బలే! వేమన్నతరువాత, బ్రహ్మంగారితరువాత, వారి భావనా తంతువు జగచ్ఛిల్పములో అనుస్యూతమయినది. (బ్రహ్మంగారి మాపకాతిశయోక్తియు (Mysticism), వ్యతిరేకలక్షణయు అన్యమన్లభములు) మీ శిల్పమునకును ప్రతిభకును జయు పెట్టుదును.

—వేలూరి శివరామశాస్త్రి

చిరివాడ
19-9-56.

ప్రభుత్వాస్థానకవులు,కవిసార్వభౌమేత్యాదిబిరుదాంకితులునగు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారొసంగిన

# అభిప్రాయము

శ్రీరస్తు

## జగచ్ఛిల్పము

ఇదియొక వేదాంతగ్రంథము. జగత్తు సర్వమును శిల్పమే యని చెప్పును. దీనిని బ్రహ్మశ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థశిల్పాచార్యులుగారు రచించి యున్నారు. ఈ గ్రంథమునకుఁ బీఠిక వ్రాయవలయునని నన్నుఁగోరినారు. కాని నాకది సాధ్యముకాని దిగా కానుపించినది. శిల్పాచార్యులుగారు గొప్పగొప్ప వేదాంత గ్రంథములు చదివి ఆ గ్రంథానుసారముగా ముక్కకు ముక్క యెత్తి వ్రాసిన గ్రంథము కాదిది. ఆచార్యులుగారు తమకు గలిగినగొప్పఅనుభవముచేత వ్రాసియున్నారనుట నిశ్చయము. ఈగ్రంథమునకు కవిగారే విపులమైన టీక వ్రాసి ప్రకటించినపుడే గ్రంథ ప్రభావ మెఱుంగ వచ్చెడిని. లేకున్న అనుభవసిద్ధమైన వారి యభిప్రాయము సామాన్యముగా నితరులు తెలిసికొన సాధ్యము కాదనుట నిశ్చయోక్తియే. గ్రంథములనుండి యెత్తి వ్రాసిన వ్రాతలకు గ్రంథములే సమాధానము చెప్పును గావున అట్టివాని కెట్టులైన వ్యాఖ్యానములుగాని,పీఠికలుగాని వ్రాయుట సులభసాధ్యమని మఱియుం జెప్పుచున్నాను. అయినను వారి కోరికం ద్రోసిరాజనఁజాలక నాకుఁ దోచినట్లు ఇట్లు వ్రాయుటకు సాహసించితిని.

జగచ్ఛిల్పము మూడుకాండలుగా విభజింపఁబడినది. అందు మొదటిది కర్మకాండము. రెండవది యుపాసనా కాం

డము. మూడవది జ్ఞానకాండము. ఆదిభాగమగు కర్మకాండము మొదట సృష్టితత్వముం దెలుపుచు నానినువంపతులఁ జేర్కొని వారివలన జగత్తను సంతానము కలిగినదని చెప్పుచున్నది. లోకములో సంతానమునకుఁ దల్లి ముఖ్యురాలు. కావుననే ప్రథమపూజార్హురాలగుచున్నది. అట్లు గావింపక —

"తల్లిఁ దండ్రి పీడి యిల్లాలినింగూడి
యిల్లువదలి యద్దెయిల్లు చేరి
కల్లరీంద్రమైత్రి నుల్లాసముగఁ జేసి
తల్లిదండ్రులన్నఁ దలఁపఁబోరు."

ఇల్లుపీడి యనఁగా అజ్ఞుడయినవాఁడు స్వస్థానమగు బ్రహ్మపదమును విడిచి, అద్దెయిల్లు చేరియన నజ్ఞానమగు సంసారమునఁ జేరి, తల్లిదండ్రులను దెలియనివాఁడై పతనమగుచున్నాఁడని యభిప్రాయము.

### తనువులు - అవస్థలు

"తనువనంగ నొక్క తనువేమొ గాదింక
తనువునందు నాఱు తనువులుండు
జాగరమున కూర్ధ్వభాగాన మూఁడును
దిగువయందు మూఁడు దీరియుండు."

ఇందు షట్తనువుల రహస్య ముగ్గడింపఁబడినది. ఇట్లే యింక ననేక పరమాద్భుతవిషయముల నుదహరించినారు.

### కర్తవ్యము

"సృష్టి యొకటెయైనఁ జేయుదు రిరువురు
తల్లిదండ్రులనగ నెల్లపుడును

వక్త్రి మొకటియైన వాక్కు జిహ్వాయు నందు
రెండుపనులు చేయుచుండునట్లు.''

జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వేఱువేఱుగానే యుండును గాని జిహ్వేంద్రియము వాగింద్రియమును గలసియుండునని యద్భుతవిషయము లిట పేర్కొనిరి.

మాతృపూజ

''తల్లితత్త్వ మరసి ధ్యానింప నేర్చిన
తన్మయత్వమైన తత్త్వ [illegible]సంగి
తత్త్వమార్గమందుఁ దండ్రి తత్త్వమొసంగి
తా నదేమొగాని గానకుండు.''

ఇందువలన తల్లినే ముందు ధ్యానింపవలయుననియు, దానివలన తండ్రిని సేవించినవాడగుననియు, లోనగు సంగతులు వివరించి దీనివలన దంపతిపరమైన గాయత్రీమంత్రము నాదిని ధ్యానించి తదనుగ్రహము వడసి తరువాత తదర్థమగు తండ్రిని తెలిసికొని విజ్ఞానవంతులగుచుందురు.

పిండబ్రహ్మాండములు

కార్యకారణరూపముల నిరూపించి ఆకాశమున నచలమై భాస్కరుఁడు వెలుఁగుచుండ వాని విద్యుదాధారమున చంద్రనక్షత్రాదులు చలనరూపము నొందునని వ్రాసినారు. ఈ సందర్భమున సూర్యాదిగ్రహముల పిండాండాధిపత్యములు నిరూపించి వీరే సమస్తభూతకోటికి జీవనాధారము లగుచుందురనియు చెప్పినారు. అంత సత్త్వ రజస్తమో గుణముల శబ్దోత్పత్తియు తత్ఫలములుం జెప్పి అస్తినాస్త్యకతను బహువిధము

లగు నుదాహరణములలో దెలిపిరి. అవి చదివితీరవలయును. అటు కానఁబడుచుండు జగ మెప్పుడు కానఁబడకుండును? అప్పుడు కానఁబడని బ్రహ్మము కానఁబడునని చక్కగా నుడివిరి. విద్యుద్రూపము కానఁబడనిదయ్యును శిల్పరచనచేరూపము కానబడునట్లు పరమేశ్వరుఁడు కానఁబడనివాఁడై వాని తేజశ్శక్తి విశ్వశిల్పమువలనఁ గానబడునని చెప్పిరి.

## గ్రహములు దేవతలు శిల్పులే

దేవేంద్రుడు గొప్ప శిల్పియనుచు ననేక వేదప్రమాణములచేగూడ నిరూపించి గ్రహములు శిల్పులని మున్నే చెప్పిరి. జ్ఞాన విజ్ఞానములు – జ్ఞానమనగా తెలిసికొనఁదగినవి తెలిసికొనుట. జ్ఞానులు దాని నాచరించుట విజ్ఞానము.

## ఆ ది మూ ల ము

ఇదియే యుపాసనాకాండము. ఆదియైన మహాకారణమునకు మూలమైనదిగాన నాదమూలమనియు, అది కొన్ని పరిణామములచే బిందువుగా నొనర్పఁబడినదనియు అందుండి తోచిన నవకవర్గము నాధారమున బ్రహ్మపత్తనమును, దాని మధ్యమున గర్భాలయమును, అంతరాలయము, ధ్వజము ప్రాకారము లా మాయాదేవి నిర్మించినట్లును, ఇంక కోట అగడ్తలు బురుజులు దానిచుట్టి త్రిపురాలు, త్రివేణులు అడవి మున్నగునవి నిర్మింపబడి ఆ పత్తనమునకుఁ బోవ మార్గముగ బ్రహ్మబిలమును నిర్మింపబడి అందు నాలుగు కవాటములు, దానియందుఁ బడి యారచ్చు లేర్పడి నవనియు, ఆ బిలము బ్రహ్మకు వాక్కుగాను అందా ప్రకృతి రసనగాను పలుకు

వెలందియై శబ్దము పలికించుచుండుననియు, అదియే సరస్వతి యనియు వ్యవహరింతురని

"శ్రోవ తుదిన లోన స్థూల సూక్ష్మమ్ముల
సమ్మృతరసము సరసియందుఁ బార
సకల కర్మరూప శబ్దామృత ప్రవా
హమె సరస్వతి యన నాఖ్యనొందె."

పంచఋషి మండలము

ఈ యజనాభి దేశమున పాఠశాలలు షట్కర్మలు, షడ్గుణములు, షట్సమాధులు, సారస్వతము, వేదములు, పంచఋషులు, వారి విశిష్టత లోనగునవియెల్ల శిల్పసామ్రాజ్యముగా నేర్పడినవనియు, బ్రహ్మపట్టణమను నొక చిత్రపటము చూపి దానిగూర్చిన వ్యాఖ్యానముగా వృత్తాది బ్రహ్మాకార పర్యంతము పదియైదు శిల్పకర్మను లొనర్చి ఆ మాయాశక్తి పంచదశినామము నొందినదని చూపి ప్రస్తుతాచరణమున నున్న శ్రీచక్రమునకును పైనుదహరించిన బ్రహ్మపట్టణమునకును సంబంధము చూపఁబడెను.

సృష్టి పరిణామము

ఇది మూడవదగు జ్ఞానకాండమును శృంగారకాండమనియుఁ జెప్పినారు. అందు మాయ యను కాంత కొంత కొంత విలాసములం జూపుటం జేసి శృంగారమని చెప్పుటయు సమంజసముగా యున్నది. ఈ పేరు పెట్టుటకు మరియొక మంచి కారణముకూడ నున్నది. ప్రతి రోకనాటిరాత్రి నాలుగుగంటలయినప్పుడు తెల్లవారుఝామున జాగ్రదవస్థలో జ్ఞానావలోకనము చేయుచుండ సృష్టిపరిణామము లోచనగోచరమైనది.

అప్పు డందులో నిరువదినాలుగు పరిణామములు కానుపించిన వట! తెల్లవారినపిమ్మట వ్రాయుటకుఁ బ్రారంభించి రాత్రి తోఁచిన యిరువదినాలుగును వ్రాయనెంచి వివరముగా వ్రాయ లేకపోయిరట! కాని యందు మొదట శిశువు, తరువాత బాల, ఆతరువాత యువతిగాను తోఁచుట మాత్రము వ్రాయ కలిగి యా యువతి చర్యలంబట్టి దీనికి శృంగారకాండమని పేరు నొప్పనని చెప్పుట సమంజసము.

ఈ భాగమున పైన చెప్పఁబడిన యువతీవిహారము 50 పద్యములలో నిమిడింపఁబడియున్నది. అప్పటికి దంపతిత్వ మేర్పడినది. శిశువు క్రమముగా బాల, యువతియై దాంపత్యా నందము నొందువఱకు గల భాగము మిక్కిలి చక్కఁగా శాస్త్రో క్తముగాఁ జిత్రింపబడి సృష్టితత్త్వప్రకాశము జేయుచున్నది.

పైనఁ జెప్పఁబడిన శృంగారములోఁ బ్రణవోత్పత్తియగు నందు "ప్ర" యనుదాని నుపసర్గ నెంచిన "నవ" యేర్పడు. ఆ నవకము త్రిభూతములు, త్రిగుణములు, త్రివర్ణములనఁబడి నదై జగత్కారణమగును. ఇట్లే పురుషులు ప్రణవమను ఓంకార మున కిట్టి మహాదర్థము చెప్పియుండలేదు. అకార ఉకార మకార ములు మాత్రమే చెప్పియున్నారు. ఇట్లు నవశబ్దము నిరూపించి చెప్పుట నవనవత్వమును వెల్లడించుచున్నది. పైఁ జెప్పిన దంప తుల గాఢప్రేమయే క్రీడయైనది. అదియే విశ్వసృష్టి! అట్టి ప్రణవార్థము వలననే ప్రపంచసృష్టి కారణమైనది.

ఈసృష్టిలో మొదట బ్రహ్మాండము. అది కాలగతులం దెలుపును. విద్యుత్తుచే నన్నిగ్రహములు నేర్పడి పెద్దగడియా రము వలెఁ దిరుగుచుండును.

మాయయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయ అధిష్ఠాన చైతన్యము ఈ మూడును గూడి యీశ్వరుఁడై జన్మించెను. ప్రత్యగాత్మ యను జనకు నాదేశమున బ్రహ్మాండ మండల ప్రధానమంత్రిగా నుండెను.

పిండాండము. ఇది కాలగతులఁ దెలియు గలుగునట్లు హృదయమునందుఁ జిన్న గడియారమునలె చలించు చుండును. జీవుఁడు పిండాండ వ్యాపకుడై జనన, మరణ దుఃఖసామ్రాజ్య వృద్ధిచేయునట్టివాడయ్యె. ఈసందర్భములో సూచించిన అవిద్య జీవుడుఅహంకారము, మహత్తులోనగునెన్నో విషయములిందు అపురూపముగాఁజూపియున్నారు. ఈసమస్తసృష్టికిఆదిదంపతులు లాట గాయత్రీ విశ్వకర్మలుగా నెసంగి సర్వసాక్షిగా నున్నారు.

సకలభువన సామ్రాజ్య జీవకోటి సదనములకు వాస యోగ్యమైన వసతి గల్పింప వారు జనకులైరి. సమస్త శరీరములు యంత్రములుగాను, రథములుగాను, సౌధములుగాను నిర్మించిరి. తల్లి గాయత్రి యంశముచేత తనువు యంత్రములయ్యెను. అందు దండ్రి విశ్వకర్మ యంశమున తేజము అలరుచుండును.

ఇంక రథములు— రథములను శరీరముల నొంది తల్లి దండ్రుల విషయముల తెలిసికొనుటకుఁ బోవ ప్రయాణ ప్రయత్నము చేయక పొట్టకూటికైన పోరు సలుపుచుందురు.

సౌధము— దానికి నేడుఅంతస్థులు అవ్వలోకములుగను చక్రములుగను, శాలలుగను, కమలములుగా నుండును. అందు నయిదు మాత్రము భూత సంబంధములు. రెండు మాత్రము

పారమార్థికములు. అందులోనొకటియిహము రెండవది పరము. వాస్తు విహితమైన భూమిమీద రెండు నిట్రాడులు (కాళ్లు) పాదములు పునాదులు అవి మూడు కీళ్లుగలిగి కూరుచుండి లేచి పాఱుచుండగలవు. ఆపాదములలోని కమ్ములుపది చిట్టచివర పది వ్రేళ్ళయందు నిరువది యెనిమిది చిన్నముక్క లుండును. చీల మండలకు పదినాలుగు ముక్కలు. ఆపైన నాలుగు బారు కమ్ములు ఇత్యాదులు రెండు వందల పైచిల్లర కమ్ములు (ఇవి నెమ్ములు) అని తెలియందగు. ఇది అంతయు శరీరతత్త్వ మిట్లు నిరూపించి ఆధార కమలమందు బ్రహ్మ నిలిచియుండె.

ఇట్లు ఆధారచక్రము, స్వాధిష్ఠానచక్రము, మణిపూరము, అనాహతము, విశుద్ధము ఇట్లు నిర్మించి దానికిఁ దగు నధిష్ఠాన దేవతల నేరుపఱచి ఇందు నారవదియైన యాజ్ఞేయ చక్రమున సూర్య దేవతాకముగా చేయంబడె. ఆగ్నేయమందు ద్వితీయ పుత్రుడైన జీవుడు ప్రవర్తించుచుండును. ఏడవదియగు సహస్రారము దేవమందిరము దేవతార్చనార్థము నిలుపంబడె. ఈ దేహమను సౌధమునకు 54 మెట్లు. ఇట్లు 5 నెలలు నిర్మాణముచేసి సౌధమునందు నూత్న దంపతుల (అవిద్యాజీవుల) పెండ్లి చేసి ప్రవేశపెట్టబడెను.

ఇట్లు బహురీతుల శరీరతత్త్వముం జెప్పి సహస్రార దేవ మందిరమందు స్వస్వరూపానుసంధానమందునుండ అవిద్యయను భార్య యైహిక సంబంధమునఁ క్రిందికి లాగినట్లును దాని వలన జీవునకు దుఃఖావస్థ కలిగినట్లును, బుద్ధి కధిపతియైన గురునిగూర్చి ప్రార్థింపగా అతఁడు ధర్మోపదేశ మీక్రిందివిధమున గావించును.

"ఆ॥ చింతవీడు మింక జీవుడ! నావల్ల
సదుపదేశములను సంతసమున
నాలకింపువేాయి యాకాంక్ష నెప్పుడు
నందువలన సుఖము లందఁగలవు."

"ఆ॥ కారణంబులేని కార్యముల్ గనరావు
కార్యములకు భార్య కారణంబు
భావి కర్మములకు భార్య క్రిందికిఁద్రింపె
నంతమాత్రమునకుఁ జింతయేల."

ఇట్లనేక విధంబుల దేహతత్త్వ ముపదేశింపఁబడును. పిమ్మట పేర్కొనదగినది ఉపనయన తత్త్వ వివరణము. ఇందలి రహస్యము ప్రతి సాధకుడు యెఱుంగదగినది. తరువాత నిహాపర ప్రసంగముచేసి కర్మతత్త్వము—

"ఆ॥ అనుభవించు కర్మ మారబ్ధమాఁగాన
ననుభవింప నద్ది యంతమొందు
ఆచరించు కర్మ మాగామియా గాన
సంచితమను కర్మ సలుపుజీవ!"

కామక్రోధాదులయందును వానినిఁ దగినవిధమున నడంచివేయు మనియు, మనోబుద్ధి చిత్తాహంకారములు నలుగురు నీకు మంత్రులు వారి వ్యాపారము నిరూపించుచు పిమ్మట సత్య పథ్యములగూర్చి చెప్పుచు:—

"ఆ॥ సత్యపాలకుండు సత్యస్వరూపుండు
సత్యవాగ్విభుండు జనకుడౌట

సత్యవాక్కుతోడ నిత్యంబు నీవుండి
జనకు పూజ నిట్లు సలుపుజీవ.''

పిమ్మట త్రివిధ యజ్ఞములు వాని ఫలములు నిరూపించిన వెనుక శిల్పముల గురించి చెప్పుచు—

''ఆ॥ రాజ్య తంత్ర, యంత్ర, రాజకీయోద్యోగ
రాజ్యపాలన స్వరాజ్య శిల్ప
మాతృదేశసేవ పితృసేవనమ్మును
సలుపు పనులు శిల్పములగు జీవ.''

''ఆ॥ విశ్వశైల్పికమగు విశ్వజీవి జనాళి
కవసరమ్మలైన యన్ని పనులు
శిల్పరచన మగును శిల్పేతరంబైన
పనియొకండు గానఁబడదు జీవ.''

''ఆ॥ కామ్యరహితముగ జగచ్ఛిల్పులను లక్ష్య
మెంచి సలుపు రచన లెవ్వియైన
సత్యజీవనమున సహకరించు నవెల్ల
శిల్పకర్మములయి చెల్లుజీవ.''

తరువాత మండలత్రయముల పేర్కొని ఆత్మశక్తితో నిర్మింపఁబడిన మహాబ్రహ్మాండమందు ప్రత్యగాత్మ యధిపుఁడుగా నుండి హిరణ్మయమండలము గ్రాలుచు సకలభువనసృష్టి చేయుచుండు.

బ్రహ్మాండము:- విద్యుచ్ఛక్తిచే నైనది. దాని కధిపతి సూర్యుఁడు. అదియే రజితమయమండలము.

పిండాండము:- ప్రాణశక్తిచే నైనది. దాని కధిపతి జీవుఁడు. అదియే అయోమయమండలము.

ఇట్లు చేర్కొని తరువాత ఋషులప్రభావము వర్తనముం జెప్పి అనేక కావ్యపురాణాదులు కవులు విపులముగా వివరింపుచు తమ కృతజ్ఞతం బ్రకటించి పిమ్మట సన్న్యాసమునుగూర్చి, బాహ్యవేషమునకన్న అంతరసన్న్యాసమే ముఖ్యమని చక్కగా నిరూపించి చివర —

"ఆ॥ ఆటవెలదులందు మాటాడఁ దల్లిగా
యత్రిప్రేరణంబు నందఁగలిగి
మాతకరుణఁజూపు మార్గాన నీ జగ
చ్ఛిల్ప కావ్యమును రచించినాఁడ."

అని గ్రంథసమాప్తి చేసినారు. ఇట్లు నానావిధములగు నీ బ్రహ్మసృష్టియంతయు శిల్పమని ప్రమాణీకరించుచు, దీనికి "జగచ్ఛిల్ప" మని పేరు పెట్టినారు. ఇది జిజ్ఞాసులగు వారికి పరమోపదేశ మొనరించు గురువై తరింప జేయఁగల దనియు, దీనివలన మముబోంట్లకుఁ దెలియని యనేక విషయములు దెలిసికొనవచ్చు ననియు జెప్పుచున్నాను. ఇది చదువరులకు నూతనమార్గముగా దోచినను ప్రకృతిసృష్టి చిత్రదర్శనమున నంతయు సనాతనమని యెఱుఁగుచును. ఈ గ్రంథమంతయు 900 ల, ఆటవెలది పద్యములతో మనోహరముగా రచించినారు. ఇందలి భాషయు, కవితయు, సహజసరళములు మృదుమధురములునై వేమనపద్యముల బోలియున్నవి. శైలిసులభమేగాని కథాంశమతిగోప్యమగుటచే నెల్లరకు సుబోధమగుట కష్టము. దీనికి విపులమైన తాత్పర్యమును వ్రాసి ప్రకటించినచో కవిగారు లోకోపకారము చేసినవారగుదురు. ఇది పాఠశాలలలో వేదాంత

మభ్యసించువారికి మిక్కిలిగా నుపయోగించు ననియు చెప్పు చున్నాను. ఈ గ్రంథనిర్మితియందు పరబ్రహ్మతీర్థశిల్పాచార్యుల వారెంతయో శ్రమపడిరనియు, నెన్నో గ్రంథముల పరిశీలించి తదర్థావబోధము గావించుకొని కొన్ని సంవత్సరములలో దీనిని పూర్తిగావించి యుందురని భావించుచు వారి పరిశ్రమ కద్భుతపడుచు వారి పరిశ్రమను ప్రజలు గ్రహించువారై వారి నాదరింతురనియు, వారికి పరమేశ్వరు డాయురారోగ్యై శ్వర్య భాగ్యము లొసంగి రక్షించుగాతయనియు ప్రార్థింపుచు నింతటితో విరమించుచున్నాను.

రాజమండ్రి
16-9-56

ఇట్లు
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రభుత్వాస్థానకవి.



From

Dr K. Satchidananda Murty,
Head of the Philosophy Dept.,
Andhra University.

Waltair,
March 15-55.

Dear Mr. Tirtha,

Thank you for your kindness in sending me your book Jagat-silpa. I have cursorily glanced through it. Your efforts to bring out the importance of Silpa are praiseworthy. In the present context India is in great need of Siipa arts, crafts and technical skills of every variety and I hope your book will enable at least some to see how our ancient books gave great importance to this.

With all good wishes.

Yours sincerly,
(Sd.) K. S. MURTY.

---

సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులుగారి

అభిప్రాయము.

కడప.
23-4-57.

అయ్యా,

తమరు దయతో బంపిన 'జగచ్ఛిల్ప' మను కావ్యమును జూచితిని. రచన చాలా అందముగా నున్నది. వేదాంతమును పద్యములలో జెప్పుటచాలకష్టము. దానిని చక్కఁగా జెప్పగలశక్తి ప్రాచీనులలో నొక పోతన్నకే యబ్బెను. మీరచనలో నాతని ఛాయలు కొన్ని కనపడుచున్నవి. శిల్పశబ్దమునకు మీరొసగిన వ్యాఖ్యానము బాగుగా నున్నది. సంతోషము.

ఇట్లు,
(Sd.) పుట్టపర్తి.

# చిన్న మనవి

జగచ్ఛిల్ప గ్రంథప్రకటనము పూర్తిగాక పూర్వమే ఏతద్గ్రంథకర్తలగు పూజ్యశ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థుల వారు పరమ పదించుట తీరని విచారము గలిగించినది. ఆ గ్రంథములోని ఆదిమూలము - లేక శ్రీచక్రరహస్యమునకు సంబంధించిన దీర్ఘమగు వివరణము ముద్రణము కాకుండగనే యుండిపోయెను. తీర్థులవారి జీవితఫలమును-వారి కీర్తికి ధ్వజప్రాయమును నగు ఈ జగచ్ఛిల్పమును పూర్తిచేసి లోకమునకందించుటకు, వారు చిరకాలము నిష్కామముగా సేవచేసిన శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రి విశ్వబ్రాహ్మణ సంస్కృత పాఠశాలా పాలకవర్గమువారు పాఠశాల మూలనిధి నుండి రెండువందల రూపాయలిచ్చి సాయపడిరి. శ్రీవారి ధర్మపత్ని యగు సాధ్వి బాలనాగమ్మ గారికి భర్తృసంక్రాంతమగు జీవనోపాధి యీ జగచ్ఛిల్ప గ్రంథమే. పాఠకు లీగ్రంథము నాదరించి సాయపడుదురని విశ్వాసము.

తెనాలి,
16-3-59.

కొండూరు వీరరాఘవాచార్యులు.

# ఆ ది మూ ల ము

ఇది ఈ గ్రంథములోని రెండవభాగమునకు సంబంధించినది. దీనిని ఉపాసనాకాండ మనియు చెప్పవచ్చును. ఈ సాకార ప్రపంచ జీవ నిర్మాణమునకు ఏనిరాకార శూన్యతత్వము ఆదిమూలమయ్యెనో, సగుణము సాకారము అగు ఈ విశ్వదేహనిర్మాణమునకు ఏ నిరాకార సగుణ నిర్గుణ ద్వంద్వరూప జగన్మాత ఆది యయ్యెనో అట్టి శూన్య నిరాకారము నుండి శూన్యనిరాకారాకాశమునుండి బలిష్ఠమైన నిరాకారవాయువు పుట్టినట్లు మహాబలిష్ఠమైన నిరాకారమాయ యొక్కటి జన్మించెను. అట్టి మాయయను జగన్మాతచే నిర్మింపబడిన మహాబ్రహ్మాండమునకును, అందలి బ్రహ్మపట్టణనిర్మాణమునకును, ప్రణవమునుండి యేర్పడిన సృష్టి తత్వప్రకాశమునకును ప్రస్తుతము ఆచరణములో నున్న జన్మసంతరణ సాధనమగు శ్రీ చక్రరాజనిర్మాణమునకును పరస్పరమున్న సంబంధమును జూపుటకై యిందొక చిత్రపటము గూడ చూపబడినది. దీనికి సంబంధించిన వివరణమే యీ దిగువ పొందుపరుపబడుచున్నది.

శ్రీచక్రమున ప్రారంభింపబడిన బిందుమూలక వృత్తము వెంతలు బ్రహ్మమునకు నైన పదునైదు శిల్పకృతులొనర్చి ఆ శిల్పమాత పంచదశీ నామము నందెను. అట్లుపొంది తన స్వస్థానమునుండి వరకళ నొకదానిని గూడ సంపాదించుకొని షోడశకళాపరిపూర్ణయై అతిశోభాయమాన సహస్ర ముఖముల వెలయగలిగి సృష్టితత్వప్రకాశమున విశ్వనిర్మాత్రియైనది. ఇట విశ్వ నిర్మాత్రి వృత్తాంతమునకు ముందు ఆదిమూల వృత్తాంత మేమో ప్రశ్నోత్తరరూపమున విచారింతము.

ప్రశ్న:- ఆదిమూల మన దేని కాదిమూలము ?

ఉత్త:- మన కగపడు స్థూలప్రపంచమునకు.

ప్రశ్న:- ఈ స్థూలసృష్టి కాది యొకటున్న దన్నమాట !

ఉత్త:- ఔను.

ప్రశ్న:- ఆది యొకటున్నదికదా, మరి మూల మేమిటి ?

ఉత్త:- ఆదికిని మూలమునకును ఎడతెగని సంబంధమున్నది.

ప్రశ్న:- అదెట్లు ?

ఉత్త:- ఒక చెట్టు నుపమానముగా దీసికొని చూచినచో ఆది యనునది విశ్వవృక్ష బీజమగును. దానినే కారణమనియు ననవచ్చును. ఆ బీజమునుండి కంటికగపడనిరీతిగా అధోగతిని [illegible]

భూమిలోనికి పోయి వృద్ధిజెంది బలమైనదగును. అదియే మహా కారణరూపమైన మూలము. ఇపుడు కారణరూపమైన బీజము నశించినట్లు కనబడును. అట్లగపడినను అది సూక్ష్మముగా రూపాంతరముల నొంది అనేకబీజముల నొసగజాలు స్థూలమైన వృక్షరూపమును బొంది ప్రకాశించుచుండును. మనమా వృక్షమును జూడజాలుదుమే కాని, మహాకారణమగు మూలమును మాత్రము చూడలేము. తత్స్వరూపమును ఉత్తమసాధకులు ఊహామాత్రమున కనుగొనవలసినదే. కావున దాని నిచ్చట భాషతో వివరింపబూనలేదు.

ప్రశ్న:- మీరు విశ్వవృక్షమన్నారు, విశ్వమును వృక్షములో పోల్పవచ్చునా?

ఉత్త:- నేనన్న విశ్వశబ్దము సమస్తార్థముతో. అయినను ప్రపంచమునకు వృక్షమనియు వర్ణనలున్నవి. "ఊర్ధ్వమూల మధశ్శాఖం" అనుటచే సంసారము వృక్షమని తెలియుచున్నది కదా! దీనినిబట్టి గూడ మూల మూర్ధ్వముగను, శాఖ అధోభాగమునను ఉండుననియు ఊర్ధ్వమందలి మూల మగోచరమనియు స్పష్టమగుట లేదా?

ప్రశ్న:- సృష్టి ప్రారంభమన్న మనము లేకుండ కాదుగదా! మనతోనే సృష్టియైనప్పుడది మనకు తెలియబడకుండుటెట్లు?

ఉత్త:- సృష్టి నీతోనే ప్రారంభమైనదన్నమాట నిజమే. నీవు లేకున్న సృష్టియు లేదు. అయినను నిన్ను గూర్చిన జ్ఞానము నీకు సంపూర్ణముగా లేదుసుమా! సృష్టి జరిగినప్పటినుండియు నేటివరకు నీవెన్ని శరీరములను ధరించితివో ఎన్నిటిని విడచితివో నీకు తెలియునా? పోనీ నీ తల్లి గర్భమున నీయీ శరీరసృష్టి యెట్లు జరిగినదో తెలియునా? అందు నీవెట్లు ప్రవేశించితివో యెఱుగుదువా? ఇట్లు నీ స్థితినే నీవు తెలిసికొనలేనపుడు - ఇక సమగ్ర ప్రపంచమును గూర్చి యెట్లు తెలిసికొందువు? లోకములోని వృక్షమూలమును మానసికభావనతోనైన తెలియజాలుదుముగాని పారమార్థికమగు విశ్వవృక్షమూలమును ఎంతమాత్రముగానేని మానసికముగాగూడ తెలియజాలము. అది మహాకారణమును, హిరణ్మయమును అగు మహామాయ.

ప్రశ్న:- మాయకు మూలము లేదా?

ఉత్త:- ఉన్నదనకతప్పదు. ఉన్నను దాని నేవిధముచేతను వర్ణింపలేము.

ప్రశ్న:- తెలియబడజాలని మాయ యొకటి యుండుట, దానివల్లనే యీ సృష్టియంతయు జరుగుట, దానికిగూడ మూల మొకటి యుండుట,

దానినిగూడ తెలిసికొనలేకపోవుట - ఈ విచిత్రవిషయమును విపులీకరించి తెలుపగోరుచున్నాను.

ఉత్త:- ఇది చిత్రమేగాదు - మహాచిత్రమును, గొప్ప విచిత్ర నాటకమును గూడ. ఈ విచిత్రమైన గొప్పనాటకమున పాత్రధారణ మొనర్చి అభినయింప మెట్టమొదటనే మాయాసూత్రధారురాలితో ఒప్పందము చేసికొన్నాము. కాన నాటకము పూర్తియగునంతవరకు విరమింప వీలుకాదు.

ఇట్లు మనచే ఒప్పందము పొందిన సూత్రధారిణి ఈ నాటకమును తనకు సంబంధులగు ఇరువదినల్వురకు "కంట్రాక్టు" ఇచ్చినది. ఆ సంగతి మనకు తెలియదు. అదిగూడ మన క్షేమమునకే కావచ్చును. కాబట్టి మనము కంట్రాక్టుపొందినవారికి అధీనులమైయున్నాము. వారు తమ పని పూర్తికానిది మన సొంతపనులు చూచుకొననీయరు. మనము మన సొంత పనులలో నున్న వారికి నష్టముకదా. ఇందుచే వారికి బద్ధులమై మూలమైన సూత్రధారిణిని గూడ మఱచిపోతిమి. మనము తెలివిగలవారమైనచో కంట్రాక్టుపొందినవారికి నష్టము గలుగకుండ ఒప్పుకొన్నదానికి తక్కువ కాలములోనే ఒక్కొక్క నాటకరంగమును పూర్తిచేసికొని వారి మంచికి పాత్రులమైనచో కొంతవరకు మనకు పరముగు బ్రహ్మాండమున (చంద్ర సూర్యుల) జరుపబడు బ్రహ్మాండ నాటకశాల కవాటములు తెలుపబడును. అప్పుడా నాటకమును తిలకించుచు మన సూత్రధారిణిని కొంతవరకు జ్ఞాపకముంచుకొనగలుగుదుము.

పైసాధన ప్రకారము సూత్రధారిణిని జ్ఞప్తిలో నుంచుకొనగలిగినను దానిని కొందఱు సాధకులు చూడలేకపోవచ్చును. ఆమాయాసూత్రధారిణినే చూడజాలనివారు దానిమూలము నెట్లు కాంచగలుగుదురు? ఇట్లు తన మూలమును తన్ను గుర్తింపలేనివారై ప్రజలు మూలము లేదని నాస్తికులౌదురేమో యను తలంపున గాబోలు నామె తనకు మూలమైన నిరాకార తత్త్వము తన సృష్టియందెల్లెడల జ్ఞానులగువారికి తెలియబడుచుండ వలయునని మహాబ్రహ్మాండమున నిరాకారమగు నాత్మశక్తిచేతను, బ్రహ్మాండమున నిరాకారమగు విద్యుచ్ఛక్తిచేతను, పిండాండమున నిరాకారమగు ప్రాణశక్తిచేతను, శిల్పసాధనమున పాత్రలు రూపవంతములై జగన్నాటక మాడుచున్నట్లు చేసినది. ఎట్లన!

బ్రహ్మాండమంతయు విద్యున్మయము గదా. అందు ప్రధానమైనవి చంద్ర సూర్యులు. అందును ముఖ్యము సూర్యబింబము [illegible].

తక్కిన చంద్రాదులు చంచలములై నిరాధారముగా తరుగు విరుగులులేక పరస్పరాకర్షణ శక్తితో తిరుగుచున్నవి. స్థావరజంగములతోను అపార సముద్రములతోను గూడిన భూమిని సూర్యుడు దినమున కొకసారి గడెర రీతిగ తనచుట్టు త్రిప్పుకొనుచున్నాడే! దేని యాధారముచేత ? ఆయాధారము నిరాకారమగు విద్యుత్తేగదా ! దానికి రూపమున్నదా ? ఇక పిండాండమున శిల్పప్రభావముగల సకల విగ్రహముల (జీవుల) జనన పోషణములకేది మూలమో తెలియునా ? అది ప్రాణశక్తియేగాదా ! అందుండి రాగల రూపములను జూడగలిగినట్లు ఆప్రాణశక్తిని చూడజాలుచున్నామా! కనుక మాయాజాలములనునమ్మి ఆస్తికులగుటకు బాహ్యమగు సృష్టిస్వరూపమంతే బాహ్యములగు నుపమానములు చూపబడినవి.

ప్రశ్న:- మీరు వివరించిన సృష్టిశిల్పమునను న్న బాహ్యోపమానముల వలన నిరాకార తత్వమునుండి సాకారసృష్టి యంతయు జరిగి యుండునని సులభముగానే తెలియుచున్నదిగాని, ఆత్మ, పరమాత్మ, బ్రహ్మ, సచ్చిదానందములని వాని నానానామము లెట్లేర్పడెనో వివరింపగోరుచున్నాను.

ఉత్త:- ఈ నామములన్నియు అమాంత ఎన్ని పరిణామములు పొందెనో ఆ పరిణామములకు దగిన అర్థమునే సూచించుచు ఏర్పడినట్టివి. అకలుమాలమునుబట్టి యేర్పడినవికావు. నామరూపరహితునకు నామములు రూపములు కల్పించుట యెట్లు ? వీని యర్థములు తరువాత వివరింపబడును.

ప్రశ్న:- అయినచో ఆ జగన్మాత జన్మవృత్తాంతమును గూడ ఆదిమూల వృత్తాంతము సెలవిచ్చినట్టే సెలవీయగోరెద.

ఉత్త:- జగన్మాతను నిరాకారము, అఖండము, ఏకము అనిమాత్రమనగలిగినారు. ఇంకను దాని నేమియు కానిదనియు అన్నారు. ఇట్లనుటకుగూడ కారణము లేకపోలేదు. ఎట్లన;

## 1. ఏమీ కానిది

విశ్వహేతువగు నా నిరాకారమునుండి విశ్వోత్పత్తి కాలకో యేమో నిష్కారణబింబమునుండి వెలువడిన కిరణములవలె ఒకలీల వెలువడి అధోముఖముగా జారెను. అది మూలల జన్మస్థానములంకరించుచు వెలువడుచు నిట్లు మూడుసార్లు రాకపోకలు చేసియు ఏమియు కానిదై ఏమీకానిదిగూడ అయ్యెను.

## 2. ఏమీ చేయనిది

అట్టి పైవిధముగానే మఱల అంతర్బాహ్యముల త్రివారము గమన మొనర్చి శక్తిహీనతచే ఏమీ చేయజాలని దయ్యెను.

## 3. ఏమీ కదలనిది

పైవిధముగానే కొంత సాహసముతో మఱల మూడుసార్లు జరిపి రూ చైతన్యమును బొందక ఏమియు కదలనిదయ్యెను.

## 4. ఏమీ అనరానిది

పైరీతిగానే మఱల మూడుసార్లు రాకపోకలొనర్చి పైనజరిగిన వానియందనుమానము గలదౌటచే ఏమియూ అనరానిదయ్యెను.

## 5. ఏమీ లేనిది

పైరీతిగానే మరలమూడుసార్లు జరిపి జరిగినవన్నియూ శూన్యములు కాగా ఏమీలేనిదయ్యెను. ఈవిధముగా పదునైదు పరిణామలీలలు పొంది ఆ పంచదశ భావములే పంచదశ సోపానములుకాగా, తానును నిరాకారముగనై అఖండమును ఏకమును కాగలిగినను ఏమియులేనిదైతోప "యా మా సా మాయా" ఏది లేదో అది మాయ అని వర్ణింపబడెను. ఇట్లనుటచే అసలు లేనిదని తలంపరాదు. ఇంతకుపూర్వ మేమియూ లేనిదిగనుక ఇదివఱకు లేనిదని భావము.

నిరాకారమును అఖండమును కాగలిగి ఏకమునుండి తాను రాగలిగిన హేతువుచేత తాను రెండవదనబడినను, ఆ ఏకమునకు మాత్ర మీ ద్వంద్వభావ మంటనీక తానుమాత్రమే ద్వంద్వభావమునుబొంది శాశ్వతముగ నుండదలచెను. ఈ ద్వంద్వభావస్థితి నిట్లు గ్రహింపవచ్చును. ఆకాశమునుండి వాయువుద్భవించి ఆకాశమునకంటె స్పర్శగుణము నధికముగా పొంది ద్వంద్వమైనట్లు.

ఇంతవఱకు పైనివివరించిన ఏమీకానిది మొదలగు పంచకము మూడేసిసార్లు రాకపోకలుచేసి పంచదశియైనది. ఇట్టి పంచదశకళలతో పరిపూర్ణత చిక్కలేదు. కావున తాను షోడశకళా ప్రపూర్ణయగుటకుగా నామె తాను పొందిన పదునైదుస్థితులకు తనకు మూలస్థానమైన పరమగు నద్వైత తత్వమునుండి యొక్క పరకళను సంపాదించుకొని (పొంది) కలుపుకొని తాను షోడశకలాపరిపూర్ణయై పదునారు మూలద్రవ్యములు గలదాయెను. ఈ పదునారును భావి జగన్నాటక ప్రవృత్తికి మూలభూతములు. ఇది యంతయూ మహాకారణము.

ఇక కారణమగు బ్రహ్మాండమునందలి చంద్రబింబమున షోడశకళ లున్నవి. ఇచ్చట ప్రతిపదాది పూర్ణిమాంతములకున్నవి పదునైదు కళ లును, సూర్యునినుండి గ్రహించిన పదహారవ కళ నాలవదియని గ్రహింప వలయును.

అట్లే పాంచభౌతికమైన పిండాండమున సదాకాశము, చిదాకాశము, ఆకాశము; సద్వాయువు, చిద్వాయువు, వాయువు; సదగ్ని, చిదగ్ని, అగ్ని; సజ్జలము, చిజ్జలము, జలము; సద్భూమి, చిద్భూమి, భూమి అని పదునైదును, వాయుజలముల సంయోగముచే నేర్పడినదియు విద్యుత్సంయోగము గలదియు నగు ప్రాణశక్తియును గలసి పదునారగు చున్నవి. ఇట్లు మహాబ్రహ్మాండమున మహాకారణరూపముగను, బ్రహ్మాండమున కారణరూపముగను, పిండాండమున కార్యరూపముగను పదు నారు సంఖ్యగల పాత్రల నేర్పఱచుకొన్నది. ఇంకను ఆమె అణువున పరమాణువుగాను, మహత్తున మహత్తరముగాను నై 'పునరపి బీజం పునరపి వృక్షః' అను న్యాయమున పూర్ణ స్వాతంత్ర్యము గలదైనది. ఆమె కేమి కొదవ! ఈ జగచ్ఛిల్పము అనంతమైన కర్మజలప్రవాహము కాగా, మహాబ్రహ్మండము పునాది కాగా, ఆత్మగోళక వర్తులాకారయంత్రమును నిర్మించెను. అందు మూలతత్త్వమునుండి పొందిన కళను ప్రతిబింబింప జేసెను. అది తేజోమయమై వెలుగొందెను. అయినను అగోచరమే!

ఇట్లే బ్రహ్మాండమునందును సూర్యగోళమను విద్యుద్యంత్రమును నిర్మించెను. అందు కర్మజలప్రవాహమును నింపి విద్యుత్కళను ప్రతి బింబింపజేసెను. అదియు తేజోమయమై వెలుగొందెను. ఇది మనకు గోచరించును.

ఇట్లే పిండాండమునందును కర్మజలప్రవాహము నిల్పుటకు ప్రాణ శక్తియుక్త గోళకయంత్రమును నిర్మించెను. ఇదియు తేజోమయమయ్యెను. మహాబ్రహ్మాండము పరమాత్మాధిష్ఠానము. బ్రహ్మాండము ప్రత్యగాత్మా ధిష్ఠానము. పిండాండము జీవాత్మాధిష్ఠానము. పిండాండము తరింప సాధనమైనట్టిది.

ప్రశ్న:- సూర్యమండలములోని కర్మజలప్రవాహ మెప్పుడును ఎండనట్టి దెందులకు? సూర్యబింబపు వేడిమి కది యావిరియై యెండిపోదా?

ఉత్త:- అట్లెండకపోవుటే సృష్టిశిల్ప మర్మము. ఆ మర్మమును గ్రహించు టంత సులభమైన పని కాదు. సూర్యమండలాంతర్గతమగు కర్మజలము ఎప్పుడును ప్రవాహరూపముగా నుండుటచేతను, విద్యుదభివృద్ధికి

జలప్రవాహ మవసరమగుటచేతను తనకు వెలుపలనున్న ఖండజలము లను తన వేడిచే ఆవిరిరూపముగా నాకర్షించి యింకింపజేయునట్లు తనకును జగత్తునకును మూలమై తనలోపలనున్న జలమును సూర్యబింబము హరింపజాలదయ్యెను. దీని నీ దిగువ ఉదాహరణముతో స్పష్టముగా తెలియంగవచ్చును. భూమిమీద నున్న జలమునందు సూర్యబింబము ప్రతిబింబించినపుడు ఆ బింబమునకు వేడిమి యుండునో లేదో యెన్నడైన గమనించినారా? ఆ ప్రతిబింబమునకును వేడి యుండుచు నేయున్నది. కావుననే జలప్రతిబింబిత సూర్యుని మనము చూడజాలకున్నాము. ఆ జలము మాత్రము చల్లగానే యుండును. ప్రతిబింబమునందు వేడియున్నను ఆ ప్రతిబింబము తన వేడిమిచేత తన కాధారమైన నీటిని ఆవిరిగామార్చి యింకింపజేయలేదు. దాని నింకింపజేయుటకు గగనమందలి సూర్యునకే శక్తి యుండును. అట్లే సూర్యబింబమునందలి కర్మజల ప్రవాహము నింకింపజేయుటకుగూడ అందు బింబించిన సూర్యగ్రహమునకు శక్తి చాలదు. అది పరమాత్మకు ప్రతిబింబమువంటిది కాన ఆ పని చేయజాలకున్నది. ఆ పని చేయుట కొక్క పరమాత్మబింబమునకే సామర్థ్యమున్నది. ఇంకను ఆ బ్రహ్మాండశిల్పరచనా ప్రభావముచేత సూర్యబింబము తనలోని విద్యుచ్ఛక్తిచేత సాగరములతో గూడిన భూదేవిని తనచుట్టును దినమున కొకసారి ఆకర్షించుకొని తిరుగునట్లు చేయుచున్నది. అంతియేకాక సముద్రములోని క్షారజలమును ఆవిరిరూపముగా నాకర్షించుకొని పరిశుద్ధమొనర్చి మేఘమండలమున నిల్పి జీవోపయోగార్థమై భూమిమీద వర్షింపజేయుచున్నది. ఈ విధమైన రహస్యముల నొకప్పుడు మహానుభావులు శాస్త్రములందు వివిధముల వెలయించియున్నారు

ప్రశ్న:- ఎప్పుడు - ఎవరు - ఎందుకొరకై అన్నారు?

ఉత్త:- సృష్టికార్యము ముగిసినపిమ్మట అవసరమైన యొక సమయమున సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణలను పంచఋషులు సృష్టితత్వమును మొదటగా నెఱింగినవారలగుటచే లోకసంగ్రహము - లోకానుగ్రహము చేయవలసినవారగుటచే తామెఱింగిన యీ తత్వరహస్యములను శ్రీచక్ర - బ్రహ్మపట్టణాదులుగా నిరూపించి శాస్త్రరూపమున వెలయించినారు. ఈ పంచర్షుల విషయ మీ గ్రంథమునందలి 118వ పుటలో విస్తరముగా గాంచవచ్చును.

ప్రశ్న:- శ్రీచక్ర స్వరూపమును గూర్చియు తద్రహస్యమును గూర్చియు సమగ్రముగా తెలియగోరుచున్నాను.

ఉత్త:- అది అనాదియు, ఆద్యంతశూన్యమును, అఖండమును, ఆకార రహితమును. అట్టిదానినుండి సత్తను లీల వెడలగా అది తానైయై అందుండి చిత్తనునది వెడల, ఆ చిత్తు తానైయై సత్తు చిత్తను ద్వంద్వభావములతో స్వయంప్రకాశము పొందగలిగెను. అట్లు పొందగలిగిన తాను ఆ రెంటి యాధారమున ఆ పంచదశ ఈ క్రిందివిధమున తన శిల్పప్రభావమున బ్రహ్మపట్టణమును శ్రీచక్ర రూపమున రూపొందించెను.

## 1 వృత్తనిర్మాణము. 1

జ్ఞానశ్రీ. మహాకారణము. చిద్రూపము.

నిరవకాశమైన సత్తునుండి వెలువడిన చిత్తు తానొక యవకాశమును కల్పించి యా యవకాశమునకు హద్దుగా అనేకాంతర్భావములు గల యావరణరూపమగు వర్తులాకారము (వృత్తము) ను రూపొందించెను. అది యన్నిటికిని మూల మగునట్లును, అణువుగను, మహత్తుగను, భావి జగచ్ఛిల్ప నిర్మాణహేతువగు సత్యలోకపట్టణ కల్పనకు హేతువుగను ఒప్పి ప్రకాశించెను.

ఈ వృత్తమును నిరాకారమగు విద్యుత్తు సాకారముగా ప్రకాశింప నిర్మించిన గాజుబుడ్డిగా భావింపవచ్చును. అట్టిదానిలో నీ సత్తు జ్యోతిగా వెలుగొందెను. చిద్వస్తువు తనదైన యంత్రశిల్పనైపుణిచేత నిర్మించిన యీ వృత్తమునందు మీది యఖండసత్తును బిందురూపమగు ఖండసత్తుగా రూపొందించెను.

ఇట్లు రూపొందించిన యణుస్వరూపబిందువును వృత్తాంతర్భాగమున బింబరూపమున ప్రకాశింప జేసెను. అట్లొనర్చిన యా బింబసాన్నిధ్యమున తాను జ్ఞానస్వరూపముతో "చిద్రూప" నామము నొందెను.

## 2 భగవత్తత్త్వము 2

విశ్వశ్రీ. భగవతీ.

ఆ బింబమునుండి భావి జగన్నిర్మాణ కృత్యముల నెరవేర్చుకొనన్ యనన కిరణజాలము వెలువడి తద్బింబమధ్యమున నూర్ధ్వగతిని పొందుచును, మరల నందుండి యధోగతిని బహిర్గతిని పొందుచును నిట్లు రాకపోకలు

జరుగుచుండ, ఆ బింబము క్రిందిభాగమున మహాకారణమను నొక యంత్రమును నిర్మించి అందు నా బింబమును ప్రతిఫలింపఁజేసి ప్రత్యగాత్మగా ప్రకాశింపఁజేసెను. (ఇది భావి జీవులచే నాయా కర్మఫలముల ననుభవింపఁజేయుటను వ్యుత్పత్తిచే దాని నాత్మయని యనుటచే నాత్మయయ్యెను) అందుండి మాయారూప మొకటి వెలువడి యూర్ధ్వాధోభాగముల సంచరించి తా ననాత్మ నా బరగెను.

ఇట్లు కిరణములనగాని, అనాత్మయగు మాయనగాని, శాకపాకలను నా బింబాత్మ మార్గమయ్యెను. ఈ మార్గమే యోని (కారణము). యోని భగ శబ్దములు సమానార్థకములు. ఇట్లు కిరణమాయల శాకపాకల మార్గము (భగము) గల బింబరూపాత్మ విశ్వమూలమగు భగవద్వస్తువు నా బరగెను. అట్టి భగవద్వస్తువునందే జగత్సృష్టికి మహాకారణములైన తొంబదియారు మూలద్రవ్యముల చిహ్నములను గర్భితములుగా నుంచుకొనట్లొనర్చెను. ఇట్లు భగవత్తత్త్వమును వెలయించిన యా చిద్రూపము అనాత్మయైన ప్రకాశరూపమాయ స్త్రీలింగ మగుటచేతను, జగత్తు పుట్టుటకు తాను ప్రధానద్రవ్య మగుటచేతను, స్త్రీత్వముచే స్త్రీయై భగవతీ నామము నొందెను.

## 3 శిల్పశ్రీ భగవదాలయము శిల్పసుందరి 3

తేజోమయమగు భగవత్తత్త్వముయొక్క వర్తులముపై నిరవకాశముగ నున్న అఖండప్రదేశ మంతయు తన భావి విశ్వకర్మల సృష్టిసంకల్ప బీజములచే నింపివైచెను. అటుపిమ్మట తాను నిర్మింపఁబోవు ప్రతివస్తు మధ్యంబునను, ఆ భగవత్తత్త్వమే సాక్షిమాత్రముగా వెలుంగునట్లును, అఖండప్రదేశమందు గల ప్రతివస్తువు తానే యగునట్లును, ఆ భగవత్తత్త్వము తనకు మాత్రమే గోచరించునట్లును, ఒక భగవదాలయముఁ గట్టనెంచి పై వర్తులాకారమును సహస్రారమున అనేక చిచ్ఛక్తుల వెలయించి అందుండి సహస్రకాంతులు వెలయునట్లొనర్చి ఆ కాంతులనెడు చిత్రవిచిత్రపు రంగులుగల మణులు స్థాపించిన బంగారుయిటుకల దీర్చి దిట్టమైన గర్భాలయము గట్టివైచెను.

ఇట్లుండ నా భగవత్తత్త్వమునుండి అధోమార్గమున తన్మాయ రెండయ్యెనన మెఱపుతీగెలవలె నిద్దఱు పురుషులు వెలువడిరి. ఆయిరువురినుండి యొకస్త్రీ వెలువడెను. ఆయిరువురు పురుషులలో నొకడు తాను

మాత్రమే వ్యక్తపడి మరల నూర్ధ్వముగా నాత్మమధ్యంబున జేరి తాను వ్యక్తపడకుండుటయే గాక పై సహస్రకాంతులను పరిశతవిధంబుల ప్రజ్వలింపఁజేసి ఆ ప్రోజ్జ్వలకాంతులచే నా భగవత్తత్త్వమునుగూడ వ్యక్తపడకుండఁజేసి అవ్యక్తుడను నామముతో నా గర్భాలయ ద్వారపాలకుడుగా నుండెను. మరియు నా భగవతి గర్భాలయము నిర్మించినట్టి ఆ చిచ్ఛక్తులను వివిధవర్ణ శిలలుగాఁ జేసికొని వానిచే భగవదంతరాలయమును గట్టెను. ఇట్లుండ సూర్యకిరణములచే నబ్ధిజల మావిరిగా మారి ఆ యావిరి మేఘరూపము దాల్చి యా సూర్యబింబమునే గప్పివుచ్చినట్లు ఆ యిరువురి నుండి వెలువడిన యా స్త్రీ అజ్ఞానాంధకారస్వరూపిణి గావున (మేఘమువలె) మీది గర్భాలయాంతరాలయముల గప్పివుచ్చి పై విశాలభాగ మంతయు మహద్రూపమున అంధకారమేఘమును వ్యాపించి (వ్యాపింపఁజేసి) తాను మహత్తను నామముఁబొంది అంతరాలయ ద్వారపాలికగానుండెను.

మీది యిరువురు పురుషులలో రెండవవాడధోముఖుడై క్రింది భాగమునను్న మహద్రూప మేఘాంధకార మధ్యమున మార్గమేర్పరచుకొని తద్ద్వారమున మేఘమందు మెరయు మెరుపువలె క్రిందికిజారి బాహ్యప్రదేశమంతయు నాక్రమించి తన మెరుపును పెక్కు మెరుపులుగా నొనర్చి ఆ మెరుపుల తేజస్సు నుష్ణమయమగు నెండగను, ఆ యెండలో నెండమావులును, అందు జలంబు లుండునట్లును తద్ద్వారా భావిజగత్తు పిపాసల దీర్చుటకోయన కర్తృత్వాభిమానములు గల అహంభావమను దారువుచే ధ్వజమెత్తి అందు జయసూచకముగా చిఱుగంటలను ఘంటాల మ్రోగించి సర్వసమర్థుడై అతడహంకార నామమొందెను.

మరియు నా చిచ్ఛక్తుల నధికంబులుగా నొంపొందింపఁజేసి వానిచే లోహములును, మణులును, శిలలును నిర్మితములు కాగా వానిచే స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ స్వరూపములగు ప్రాకార సప్తకము నిర్మించి యింక నా చిచ్ఛక్తులను పెక్కు ఆటవెలదులుగాగూడ గావించెను. అంతియేగాక పైని వెడలిన అవ్యక్త మహదహంకార త్రయము వెంట నలుగురు స్త్రీలును, ఇద్దరు పురుషులును, మొత్తము ఆరుగు రవతరిల్లిరి. పై మగ్గురితో నవకసంఖ్య యయ్యెను. ఆ నవక సంఖ్యయందు స్త్రీపంచక ముండును. పై ఆటవెలదుల సంఘము ఆ నవకమందుగల స్త్రీపంచకమును మాత్రధారలనుగా నెన్నుకొన నహంకారుడు సూత్రధారుడుగా నుండ స్త్రీపంచక పర్యవేక్షణమున మహాకారణరూపముగా

భావి "జగత్సృష్టిశిల్ప సామ్రాజ్య" మను మహానాటకమును భగవదాల యావరణమందే నిత్యము ప్రదర్శింప నా భగవతి యాజ్ఞాపించెను.

ఇట్లు నిర్మింపఁబడిన యాలయమున తన శిల్పనైపుణిచే గర్భాలయ మును కవాటమును బంగారుచే చేయబడగా నది హిరణ్మయ కాంతుల తోను, "సత్యం శివం సుందరం" అనురీతి సత్య మంగళ సౌందర్యముల ప్రకాశింపగా నీ భగవదాలయ నిర్మాత్రియైన భగవతి "శిల్పసుందరి" యను నామము నందెను.

ఈ యాలయ మన్నిటికిని మూలచిహ్న మగుట దీనిని లింగాలయ మనియు, భావి జీవి జిజ్ఞాసువులకు మంగళప్రద మగుట శివాలయ మనియు పేర్కొనుచుందురు.

## 4 ప్రణవ సృష్టి 4

ప్రణవస్త్రీ మహాకారణములో మహాకారణము. ప్రణవేశ్వరి

"ఊర్ధ్వమూల మథశ్శాఖ" మను ఉపనిష ద్వాక్యానుసారము పంచభూతసృష్టి యట్లు, సృష్టితత్త్వము పైనుండి అతిసూక్ష్మముగా ప్రారంభింపఁబడి క్రిందికి ప్రసరించినకొలదిని బహుళవ్యాప్తి గలదై యొప్పెను. సత్యలోకములో దేవస్థానము, దానిదిగువ నొక సౌధమును, దానిదిగువ గొప్ప కోటయు, దాని నావరించి గొప్ప పట్టణము మొదలై నవి నిర్మింపఁబడుట యాలోచింపగా హిందూసంప్రదాయమున కాదర్శ మగును. ఇంక నీ దేవాలయము దిగువ నవాంతస్సులతో నొకసౌధము నిర్మింప నిశ్చయించెను. అందుకు పరికరములు అవ్యక్తాది నవకము.(అనగా లోగడవి మహాకారణస్వరూపములనియు, ఈనవకము మహాకారణములో మహాకారణము అనియు గ్రహించవలెను) అవ్యక్తాది సూక్ష్మభూతత్ర యము, సత్వాది గుణత్రయము, అకారాది వర్ణత్రయము మొత్తము నవ సంఖ్య యయ్యెను. ఇది భావి జగచ్ఛిల్ప నిర్మాణహేతువగు ప్రణవ మనగను, భావి జగదుపకరణశిల్పసాధన లోహఖనుల సృష్టిహేతువులగు నంతస్సు లనగను, భావి బ్రహ్మపట్టణ నిర్మాణమునకు ప్రాణబీజ మనగను వెలయును. ఈ నవకము భావి లోహ నవకమునందు నాలుగుమాత్ర మొకొక్క గుణము కలవిగాను, తక్కిన యైదును ద్వంద్వగుణము అనగా మిశ్రమగుణము కలవిగాను, పై నవలోహములు నుత్పత్తియగుటకు మూలములుగా నుండును. భావి నవలోహ హేతువులగు ఈ ప్రణవలోహ ములను సేకరించి అట్టివానిని ప్రత్యేకముగా కరగి పోతపోసి గణితప్రకా

రము పొట్టి పొడుగు గల కమ్ములగునట్లు నిర్మించెను. ఆ తొమ్మిదింటిలో నాలుగొకవిధముగను ఐదొకవిధముగను ఉండును. అందు నాలింటిలో మొదటికమ్మి మూడురెట్లును, రెండవది నాలుగురెట్లును, మూడవది ఆరు రెట్లును, నాలవది తొమ్మిదిరెట్లును పొడుగు కలవై యుండును. అందీనాలు కమ్ములు ఒక్కొక్క గుణము గలిగిన నాలుగు లోహములతో చేయబడిన వగును. తక్కిన ఐదింటిలో మొదటికమ్మి రెండురెట్లును, రెండవది మూడురెట్లును, మూడవది యైదురెట్లును, నాలవది ఆరురెట్లును, ఐదవది తొమ్మిదిరెట్లును పొడుగు గలవై ద్వంద్వగుణములు (మిశ్రములు) గల యైను లోహములతో కమ్ములుగా సిద్ధపరుపబడినవి. మరియు ఆతొమ్మి దింటిని ఒక్కొక్కదానిని మూడుభాగములుగ జేసి రెండు వంపులు పెట్టి అన్నిటిని ముక్కోణములుగ నొనర్చి ఆ తొమ్మిదింటియందును ముక్కోణ ములు కలిసిన రెండుకొనలను అతుకులు పెట్టి గట్టిప్రమాణము ప్రోగునట్లొనర్చెను. ఈ తొమ్మిదింటిని ఒకదానిపై మరియొకటి అమర్చి కూర్పు చేయుటలో శిల్పమర్మముచే మధ్యనిల్పిన రూపరహితమగు (గన్పడని) కంబము నాధారముగ నేర్పరచుటలో నవాంతస్తులచే వెలుగు నేక స్తంభ సౌధరాజము నిర్మితమయ్యెను.

అందు ముక్కోణములుగాని, మూడురేఖలు గూడిన మర్మస్థానములుగాని, రెండురేఖలు గూడిన సంధులుగాని, అంతస్తులుగాని మొత్తము 96 సంఖ్యగల శ్రీనగరచక్ర సౌధాకారము ధాన్యరాశినిం బోలిన ముక్కోణపుటాకృతి గలదయ్యెను. ఇట్లగి నవరస భావముల తోడను, నవ వర్ణములతోడను, నవలోహ కాంతులతోడను, తన శిల్ప నైపుణిని అణుమహత్స్వరూపమున నవరత్నఖచిత మహోన్నతాసనమున నవ్యసౌందర్యకళ లుట్టిపడునట్టి శ్రీచక్రనగర రాజసౌధమును నిర్మించెను.

## తొంబదియారు సంఖ్య వివరము

ముక్కోణము 3. అష్టకోణము 8. దశకోణద్వయము 20. చతుర్దశకోణము 14 మూడురేఖలు గూడిన మర్మస్థానములు 18 రెండురేఖలు గూడిన సంధులు 24. సౌధమునం దేర్పడిన అంతస్తులు 9. మొత్తము 96 ఐనవి. ఇదే భావి పురుషప్రమాణమని కొందఱనుభవజ్ఞులు చెప్పెదరు.

మరియు 1 ముక్కోణము, 2 అష్టకోణము, 3 దశకోణద్వయము, 4 చతుర్దశకోణము, 5 అష్టదళములు, 6 షోడశదళములు, 7 త్రివలయము, 8 భూపురత్రయము, 9 చతుర్ద్వారములు. ఈ తొమ్మిదిసంఖ్యను

నవగ్రహ మూలములుగా తీసికొని ఏగీతలు ఎంతెంత దూరము లుండ వలెనో పైన అష్టదళములకు షోడశదళములకు మధ్య నెన్నిపాళ్ళ కొలత లుండవలెనో అట్లె త్రివలయము, భూపురత్రయము, చతుర్ద్వారములు వీని కెన్నెన్నిపాళ్ళు, ఎంత కొలత లుండవలయునో విచారింపగా శిల్ప శాస్త్రప్రకారమైన సంఖ్య 96. ఇదియె పురుషప్రమాణమని మఱికొందరు శాస్త్రకారు లందురు.

మొదటివారు ప్రణవమును నవకచక్రమందే 96 సంఖ్యచూపించిరి. రెండవవారు నవకచక్రమును, తక్కిన అష్టదళములు మొదలు చతుర్ద్వార ముల వరకు బోయి నవగ్రహమూలములని లెక్కచేసి 96 సంఖ్య చూపిరి. ఇదియు సమంజసమే. కాని దీనికన్న మొదటివారు చూపిన విధమే అను భవమున కుచితముగా గన్పడును. ఎట్లన, మొదటివారు ముక్కోణములు గలిగిన నవసంఖ్యయందె పైతత్త్వములన్నియు చూపినాడు. జగత్సృష్టి యంతయు ముక్కోణము (భూతత్రికము) మొదలు పెక్కు ముక్కో ణములు గలిగిన నవశబ్దాత్మకమగు ప్రణవములోనే ప్రారంభమైనది. కనుక ఇదియు ముక్కోణములుగల నవకముతోడనే ప్రారంభింపఁబడినది గావున దీనిని ప్రణవచక్రమనియు చెప్పనగును. అట్లగుట మొదటివారు చెప్పినదియే మిక్కిలి సమంజసము.

## ప్రణవ శబ్దార్థము

నవశబ్దమునకు ముందు "ప్ర" అను ఉపసర్గ చేర్చబడగా "ప్రణవ" శబ్దమయ్యెను. ఈ నవసంఖ్య అశ్వత్థాదులని లోగడ నిరూపణ చేయ బడియే యున్నది.

రెండవవారు చెప్పినట్లు ప్రణవచక్రమును దాటిపోయి 96 సంఖ్య చూపించి సృష్ట్యాదికాలమున లేక దేవాసుర విభాగ మేర్పడిన మధ్య కాలమున బయలుదేరిన రాహుకేతువులను గలిపికొని నవగ్రహములని, వారి ననుసరించి సృష్టితత్త్వ ప్రతిపాదకమగు నీ ప్రణవచక్రమునకు 96 సంఖ్యను సరిపుచ్చుట సమంజసమో, లేక మొదటివారు చెప్పినట్లు ఆది మూలమగు ప్రణవచక్రములోనే 96 సంఖ్య నిగూఢార్థమును గ్రహించుట సమంజసమో తత్త్వవేత్తలాలోచింతురుగాక.

## అజనాభదేశము

సూర్యుడు మొదట నుదయమైన దిక్కు పూర్వదిక్కయ్యెను. సృష్టి కూడ మొదటిదగు తూర్పుదిక్కుననే ప్రారంభింపఁబడినది. ఈ దిక్కు

అజుని సృష్టికి నాభివంటి ప్రదేశమగుటచే నీతూర్పుదిక్కును "అజనాభ దేశ" మని పేర్వెట్టిరి. (భాగవత పంచమస్కంధము జూడుము) సృష్టి పంచభూతములచే నగుట నీ భూప్రదేశమునుగూడ పంచఖండములుగా విభజించి మొదటిదైన తూర్పుదిక్కుననున్న ఖండము సృష్టి కాశ్రయ మగుట నాశ్రయఖండమనిరి. అది క్రమముగా "ఏశియా" గ మారెను. కాన అజనాభమన్నను ఆశియా యన్నను నొక్కటే యగును.

శ్రీనగరచక్రమున నాల్గుకోణములు ప్రాగ్దిక్కుగా నెందుకుండ వలెనన, తూర్పుదిక్కున సూర్యుడుదయించి ఆధ్యాత్మికారోగ్యములీయ కర్తయగుటను, బ్రహ్మసృష్టి యిచ్చటనే వెలసినదగుటను, ఎచ్చట సృష్టి వెలసెనో ఆ దిక్కునందే సృష్టితత్త్వ మెఱుంగుటకనగను, ప్రత్యక్షమగు బ్రహ్మాండమున సూర్యనమస్కారముచే తన్నుపాసించువాని కాధ్యాత్మి కారోగ్యము లొసంగు సూర్యుడుదయించు దిక్కగుటను, తరించుటకు చిహ్నములుగా నాల్గుకోణములు తూర్పువైపుగా నుండును.

తూర్పుదిక్కున కెదురుగానుండు పశ్చిమభూమి సృష్టి ప్రారంభము కాని దేశమగుటను, ఆ దిక్కునగల శక్తిసూచకములగు నైదుకోణములు ప్రకృతిప్రాధాన్యము గలవగుటను నచ్చటివారు పారమార్థికమగు ఆధ్యా త్మిక తత్త్వమును తెలియలేని వారలగుదురని తెలుపుటకొఱకు చిహ్నము లుగా నైదుకోణములు పశ్చిమముఖములుగా నుండునని యెఱుంగవలెను. అందువల్లనే పాశ్చాత్యులకును, అజనాభదేశవాసులకును విపరీతదృష్టిభేద ములు గల్గెనని తెలియవలెను. ఋతువులు మున్నగు కాలధర్మములు, ఇంకననేక స్థితిగతులు ననుపాలించుటంబట్టి దెలిసికొని సృష్టితత్త్వముల యాధ్యాత్మి కారోగ్యకర్మ లాచరింపదగిన ప్రకృతిసౌకర్యము లీదేశముననున్నంతగా నితరదేశముల గన్పడకుండుటేగాక విపరీతములుగా గూడనుండును.

శ్రీచక్రము ఆదిమదంపతీచక్ర మనదగును. తూర్పుముఖముననున్న పురుష (శివ) సంబంధములగు నాల్గుకోణములు పారమార్థికమగు నాధ్యా త్మికము దెల్పుటయు, పశ్చిమముఖముననున్న స్త్రీ (శక్తి) సంబంధములగు నైదుకోణములు నైహికమగు నారోగ్యమునే దెల్పుటయు చూడ ఈ ద్వంద్వభావమే దంపతీత్వమని తెలియుచున్నది. ఇందుకు —

శ్లో॥ "చత్వారి శివచక్రాణి శక్తిచక్రాణి పంచ చ,
నవచక్ర మిదం జ్ఞేయం శ్రీచక్రం శివయో ర్వపుః."

(అని త్రిపురసార సింధువు.)

కాననీ నవసంఖ్యగలిగి ద్వంద్వభావముతో నొప్పు శ్రీచక్రము నుపాసించుటన్నను ఇహపరసాధనముల ద్వంద్వభావముతో నొప్పు శివశక్త్యాత్మకమగు నాదిమదంపతీ - ఉపాసన మన్నను నొక్కటే యగును. ఇట్టి ఆదిమదంపతీయుక్తమగు శ్రీచక్రోపాసన నిష్కామముగా జేయ దగినది. కాని కామముతో చేయుట తగనిదని పెద్దలందురు. మఱియు కామ్యకర్మకును తగనిదందురు. ఇట్టి యుపాసనమున్నను కామసంకల్పములతో అనేక తాంత్రిక శాస్త్రములలో చేర్చుట కేమిహేతువో పెద్దలూహింపుదురుగాక. ఏవిధమైన సమాంతస్తులుగల శ్రీచక్రనగరనిర్మాణ మొనర్చి ఆశిల్పసుందరి "ప్రణవేశ్వరి" నామ మొందెను.

5 | | 5
---|---|---
రాజ్యశ్రీ | **రాజదుర్గసృష్టి** | రాజేశ్వరి

ఈ నవలోహసౌధమును చుట్టి రాజధానియైన నొక రాజదుర్గమును నిర్మింపదలంచి భావి బ్రహ్మాండమునందు పర్వతఖనుల సృష్టిమూలమున నెనిమిది బురుజులను, దానిపైని నానావిధ కల్పవృక్ష సృష్టిమూలమున పదునారు బురుజులను నిర్మించెను. ఆ అష్ట షోడశ సంఖ్యలుగల బురుజులు సూర్యచంద్ర సంజ్ఞలని యెఱుంగవలెను. అచలుడగు సూర్యుని సంజ్ఞయైన బీజసహితములగు నానావర్ణ శిలా పర్వత లోహఖనులును, భానుదీప్తిచే పగటికాలమందే వృద్ధిపొందుచు, అచలములుగ నుండునట్లును, చలనయుక్తుడగు చంద్రసంజ్ఞయైన బీజసహితములగు నానావిధకల్పవృక్షాదులు చంద్రకాంతిచే రాత్రులందే వృద్ధిపొందుచు కొంత చలనభావము గలిగి యుండునట్లును, నిర్మితము లయ్యెను. చంద్రునిలోని షోడశకళలకును ఈపదునారు బురుజులును చిహ్నములు.

ఎనిమిది బురుజుల సంజ్ఞ సూర్యున కెట్లు చెల్లునో యోచింపవలయును. సూర్యబింబములో నేడు రంగు లున్నట్లిప్పుడు వాడుకలో నున్నది. ఈ యేడింటిలో నలుపుగాని తెలుపుగాని చేరలేదు. తెలుపు నలుపులు ప్రత్యేకవర్ణములు కావని వారి యభిప్రాయమేమో; అట్లైనను వారు లెక్కించిన యేడింటిలో ప్రత్యేకవర్ణములు కాక మిశ్రములుగానున్నవే. అసలు తెలుపు నలుపులు ప్రత్యేకవర్ణములే కాని మిశ్రములు కావు. సూర్యుడు సప్తాశ్వుడనుట యీ సప్తవర్ణములనుబట్టియే కాబోలును. పాశ్చాత్య సిద్ధాంతనిబట్టియే (వైలెట్, ఇండిగో, గ్రీన్, బ్లూ, యెల్లో,

అరంజి, రెడ్) సప్తవర్ణము లనిగాదా ? వీనికన్నిటికిని మనభాషలో పేర్లు కన్పడవేమి ? ఎట్లయినను ఈ సప్తవర్ణములనుమాట యుక్తియుక్తముగను అనుభవయోగ్యముగను లేదు. మన హిందూసంప్రదాయములో పంచభూతములలో నాకాశమువదలి తక్కినవానికి ప్రత్యేక వర్ణములున్నవని యుపనిషత్తులు చెప్పుచున్నవి. భూమి పసుపురంగు, జలము తెలుపు, అగ్ని యెఱుపు, వాయువు నలుపు ఈ నాలుగువర్ణములను మిశ్రము చేయగా నెనిమిదివర్ణము లేర్పడును. ఈ యెనిమిది వర్ణములే సూర్యునిలో నుండును. ఈయంశమునే శ్రీనగరచక్రములోని యెనిమిది బురుజులు సూచించుచు నవి సూర్యచిహ్నములై యొప్పినవి. ఆరాజదుర్గపు బురుజులచుట్టును భావి సముద్రసృష్టి హేతువులగు వృత్తములను నగాధములైన యగడ్తల నిర్మించెను. ఇది భావిబ్రహ్మాండమండలాధిపతి యగువాడును, సమష్టిభావము గలవాడును, సర్వజ్ఞశక్తిగలవాడును, తనకు భావి ప్రథమపుత్రుడు నగువాడును, ప్రజ్ఞానమూర్తి మహారాజేంద్రుడు పైమండలమేల రాజదుర్గమచిహ్నమున నీరాజదుర్గమును నిర్మించెను. ఇట్లు నిర్మించిన యాశిల్పసుందరి ప్రజ్ఞానరాజున కీశ్వరియై తాను శ్రీ రాజేశ్వరియను నామము నొందెను. "రాజ్యశ్రీ."

6 6

అండశ్రీ ప్రాకారములు బ్రహ్మాండేశ్వరి

రాజదుర్గపు టగడ్తలకు పైనున్న వృత్తపంచకమును బురుజుల మధ్యనున్న వృత్తద్వయమును కలిసియైన వృత్తసప్తకము భావి గ్రహసప్తక చిహ్నములని యెఱుంగవలెను. ఈ గ్రహసప్తకాధిపత్యముననే భాన్వాది యేడువారము లేర్పడినవి. ఇట్లు గ్రహచిహ్నములును, సముద్రచిహ్నములును, వృక్ష చిహ్నములును, పర్వత చిహ్నములును. వైవిధమున బ్రహ్మాండోత్పత్తి మూలములుగా నిర్మించిన యా శిల్పసుందరి "బ్రహ్మాండేశ్వరి" అను నామ మొందెను. "అండశ్రీ"

7 మహాకారణములో కారణము 7

కోశశ్రీ పంచకోశములు పంచకోశేశ్వరి

అగడ్తలకు వెలుపలనున్న వృత్తపంచకము కోశపంచక చిహ్నములనియు నెఱుంగవలెను. వెలుపలినుండి లోపలికి వరుసగా మొదటిది అన్నమయకోశము. ఇది ఐదువిషయముల బలముగలిగి కఠినాంశముతో గూడిన పృథివీసంబంధముగలదై అయ్యన్నను లోహముచే నిర్మింపఁబడెను.

దీని నెన్నివిధముల కాపాడుచుండినను ఎప్పటికప్పుడు దురహంకార కర్తృత్వాది గుణములనెడు త్రుప్పుపట్టుచుండి క్రమముగా నశించి పోవును. ఇది 24 ఇంద్రియములుగల స్థూలశరీరము.

జ్ఞాతయగు జీవుడు తన జననస్థానము ఆకాశాద్యాంశమగు గోళక మయ్యును, ఐహికసామ్రాజ్యము వేళ నాజ్ఞేయమందున్న దర్బారుజేరి రాజ్యాధికారియై జాగ్రదవస్థయందు అన్నమయకోశనిష్ఠమైన జీవత్వ మనుష్యత్వాది ధర్మంబుల పాలింపను, ప్రారబ్ధకర్మల ననుభవింపను, ఆగామికర్మల నిర్మించుకొనను ఆస్థానిదై యుండును.

## ప్రాణమయకోశము

ఇది నాలుగు విషయములుగల ద్రవాంశముతోగూడిన జలసంబంధముగలది. తుత్తునాగలోహముచే నిదినిర్మితము. దీని నెంత శోధింపఁ జూచినను ఎప్పటికప్పుడు దుశ్చింతనత్వమను (నీటిపాచువలె) త్రుప్పుపట్టుచుండి సూక్ష్మశరీర నిర్మాణభాగ మగుచు ప్రాణమయకోశ నిష్ఠమైన క్షుత్పిపాసాది ధర్మంబులు గలిగి కర్మేంద్రియ పంచకముతోను, ప్రాణ పంచకముతోను, చిత్తముతో గలిసి 11 ఇంద్రియములు గలదై లింగ శరీరమున స్వప్నావస్థయందు జీవు నస్వతంత్రునిగాఁ జేయుచుండును.

## విజ్ఞానమయకోశము

ఇది మూడు విషయములుగల తేజోంశముతో గూడిన అగ్నిసంబంధము గలదై తామ్రలోహముచే నిర్మితము. దీని నెంత శీలించినను ఎప్పటికప్పుడు దుర్నిశ్చయమను (నిప్పుబూడిదవలె) చిలుమును గూర్చుచు సూక్ష్మశరీర నిర్మాణభాగ మగుచు జ్ఞానేంద్రియములును, బుద్ధియును, అహంకారమును కలిసి యేడింద్రియములుగలదై స్వప్నావస్థయందు జీవుని అస్వతంత్రునిగాఁ జేసి వైచును.

## మనోమయకోశము

ఇది రెండువిషయములుగల చలనాంశముగూడిన వాయుసంబంధముగలదై వంగలోహముచే నిర్మితము. దీని నెంత స్వాధీనము చేసికొన వలె నన్నను ఎప్పటికప్పుడు సంకల్ప వికల్పములను ద్విస్వభావపు మెత్తదనము గూర్చుచు సూక్ష్మశరీర నిర్మాణభాగము పంచుకొనుచు మనస్సు జ్ఞానేంద్రియములతోగూడ నారింద్రియములుగలదై సంకల్పవికల్పములను ప్రకాశింపఁజేయుటయందు అధికకర్మ మెట్లు వంగిన నాసును వంగుచు జీవుని

గూడ వంగునట్లు చేసి సూక్ష్మశరీరమున స్వప్నావస్థయందు నస్వతంత్రుని గాఁజేసి కలలఁ గల్పించును.

మరియు ప్రాణమయ, విజ్ఞానమయ, మనోమయ కోశములు మూడును 19 ఇంద్రియములుగలదై సూక్ష్మ (లింగ) శరీరముగా నేర్పడి అన్నమయ కోశాధిపతియై జాగ్రదవస్థనున్న జీవమూర్తిని అక్షియస్థానము నుండి విశుద్ధచక్రము వరకు దిగువ కీడ్చి అతడు జాగ్రదవస్థలో ననుభవించుచు చేసిన కర్మభాగమంతయు మఱపుఁజెందించుచునే గాక తాను కల్పించిన కలలకథ యంతయు సత్యమని తోపింపఁజేసి అస్వతంత్రునిగా నొనర్చును. జీవుడు జాగ్రదవస్థ నున్నతరి విశ్వుడనియు, స్వప్నావస్థ నున్నతరి తైజసుడనియు, సుషుప్త్యవస్థనున్నతరి ప్రాజ్ఞుడనియు నామములఁ వహించును.

మరియు ఈ సూక్ష్మశరీరము జీవుడు జాగ్రదవస్థలో సంపాదించుకొన్న కర్మభాగమును కారణదేహమునందు దాచిపెట్టుటను, కారణశరీరమందు నిల్వయున్న కర్మభాగమును జాగ్రదవస్థయం దనుభవింప నొసంగుచుండుటను మధ్యవర్తియై యుండును. ఇది జీవ సంచార మార్గమనియు, అధోభాగమనియు, ఐహికాధికముల యవస్థయనియు భావింపవలెను. ఇంక సూక్ష్మములుగా నున్న తనువులు, అవస్థలు ఈశ్వర భావములనియు, పారమార్థికములనియు, వానిని పొందుటకు యోగ మార్గములవలనగాని సాధ్యపడదనియు నెఱుంగవలయును.

## ఆనందమయ కోశము

ఇది యేకవిషయ బలముగల బయలంశతో గూడిన ఆకాశసంబంధము గలదై రజతలోహముచే నిర్మితము. దీనిని తెలియ నెంత ప్రయత్నించినను ప్రియము, మోదము, ప్రమోదము అను వృత్తులతో గూడిన అజ్ఞానమే ప్రధానముగాగల ద్వంద్వములైన అంతఃకరణద్వయముగు మనోబుద్ధులతో గూడి జీవుని కారణదేహములో సుషుప్త్యవస్థయందు ముంచివేచి యస్వతంత్రుని జేయుటయే గాక అజ్ఞానానందవార్ధి నోలలాడించుచుండును.

---

వివరణ :- అంతఃకరణ మనగా ! మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను నాలు కరణములంగాని రెండెదెప్పఁడును కావు. ఆనందమయ కోశమైన కారణశరీరమున సుషుప్త్యవస్థయందు మాత్రము చిత్తమిశ్రమముగు

## అంతరింద్రియములు భూతసంబంధము లెట్లయ్యెను ?

జ్ఞానరూపియగు జ్ఞాత అహంకారరూపుడై అపానవాయువుతో గూడి ఘ్రాణేంద్రియముద్వారా గంధమును గుర్తెరిగి పాయువింద్రియముచే మలవిసర్జనము చేయును. ఇవి పృథివీతత్త్వకార్యములు. ఇట్లె జ్ఞానరూపి జ్ఞాత చిత్తరూపుడై ప్రాణవాయువుతోగూడి జిహ్వేంద్రియముద్వారా రసమును గుర్తెరిగి ఉపస్థేంద్రియముచే జలవిసర్జనము చేయుచు నానందించుచుండును. ఇవి జలతత్త్వకార్యములు. ఈ విధమున అహంకారము, చిత్తము, బుద్ధి, మనస్సు క్రమముగా పృథివి, జలము, అగ్ని, వాయువులు పై అంతఃకరణములకు సంబంధములుగా తెలియబడుచున్నవి. ఇట్లగుట అంతరింద్రియములు భూతసంబంధములనియు, సంఖ్యకు నాలుగనియు తెల్లమగుచున్నది.

మరియు అన్నమయకోశము అహంకార ప్రధానమైనదగును, ప్రాణమయకోశము చిత్తప్రధానమైనదగును, విజ్ఞానమయకోశము బుద్ధి ప్రధానము గలదగును, మనోమయకోశము మనస్సు ప్రధానముగా గలదగును అగును. అహంకారము, చిత్తము, బుద్ధి, మనస్సులు గలవై కోశము లిట్లు క్రమముగా నేర్పడియుండ నాలుగవదైన మనోమయకోశము మూడవదిగా నుండునట్లును, మూడవదైన విజ్ఞానమయకోశము నాలుగవదిగా నుండునట్లును వాడుకలోని కొంతులకు కచ్చెనో తత్త్వవేత్త లాలోచించవలెగాక !

మనశ్చిత్తములు బుద్ధ్యహంకారములు నేకీభవించుటకు మరొక కారణమును గలదు. వీనికి మూలభూతులగువారు వాయుదేవుడు గంగా

---

మనస్సును, అహంకార మిశ్రమమైన బుద్ధియును, సుషుప్త్యవస్థ ననుభవింపజేయ ప్రధానములై రెండుగా నేర్పడి యుండును. అట్లగుట స్థూలశరీరమునకు 22 ఇంద్రియములనిగాని సూక్ష్మశరీరమునకు 17 ఇంద్రియములనిగాని భావింపరాదు.

ఆనందమయకోశము కారణశరీరమున గాఢాంధకారమగు సుషుప్త్యవస్థయందు నజ్ఞానానంద మనుభవింపజేయుటకుగాను ఏవృత్తులుండరాదనియేమొ అంతఃకరణచతుష్టయ మొకదానియందు మరియొకటి మిశ్రమములు కాగా వృత్తిరహితమై రెండుగా నేర్పడెనని గ్రహించవలెను. కొందరు పైరీతి భ్రమప్రమాదవశులగుటచే నేమొ సూక్ష్మశరీరమునకు 17 ఇంద్రియములని చెప్పుచుందురు.

దేవియును, అగ్ని దేవుడు, భూదేవియును. అజంటలు అల్మగ అగుటచేత వీరివలన ప్రధానతత్త్వములుగానైన అంతరింద్రియములు నాల్గును వాని మూలభూతముల జాడనే యవలంబించి సుషుప్త్యవస్థయందు నూతన సృష్టికినై యేమో, యొకటొకటి యేకీభవించి నాల్గును రెండుగా నైక్యమై యుండవచ్చును. రెండవదియు నాల్గవదియును, మొదటియు మూడవదియు నేకీభవించును.

ఇట్లు భావి పిండాండములకైన పంచకోశముల మూలములుగా పంచవృత్తములను నిర్మించి యా శిల్పసుందరి పంచకోశేశ్వరి యను నామ మొందెను. "కోశశ్రీ".

8 అష్టదళపద్మము. 8

సాంఖ్యశ్రీ (కారణస్వరూపము) సాంఖ్యస్వరూపిణి

ఈ పద్మదళములు అష్టభూత చిహ్నములు. భావి పంచభూతములకును, మొదటగలిగిన అవ్యక్తాది త్రిభూతములకును, కారణములుగా నొప్పును. అట్టులైన ఎనిమిది దళములయందును కారణ (మహాకారణములు లోగడ చెప్పబడినవి) గుణత్రయ మొక్కొక్క దళమున ప్రవేశించి తాండవ మాడుచుండగా గుణముల సంఖ్య 24 అయ్యెను. ఇవి భావి చతుర్వింశతితత్త్వ చిహ్నములై యొప్పును. ఇట్లు దళములపై నిరువది నాల్గు గుణముల వెలయించి నాట్యమాడునట్లొనర్చుటయే గాక భావి ప్రపంచమునకు సకలవిషయ వ్యవహారముల వృద్ధిపరుప చిహ్నములుగా అష్టదళములయందు నొక్కొక్క దళమున నూటయిరువదైదు అంతర్దళముల నేర్పరుప భావి సహస్రకర్మమూలములై సహస్రకాంతులచే సహస్ర సంఖ్యాత్మకముగా నొనర్చిన యాశిల్పసుందరి సాంఖ్యరూపిణి యను నామ మొందెను. "సాంఖ్యశ్రీ".

9 అమృతసరోవరము 9

అమృతశ్రీ (కారణరూపము) అమృతరూపిణి

దీపికలకు తైలమట్లు ఆ సహస్రదళములు కోమలముగా వృద్ధి పొంది ప్రకాశింప పద్మముదిగువ నొకసరోవరము నిర్మించి దానియందు భావిసుజ్ఞానుల మృతిభయ నాశనమునకో యన నెన్నడును ఎండనట్టుగా నమృతరసము నింపివైచెను. అందుచే సరోవరమధ్య వెలుంగుచుండు

సహస్రకాంతులుగల జ్యోతిని ఆపోజ్యోతియని వర్ణించిరి. ఇట్లు నిర్మించి అమృతసరోవర నిర్మాత్రియగు నా శిల్పసుందరి అమృతరూపిణి నామము పొందెను. "అమృతశ్రీ".

## 10 త్రివేణులు 10

కర్మశ్రీ మహాకారణములో సూత్రము విశ్వకర్మరూపిణి

అమృతసరోవరమును చుట్టి యైన ముక్కోణపుటాకృతిగా భావి ప్రపంచ విశ్వకర్మల జలప్రవాహముల మూలములుగా గంగా, యమునా, సరస్వతులను నదులను వరుసగా త్రవ్వి వానిని భావి - ఆగామి, సంచిత, ప్రారబ్ధములను కర్మత్రయ జలములచే నెప్పుడెండనటుల నింపివైచెను. ఈ నదీత్రయములోని అజ్ఞానమను కర్మరూపజలమును, అమృతసరోవరములోని జ్ఞానమను నమృతరూపపయస్సును కలియకుండగా పరమహంసయైన నొకదానిని రూపొందించి అమృతసరోవరమున విహరింప నాజ్ఞాపింప నది వానిని వేరుపరచు చుండును. ఈరీతి నెండిపోవని నదీత్రయమును కర్మ జలములచే నిండియుండునట్లు నిర్మించిన యా శిల్పసుందరి విశ్వకర్మ స్వరూపిణి యాయెను. "కర్మశ్రీ".

## 11 త్రిపుర నిర్మాణము 11

త్రిపురశ్రీ (సూక్ష్మము) త్రిపురసుందరి

ముక్కోణపు టాకృతి గానున్న మూడు నదుల కోణములయందును మూడు పురములను నిర్మించెను. ఆ పురముల క్రిందిభాగమున నా మూడు నదులును ప్రవహించుచుండును. ఈ పురముల పునాదు లెవ్వియో, కుడ్యము లెవ్వియో, పైకప్పులు ద్వారము లెవ్వియో యీ గ్రంథమున "ఆదిమూల" మను శీర్షిక క్రింద 9 వ పద్యము మొదలు చదివినచో విపులముగా తెలియును. నదులయొక్క మూడు కోణములయందు నిర్మించిన మూడు పురములలో రెంటియందున మాత్ర మొక్కొక్కదానిలో తొమ్మిది గృహములచొప్పున పదునెనిమిది గృహములును, మూడవదానియం దేడు గృహములను నిర్మించి యీ మూడవపురము ముంగిట పై మూడునదులును త్రివేణీసంగమమున నేకనదిగా కలిసి ప్రవహించునట్లు చేసెను. పై త్రిపురగృహముల సంఖ్య ఇరువదైదయ్యెను. ఇవి భావి పాంచభౌతిక సాంఖ్యసూత్రమున నేర్పడు నింద్రియగోళకముల చిహ్నములని యెరుంగ

కలెను. ఇట్లు త్రిపురనిర్మాత్రి - త్రిపురమహారాజ్ఞియైన యా శిల్పసుందరి త్రిపురసుందరి యను నామ మొందెను. "త్రిపురశ్రీ".

12 భువన నిర్మాణము 12
భువనశ్రీ (సూక్ష్మము) భువనేశ్వరి

పై పురమందు అనేక గృహంబులను నిర్మించి వానిని త్రిభువనములుగా నొనర్చి ఆత్రిపురములను రాజధానులుగను, త్రివేణీసంగమము గలిగిన పురమును కేంద్రరాజధానిగను తన శిల్పనైపుణిని తీర్చిదిద్దెను. ఇట్లు భువననిర్మాత్రియైన యా శిల్పసుందరి "భువనేశ్వరి" యను నామము నొందెను. "భువనశ్రీ".

13 బ్రహ్మబిల నిర్మాణము 13
శబ్దశ్రీ (మహాకారణములో స్థూలము) సరస్వతి

పిమ్మట కేంద్రరాజధాని మధ్యనుండి బాహ్యముగను, స్థూలముగను, - జదుర్గ ముఖద్వారము (తలవాకిలి) నొకదాని నిర్మించెను. తరువాత సూక్ష్మాంతరమున రాజకోటకు మధ్యద్వార మొకటి నిర్మించెను. దాని కంతరమున కారణమను నొక ద్వారమును దాని కంతరమున మహాకారణమున జిజ్ఞాసువులు సభదీర్చుట కైన నొక రాజదర్బారు భవనమును, దానికొక ద్వారమును నిర్మించెను. అవి క్రమముగా స్థూల సూక్ష్మ కారణ మహాకారణములన పరాదివాక్కులనెడు కవాటములతో బ్రహ్మబిలమన చిత్రమగు నొక సుందరమార్గమును నిర్మించెను. అది బ్రహ్మవక్త్రమన నందు జిహ్వ యను అమృతోపసరోవర మిట్లు నిర్మించెను. మీది అమృతసరోవర మధ్యనుండు కమలపుమధ్యవెల్గు ఆత్మభానుప్రకాశముచే గలుగు సుకృకాంతులు పద్మదళములందు ప్రసరింప నవి వికసించును. క్రింది అమృతసరస్సుగూడ సుషుమ్నాంగి బుడగలై యా బుడగ లావిరిగానయి పైకెగసి పద్మదళములపై బడునట్లు వర్షింప నట్టి వర్షామృతము పారలి బ్రహ్మబిలద్వారమునబడి ప్రవహించుటలో నితరత్ర పారి క్షీణింపక బిలమునందే వెలుపలినుండి లోపలికి లోపలినుండి వెలుపలికి ఇడతెగక ప్రవహించుచుండును. ఇవ్విధమైన బహువిచిత్ర శిల్ప సౌందర్యమున బ్రహ్మబిలము నిర్మించి బ్రహ్మబిలామృత సరసిగను, తత్సరోవరనిర్మాత్రిగను నైన యా శిల్పసుందరి "సరస్వతి" యను నామ మొందెను, "బ్రహ్మలోకే బ్రహ్మసరః ఆశ్రయత్వేన అస్యా

అస్తీతి సరస్వతీ" (లింగాభట్టీయము) బ్రహ్మలోకమందు బ్రహ్మసరస్సు నాశ్రయించి నదీరూపముగా ప్రవహించుచున్నదిగాన సరస్వతి. "శబ్దశ్రీ".

## వీణ

బ్రహ్మబిల మనెడు బ్రహ్మవక్త్రమునందు అమృతోపసరసి ప్రవహింప నా ప్రవాహాధ్వములో యను పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ యను నాలువిధముల వాక్కుల నిర్మించును. అందు నొక్కొక్కదానియందు నాలుచొప్పున జిహ్వాయనెడు పదునలు వెలందిచే పలుక్కంపబడు అచ్చులైన పదునారగు శబ్దంబుల నెడు మెట్లను నిర్మించి వానిని వైఖరీవాక్కును వీణపై స్థిరముగా బిగింపుచేసి ఆ మెట్లపైని ప్రణవాంశలనెడు నవలోహ తంతువులను వరుసగా కూర్పుచేసి నిలిపి యా బ్రహ్మబిలమును పశ్యమోహనమైన వీణగా రూపొందించెను. దానియందు భావివిశ్వసృష్టికై శ్రీకార ప్రారంభమున సర్వమంగళ గీతికలను నవరాగ మాలికతో నాలాపించును.

14 14

కృతిశ్రీ | మహారణ్యము | ప్రకృతిదేవి

భగవత్పట్టణవాసుల ముముక్షువులగు జ్ఞానులైనను సులభముగా బోకుందురు గాకయని యీ పట్టణము చుట్టును దట్టమైన చీకటిగల గొప్ప అడవిని నిర్మించెను. అందు విషయవాసనలను బీజములను నాటి వృక్షములుగా పెంపుజేసెను మరియు కేంద్రరాజధాని దగ్గరనున్న త్రివేణీసంగమమున స్నానమాచరింపవచ్చు నధికార ముముక్షువులనందు జేరనీక పతనముగావింప నాసంగమ తీర్థమునకు తమ పిపాసల దీర్చుకొనెడు నెపమున రాగలున్నట్టు ఐహికవిషయవాంఛలు, రాగాదులు నను ఘోరమృగంబుల సృష్టించి పెంపొందింప జేయుచుండును. ఇట్టి మహారణ్యముతో గూడినట్టియు, భావిజగత్ప్రారంభమునకు హేతువైనట్టియు, మహాకాశశరీరమధ్య వెలయించిన ఆత్మకను భగవత్పట్టణమును (పురము) తన శిల్పనైపుణ్యమైన కృతులతో నిర్మించి తాను ప్రకృతి నామమును వడసెను. "జగత్ప్రారంభః క్రియతే అనయేతి ప్రకృతిః" దీనిచే జగత్ప్రారంభము చేయబడును గాన ప్రకృతి. ఇట్లు నిర్మించిన పురమను శరీరమునందు నా భగవత్తత్త్వమును ప్రత్యగాత్మను నివసింపజేసి, ఆ ప్రత్యగాత్మను పురుషనామమున వర్తింపజేసెను. "పురి శరీరే శేత ఇతి పురుషః" (లింగాభట్టీయము)

పురమనగా శరీరము. అందుండువాడు కనుక పురుషుడు. "ప్రకరోతి పురుషోప భోగార్థం శబ్దాది భోగ్యానితి ప్రకృతిః". పురుషోపభోగము కొరకు శబ్దాదివస్తువులను చేయునదిగాన ప్రకృతి. (లింగాభట్టీయము) ఇట్లు పురనిర్మాతయును, పురమునందు నివసించు ప్రత్యగాత్మ (పురుషుడును) ఇద్దఱువురును ప్రకృతిపురుషులైరి. "ప్రకృతిశ్రీ".

15 15

బ్రహ్మశ్రీ **బ్రహ్మనామము** బ్రాహ్మీ

ఏ సద్వస్తువు నాధారమున పైపురము ననేకరీతులగు కృతులచే నిర్మించి గొప్పదగునటుల వ్యాప్తిపరచి తాను పురస్వరూపము నేదాల్చి వృద్ధిపొందించి తాను వృద్ధిపొంది "చంద్రచంద్రికా" న్యాయంబున "బింబకిరణ" న్యాయంబున అచంచల బింబమందు చంచలకిరణము అవతరిల్లి వృద్ధిపొందునట్లు నిర్గుణాత్మయందు సగుణాత్మకముగా తా నవతరిల్లి చంచలత్వమున పట్టణస్వరూపయై తా బొందు వృద్ధి మొదలగునవి తన కాధారమగు నాత్మకు నంటఁగట్టఁ దలంచి వృద్ధిపొందు వాఁడనియు వృద్ధిబొందింపఁ జేయువాఁడని అర్థముగల "బృంహతీతి బ్రహ్మ" యను నామముఁ గల్పించిన దాయెను. ఆత్మకు వృద్ధిక్షయాదు లుండుననుట విరుద్ధము. వృద్ధిని పొందునట్టి యర్థముఁగల బ్రహ్మనామముచే నొప్పాచుండుటయుఁ గూడ "మేఘగమనచంద్ర" న్యాయంబున బ్రహ్మనామము భ్రమగా ప్రకృతిదేవి కల్పించె ననఁదగును. అట్టి బ్రహ్మకు సంబంధించిన తాను (ప్రకృతి) ఆపురుషుని సాంగత్యమున పురుషుఁడు బ్రహ్మనామము పొందగా, స్త్రీయైన తానును "బ్రాహ్మీ" యను నామము ధరించెను.

ఇట్లు చిద్రూపము మొదలుకొని బ్రాహ్మీవఱకునుగల పంచదశ నామములతోను, పంచదశకృతులతోను, పంచదశభాగములతోను (ఆవరణలతోను) పంచదశకళలతోను సత్యలోకమునందు బ్రహ్మపట్టణమును దన మర్మశిల్పవైభవమున నిర్మించిన యాశిల్పసుందరి "పంచదశి" అయ్యెను. పిమ్మట తనచేత నిర్మింపబడిన సత్యలోకనిర్మాణ మంతయు తిరిగి యొక్కసారి తిలకించి తానొక్కతే యగుట తరువాతి కార్యక్రమమునకు సమర్థముకాని తనయస్వతంత్రత దెలిసికొన్నదై తనస్థాన మాశ్రయింప మార్గమగు బ్రహ్మబిల ముఖద్వారముజేరి క్రమముగా నొక్కొక్క ద్వారము దాటుచు, వాచ్యార్థలక్ష్యార్థములతో నూర్ధ్వగతి ప్రయాణ మొనర్చి అన్నిటికగ్రమైన బిందుసన్నిధింజేరి అట వృత్తమగు గర్భా

అయము ముంగిట జేరగా లోగడ తానొనర్చిన పంచదశకృతులన్నియు గన్పడకున్నంత నిష్కామయై సాలోక్యపదవి నందుటయు, నింక సాకృత్తము మహాకారణ శరీరముగాగ నది తానేయై సామీప్యపదవి నందుటయు, నింక నాబిందువందు ననన్యభక్తి హెచ్చి చిద్రూపియైన తాను సద్రూపమై సారూప్యపదవి నందుటయు, నింక సాయుజ్యపదవి నొందు నర్హతకును, ఆత్మైక్షణమగు నానందమొందు నర్హతకును, నింక భావిజగత్సృష్టి నొనర్ప సర్వస్వతంత్రత సంపాదించుకొనుటకునైన తనకు పరమైన ఆత్మలోని యొకపూర్ణకళ నందగలిగి పంచదశియైన తాను షోడశకళాపరిపూర్ణయగుటకు నాత్మబిందువునిట్లు భర్తగా వరించెను. "వరేణ్యం" (వరేణీయం) "యద్వరం వరుమర్హతి శ్రేష్ఠం తద్వరం" ఆత్మతేజస్సును వరింప నర్హత గలిగిన దౌటచేతనే ఆపురుషుని వరించినది. అతిశ్రేష్ఠమైన తేజస్సు గలవాడగుటచే ప్రత్యగాత్మ పురుషుడు వరింపబడినాడు. పంచదశి తనకు పరముగానున్న ఆత్మతేజస్సునుండి పదునారవదిగా నొకపూర్ణకళను పొందగలిగి షోడశకళాపరిపూర్ణయయ్యెను. ఇట్లైన తాను అణుమహాత్స్వరూప మైనట్టియు, మహాకారణమైనట్టియు, మహాకోమలమగు తనువు తానేయగుచు లలితయన హిరణ్మయమగు సహస్రకాంతులతో వెలుగొందు లలితాదేవి యయ్యెను. ఇట్లైన తానును సహస్రాత్ముడైన ప్రత్యగాత్మ పురుషుడును ఆదిమ దంపతులైరి.

ఇట్లు షోడశకళలుగల సర్వస్వతంత్రయైన యా లలితాంబ విశ్వసృష్టి వెలయింప నా సహస్రారమునుండి చిచ్ఛక్తిరూపమున క్రిందికి బ్రహ్మబిలపు తలవాకిటివరకు వచ్చి అట వైఖరీవాక్కై జేరి తన కోమల కంఠమున సత్యలోకవాసియగు బ్రహ్మమే సత్యమనియు అతని నైజ కళయే మంగళమనియు,అతని తేజస్సే అతిసుందరమనియు వచించెను. ఇట్లు సత్యము వచించి "సత్యవతియు" మంగళముగా వచించి "సర్వమంగళయు" సుందరముగా వచించి చారువాక్కై (చార్వాక్కై) గలదియునై ఈ మొదలైన యింక ననేక విశేషములచే నీ లలితాంబ సహస్రనామములు గలదయ్యెను. "సత్యం శివం సుందరమ్". పిమ్మట పంచభూతములకు పంచతన్మాత్రల సృజించెను.

### కారణము – పంచభూతసృష్టి.

ముందుగా నపుంసకమగు నాకాశమును సృష్టించెను. అందుండి పుంస్త్వముగల వాయువును, అందుండి పుంస్త్వముగల అగ్నిని, అందుండి

స్త్రీత్వముగల జలమును సృష్టించి ఆ జలమునకు పెక్కురెట్లుగల లవణ ద్రవ్యమును గల్పించి అందు మిశ్రమము చేసెను. అట్టి లవణజలమునుండి తన్మధ్యభాగమున కఠినాంశ మగు స్త్రీత్వముగలదానినిగ భూమిని కల్పించినవాడాయెను.

మరియు నా శిల్పసుందరి పంచభూతమధ్యముడగు అగ్నియొక్క తేజస్సునుండి కొన్నికళలను తాను పొందిన ఆత్మకళలోని అణుమాత్ర భాగమును సమ్మేళనపరచ నది మహావిద్యున్నిలయముకాగా దానిని తన సన్నిధియందే యుంచుకొనెను. ఆ నిలయమునుండి యా మహావిద్యుత్తును రూపరహితముగ నంతట వ్యాపింపఁజేసెను.

## సూత్రము

ఇంక భావిపిండాండముల కొరకైన బ్రహ్మాండమొకటి సమష్టి రూపమున నిర్మించెను. అందు రూపరహితమగు నా విద్యుత్తును రూపొందింప దలంచి బ్రహ్మాండమున తన శిల్పనైపుణిని భూతరహితమగు నొక గొప్ప సూర్యగోళక యంత్రము నిర్మించి, లోగా తన శిల్పప్రభావమున బిందువును, వర్తులమను యంత్రమును నిర్మించి రూపులేని సద్వస్తువగు ఆత్మను అందు బింబాకృతిగా రూపొందింపఁజేసి హిరణ్మయ మండలాధిపునిగా ప్రకాశింపఁజేసినట్లును, (శిల్పి తా నొనర్చు వాయుజలరహితమగు గాజుబుడ్డమధ్య ద్వంద్వభావము గల్గియు, రూప రహితమైనట్టియు, విద్యుత్తును ద్వంద్వతంతువుల మేళవింపజేసి అజ్ఞానిచే నందు జ్యోతి రూపమున రూపొందించినట్లు) అందు తనసన్నిధియున్న విద్యున్నిలయము లోని విద్యుత్తు నెల్లప్పుడు ప్రవహింపజేసి చండతేజంబున ప్రకాశించునట్లొనర్చెను. ఆగోళకము సూర్యమండలమన దానిని తన యాత్మశక్తిచేత నిరాధారమున బ్రహ్మాండ మధ్యమున నిలిచి సుస్థిరముగా నుండునట్లొనర్చెను. ప్రత్యగాత్మయను నతడు లోకవిభుడుకాగా నితడు లోకమిత్రుడగును. * అతడు బ్రహ్మాండజనకుడైన నితడు పిండాండ జనకు

* వివరము :- అతడు జగత్పిత యయ్యును అతని తనయుడగు జీవి గాంచినపుడే జనకుడని గ్రహింప బడగలడు. బ్రహ్మాండవర్తియైన సవితృమూర్తిని గాంచినట్లతనిని గాంచలేడు గాన సవితృమూర్తి పిండాండ జనకుడయ్యెననియు జీవి పంచభూతములదాటి బ్రహ్మాండమున సవితృమండలమున కేగినగాని యా ప్రత్యగాత్మ భగవానుని దర్శనము లభింపదు గాన నతడు బ్రహ్మాండజనకుడయ్యెననియు గ్రహింపవలెను.

డగును. అతడు సహస్రాక్షుడు. ఇతడు సహస్రకిరణుడు. అతడు హిరణ్మయమండల మధ్యవర్తి. ఇతడు విద్యున్మయమండల మధ్యవర్తి. అతడు ప్రత్యగాత్మయను విశ్వకర్మభగవానుడు. ఇతడును సూర్యుడను విశ్వకర్మ భగవానుడే. అతని కితడే యుపమానమగును. ఇట్లు సవితృజనకుని ప్రత్యక్షభగవానునిగా బ్రహ్మండమున నిల్పెను.

మరియు తాను నిర్మింపబోవు తొంబదారు తత్త్వములకు మూలము లన తొంబదారు మూలద్రవ్యములను నిర్మించి శ్రీచక్రనగరమున నిల్పి వేచినట్లు, భావిబాహ్యశిలోత్కరణ * లోహాది ధాతుమూలములన సవితృభగవానుని తేజస్సున (అణువునందు) తొంబదారు మూలద్రవ్య ముల నిల్పివేచెను. ఇతడు దినకరుడును, అతడు సూత్రదినకరు డగును. అతడూ అచలుడే. ఇతడూ అచలుడే. ఇతనిని (Protons) ధన విద్యుత్తుచేత నుష్ణమున ప్రజ్వరిల్లజేసి దినాధిపతిగా నుంచెను.*

మరియు ద్వంద్వభావముగను, చలనస్వభావముగను చంద్రగోళ మొకటి నిర్మించెను. అది సూర్యభగవానుని కతీమణియన భానుకాంతి యెప్పుడు చంద్రగోళమునందు పదునైదు కళలుగా పొందునట్లొనర్చి దానికి పరమునగు తన పదునారవ కళాంశమును ప్రసరింపజేసెను. అట్టైన చంద్రబింబము పదునారు కళలతో భావిపిండాండముల కాహారమునకై కించిచ్చలన భావనుగల వృక్షలతాదులగు స్థావరముల నిర్మించు కొరకు కలసినన్ని బీజభేదములనొసంగి రాత్రి నిర్మాతయగు నట్లొనర్చెను. చంద్రబింబము (Electrons) ఋణవిద్యుత్తు గలిగి చల్లనికాంతిచే ప్రకా శించును. దీని పూర్ణవిశేషములతో గ్రహనక్షత్రాది గణితములతో పిండ బ్రహ్మండములను శిక్షయందు వర్ణింపబడెను. చంద్రశబ్దము స్త్రీలింగ మగుట సమంజసము. ఆంగ్లమునను తురకమునను హిందీలోను స్త్రీలింగము గానే భావింపబడెను.

సూర్యచంద్రులలో నొకరు ధనవిద్యుత్తుతోను, మరియొకరు ఋణ విద్యుత్తుతోను ప్రకాశించుచుందురు. ఎట్లన:- సూర్యునిలోని ధనవిద్యుత్తు చంద్రుడు పొందలగు వారందరకు పంచుకొనుచున్నను, ఎప్పటికి తరుగనిదై యుండును. చంద్రుడు ఋణవిద్యుత్తు గలవాడు. కృష్ణపక్షమున తన

---

సూర్యతేజస్సుచే బీజరహితమగు పర్వతమాలు లోహఖనులు పొందదగినవి గలిగి దినమందె వృద్ధినొందుచుండు ననువిషయము లోగా పూర్తిగా వ్రాయబడి యున్నది.

లోని కాంతి కరవు అగుచుండగా శుక్లపక్షమున మరల సూర్యుడను భర్త నుండి విద్యుచ్ఛక్తిని పొందుచుండును; కావున ఒకరు ఋణవిద్యుత్తును, ఇంకొకరు ధనవిద్యుత్తును గలవారుగా నుందురు.

## స్థూలము - పిండాండ సృష్టి.

పిండాండ సృష్టికి తనభర్తతో నేకీభవించి యిరువురి యన్యోన్య భావమున నిట్లు సంకల్పించిరి. జలచర, భూచర, గగనచర విధునసృష్టి మూలములను సంకల్పబీజముల నెన్నిటిని తలంచెనో అన్నిటిని మంచి వానిని విశ్వమంతటా వెదజల్లిరి. అంతట దాంపత్యములుగల సృష్టిజాల మేర్పడియెను. అందు ఆదిమదంపతులను శాశ్వతజనకులని తెలిసికొనగల వివేకవంతులగు జనులుందురు. అందు జగదుద్ధరణ కొరకును సృష్టితత్వ మును తెలిసికొనగలిగి సోదరులకు తెలియజేయునట్టి పంచమహాఋషులుద్భ వించిరి. వారు తమయోగనిష్ఠతో సూర్యమండల మార్గమున హిరణ్మయ మండలము మరిగి అచట తమతండ్రియొక్క జగచ్ఛిల్పమంతయు సారని భూమండలమున దానిని నిల్పదలంచి అప్పటి సోదరబృందమునకు కడుకష్ట ముండగా వలయు సౌకర్యములను సృజించి యొసంగి సంజ్ఞారూపమున నున్నభాషను విపులీకృత మొనర్పదలంచి ప్రకృతిదేవి ధ్యానావ లోకమున ఆమె సృష్టించిన నాల్గువాక్కుల వెలువడు సాంగక్షరములను అందు అంతరములను వానితోనైన పదువారచ్చునను ఆయాస్థానముల పలుకుహల్లులను కనిపెట్టి వాడుకలోనికి తెచ్చిరి. ఇది ప్రకృతిసృష్టిలోని వాక్కులచే వెలువడిన భాషకనుక దీనిని ప్రాకృతభాషగా వ్యవహారము నుంచిరి. దీనిచే ఏజగత్పితలు జగచ్ఛిల్పులై జగత్తునిర్మించిరో, యెవరి క్షేమమారసి బ్రహ్మాండములో స్థావరము నిర్మించిరో, అట్టిమార్గము నే యనుసరించి సోదరుల శ్రేయస్సుకై యీప్రపంచ జ్ఞానమొంది తామును శిల్పులు గావలయునో అట్టివి తెలియదగినట్టి వెన్నిటినో తెలియజేయు నట్టివే వేదములు శాస్త్రములును. పురాణదంపతుల చరిత్రలవ్రాసి నవి పురాణములుగా నెన్నోగ్రంథములు ప్రాకృతభాషలో వెలయించిరి. మరియు సత్యలోకపు జగచ్ఛిల్ప సామ్రాజ్యముపగిది మానవలోకమున జగదుపకరణ శిల్పసామ్రాజ్యము నిల్పిరి. స్థానము త్రివిష్టపము. పాలకుడు శిల్పసామ్రాజ్య చక్రవర్తియగు దేవేంద్రవిశ్వకర్మ. వానికృతులు వర్ష సాధక-నిరోధక యంత్రయానములు, ఆకాశయానములు, జలాంతర్గాము లను నోడలు మొదలైన మానవోపయోగ్యము లవెన్నియో అవన్నియు.

అతనికి శిల్పరసాయనశాల ఖాండవవనము. శాసనసభకైనది నందనవనము. ఆహారము, ఊర్ధ్వరేతస్కులుగాజేసి మంచిమేధస్సు నూతన శిల్పనిర్మాణమునకైన బుద్ధితత్త్వము నభివృద్ధిపరచునట్టి అమృతరసము. అందుండువారు సర్వశిల్పములం దారితేరిన నిష్కాములైన శిల్పులే. అది దేవలోకము.

మరియు విద్యున్నిలయములుగానున్న యున్నతమగు మూడు పర్వతములయందు మూడుపురంబులనెడు మూడుయంత్రములను నిర్మించిరి. అందు సూర్యబింబములోని విద్యుత్ప్రవాహ మెల్లప్పుడు నెడతెగక ప్రవహించునట్లొనర్చిరి. దానియుపయోగము మానవుల కవసరము అగు దీపికలు, దూరశ్రవణ, దూరదృష్టి, గగనగమనాదియంత్రములు. ఇట్లీ యజనాభదేశమున త్రిపురములను ప్రతిష్ఠించిరి. అందుండువారు నిష్కామ శిల్పశరేణ్యులైన అసురులే.

## దిఙ్ముఖోపాసన — జ్ఞానమార్గము

సానగాది పంచర్షులు తమ యోగనిష్ఠలో గనుగొన్న మాతృదేవిని గానము చేయునట్టి బిడ్డల రక్షించునదిగాన గాయత్రీ యను పేరున సంబోధించి ఆమెను విశ్వరూపిణిగా భావించి పంచభూతములే పంచవదనములుగ సంతరించి పంచదిక్కులయందు నాపంచవదనముల దలంచి దిఙ్ముఖోపాసనము మానసికముగా తామాచరించుటే గాక, దేవలోకమునగల శిల్పులందరిచేగూడ నాచరింపజేయుదురు. ఈమార్గము మానవలోకమున నాచరింప శక్యత లేదనియే [illegible] పంక్తిముఖములుగా లోహ, శిలా, దారు, పత్రాదులయందు రూపించి మానవులచే నర్చింప చేయుదురు.

## ఉపాసనామార్గము

బ్రహ్మపట్టణమున నిర్మింపబడిన శ్రీనగర చక్రమువోలి బంగారు లోహముచే ననేక చక్రముల నిర్మించి యర్హతగలవారలచే నాయా స్థానములయందు పంచదశనామముల వహించిన దేవి నాహ్వానించి నిష్కామ మార్గాన నుపాసించునట్లాజ్ఞాపింతురు.

## భక్తిమార్గము

బ్రహ్మపట్టణమున నిర్మింపబడిన భగవదాలయమురీతి మానవ లోకంబున శిలలచే భగవచ్చిహ్నమన "లింగాయతాలు" (శివాలయములు) అజనాభదేశమున ప్రతియూరను ప్రతిష్ఠలనొనర్చి ఆయా యూరి వారలచే పూజించునట్లొనర్తురు.

## తీర్థయాత్రలు

అంతఃకర్మలగు ఆగామి సంచిత ప్రారబ్ధములసంగమస్థితి తెలియ పరచు చిహ్నములో నున్న బాహ్యమున భూభాగమునందు గంగా యమునా సరస్వతులను నదీత్రయ సంగమచో కనియున్నట్లు నిర్మించి వానిలో స్నానమాచరించి అచట యేర్పరచిన దైవచిహ్నములగు నాలయలింగముల దర్శించి ఆనందమొందున ట్లొనర్తురు

## సూర్యనమస్కారము

“శరీర మాద్యం ఖలు ధర్మసాధన” మ్మనురీతి మానవుం డారోగ్యవంతుడై నిశ్చలమానసుడైన గాని పరసాధన నూఁకయలేదు గాన ఆకలి కన్న మెట్లో పరసాధనమున కారోగ్యముల్లు. అట్టి ఆరోగ్యమునకు భంగము గలుగకుండ సూర్యబింబములోని విద్యుచ్ఛక్తి నేత్రములద్వారా తనువులో ప్రవేశించి అచ్చటి కోశములను నాడీమండలము నేరోజు కారోజు శుభ్రపరచి ఆరోగ్యమున నానందింప జేయజాలినట్టి సాధనము లను “సూర్యయంత్రముల” నిర్మించిరి. వానిని విద్యాలయములలో నైకు మతములను పరీక్షల నుత్తీర్ణులై సూర్యనమస్కారము లొనర్చుట యం దనుభవజ్ఞులగు మానవోత్తముల నేర్చి వారిని రాజ్యాధిపతులుగా జేసి వారి రాజ్యప్రజలకు నిత్యము పైసూర్యయంత్రముల సాయమున ప్రజలకు అరుణో దయమున అరుణకాంతులు నాడీమండలమున ప్రసరింపజేసి ఆనంద మొందింప వానిని ప్రజల కిత్తురు. అభ్యాసము కుదిరిన పిమ్మట యంత్ర సాయములేకయే అనుభవము పొందు విధానముల నభ్యాసపరచి యంత్రముల కేయ నాజ్ఞాపింతురు. అట్లాచరింప జేయువారే సూర్యవంశపు రాజులు.

ఇట్లు రాజులేమి, మానవులేమి, దేవతలేమి, ఋషులేమి, బ్రహ్మ లేమి, మూర్తులేమి దేశమునకు జేయవలసిన సేవలన్నియు ఒకరికొకరు సోదరభావమున నొనర్చుచు, నిత్యకర్మలంగా భక్తిమార్గములేమి, యుపా సనాభాగములేమి, జ్ఞానమార్గములేమి, ఆదిమదంపతీ పూజలేమి, మనో వాక్కాయముల నహింసాత్మక మార్గములేమి, ఆరోగ్యాధ్యాత్మికముల సూర్యనమస్కారములేమి నిత్యమంగళములతో సర్వసంపదలతో నెల్లవ్వా డాచరించి యానందవార్థి దేలి యాడుచుందురు.

— గ్రంథకర్త.

---

(శ్రీ తీర్థులవారు వ్రాసిన వ్రాతప్రతిలోని చివరి నాలుగు పుటలు నష్టమైనందున ఈ శ్రీచక్ర వివరణము అసమగ్ర మైనది.)



స్వర్గీయ శ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థులు.

విళంబి సం॥ కార్తిక శు ౧౧ శుక్రవారము (22-11-58)

బ్రహ్మైక్యదినము.

గ్రంథకర్త:



కీ. శే. పొన్నపల్లి పార్వతీదేవి

( గ్రంథకర్తగారి దౌహిత్రి )

జననము : బహుధాన్య సం॥ ఆశ్వయుజ శు ౧౫ ఆదివారము.

( 9-10-1938. )

మరణము : విజయ సం॥ ఆషాఢ బ ౫ గురువారము.

( 30-7-1953. )

# స్వర్గీయ శ్రీ పొన్నపల్లి పార్వతీదేవి
# సంగ్రహచరిత్ర.

తన నాలవయేట వచ్చీరాని మాటలతో తన తండ్రివద్ద తెలుగు అక్షరములకంటె ముందుగా ఇంగ్లీషు అక్షరములన్నియు పలుకుటయే గాక చక్కగా వ్రాయుటగూడ నేర్చుకొన్నది. తన పేరునకు వలయు అక్షరములను తెలిసికొని ఇంగ్లీషులో తన పేరునుగూడ వ్రాయ నేర్చినది.

మారీసుపేటలో వీరుండెడి యింటి కెదురుగానున్న యింటిలో శర్మగారను వారొకరుండెడివారు. వారికి సంతానము లేకుంట అతి ప్రేమతో యీపిల్లను తనయింటికి తీసికొని పోవలెనని యెంతయో ప్రయత్నించెనుగాని ఫలింపలేదు. శర్మగారింట్లో ఒక కెమేరాయును, ఒక టైపుమిషను నుండెడిది. ఒకనాడు తన తండ్రి శర్మగారింటికి యెత్తుకొనిపోగా వారు టైపు చేయుచున్నారు. అది చూచి యేపుస్సులు నొక్కితే యేయే అక్షరములు పడుచున్నవో దాని నన్నిటిని చక్కగా గ్రహించినది కాబోలు, అమ్మా టైపు చేస్తావా అని అనగానే క్రిందికి దిగి టైపుమిషనువద్ద కూర్చొని నిమిషమాలోచించి తన పేరును టైపు చేసినది. ఆ కాగితమును చూచి సంతోషమునకు మేరలేక వెంటనే తన తల్లికి చూపించుటకేమో త్వరితగతి నింటికి వచ్చిచేరెను. ఈ జరిగిన పనికి మురిపెము ఆశ్చర్యము సంతోషములలో మునింగియున్న శర్మగారు ఫొటో తీయలేకపోయెను. అందుచే యీ అమ్మాయికి ఒక ఫౌన్ టెన్ పెన్నును బహుమానముగా నిచ్చిరి. ఒక రోజున వీధిగుమ్మమువద్ద కూర్చొని ఆపెన్నుతో వ్రాయుచున్న సమయమునకని పెట్టి శర్మగారు ఫొటో తీసిరి. మరియొక రోజున ఉదయమున వీధిగుమ్మమున కెదురుగా నిలబడి సూర్య నమస్కారము చేయుచున్న దృశ్యముగూడ శర్మగారు చూచి ఫొటో గూడ తీసిరి.

పార్వతీదేవి కైదవయేట నైదవనెల యైదవరోజున వేడుక కొరకు అక్షరాభ్యాసము చేయనిశ్చయించి ప్రయత్నించితిమి. కాని సాధ్యము కాలేదు. ఉపాధ్యాయుడు బడిపిల్లలు వచ్చిచేరిరి. ఈమె యింటిలోనుండి బయటకు రాదాయె. ఎంత చెప్పినను మారాడదు, అంగీకరింపదు. తుద కిట్లన్నది. "అక్షరము లన్నియు వచ్చిన నిమ్మట నాకక్షరాభ్యాసము చేస్తానంటారు. మీకేమైన చేదస్తమా?" అని కంఠమెత్తి యులికిపడ బలికినది. అందుచే మేమేమియు చేయజాలనివార మైతిమి. అల్లరిచేయు పిల్లల జూచినప్పుడు సహించనిదై ముఖము చిట్లించుకొని "బేడ్ గరల్,

బెడ్ బాయ్" అని అనుచుండెడిది. తన తొమ్మిదవయేడు పూర్తి కాక పూర్వమె షష్ఠఫారము చదువ స్కూలులో చేరినది. అది మొదలు స్కూలుఫైనలు వరకు ఏక్లాసుగూడ తప్పకుండా ప్రైజిలేటుగూడ లేకుండగనె పదునైదవయేట స్కూలుఫైనలు పరీక్షలో నుత్తీర్ణురాలైనది. తన స్కూలులో అబద్ధ మాడనట్టియు, మితభాషిణి యైనట్టియు తనకు నచ్చిన నలుగురు పిల్లలుమాత్రము తనకు స్నేహితురాండ్రైరి. వారికప్పుడప్పుడు ప్రేమతో విందులు చేయుచుండెడిది.

స్కూలుఫైనలు చదువుచున్న కాలములో తన పాఠ్యగ్రంథముల లోని పాఠములయందు గలిగిన సందేహములు తన టీచరు నడిగినను తీరనట్టి స్థితి గల్గినపుడు కినిసి నాన్నగారి నడిగి తెలిసికొనుచుండెడిది. దానిలో బాల్యాది దశలలో కౌమారదశను గురించిన దొకటి. ఇంక నిస్సారములైన బ్రహ్మచర్యాది చతురాశ్రమముల నతీతములగు మానవ ధర్మముల నెన్నింటినో తన సహజ సునాదమంజుల వచనములతో నన్నడుగుచుండెడిది. అందులకవి ఇప్పుడెందుకమ్మా నీస్కూలుకు సంబంధించినవి కావుగదా, పిమ్మట తెలిసికొందువులే యన నూరకుండెడి. పెద్దవాడైనను ఛలోక్తిగా నైన నేకారణముచేనైనబలికిన యనృతవచనములు తనచెవి సోకినచో నట నుండక విముఖత్వముచూపి వెడలిపోవును. తల్లి పిల్లలయం దేకారణముచే నైన కినిసి కఠినోక్తులు పల్కిన నెంత కఠినహృదయమమ్మా యని వెడలిపోవును.

పుస్తకాల బీరువా మధ్యనున్న అరలో నట్టలచే నిర్మించుకొన్న మందిరమున నొక సరస్వతీదేవి చిత్రపటము పెట్టి ఆపటము వెనుక ప్రక్క తన క్లాసు నెంబరును వేసి ప్రతిరోజు అగరువత్తి చూపి నమస్కారము చేసి స్కూలునకు పోవుచుండును.

ప్రతి సాయంత్రము స్కూలునుండి యింటికి రావడముతోనే నేను వ్రాయుచున్న "జగచ్ఛిల్ప" గ్రంథములోని చిత్తుగా వ్రాయబడిన పద్యములుగల కాగితములను వెనుకగా వచ్చి దొడ్లోకి తీసుకొనిపోయి చదివి మరల యథాస్థానమున పెట్టుచుండును. అట్లే యొక రోజున తీసికొనిపోయి చదివి తాతయ్యా! యీపద్యమున మూడవపాదమున కర్థము చెప్పుమని సవినయముగా బల్కెను. ఆపద్యము "జగచ్ఛిల్ప"మున 111 వ పేజీలోని 180 వ పద్యము. దాని రచన కొంచెము కష్టముగానె జరిగినది. దాని మూడవ పాదము "బ్రహ్మమయః జగమను భ్రాంతియైన విధమ్ము" అని వ్రాయబడెను. ఆమె దాని కర్థమడుగగనె తప్పపట్టిన

దని గ్రహించి వెంటనే “ అయిన విధమ్మా ” కాదమ్మా “ పొందు విధ ”మ్మని చెప్పి దిద్దితిని. అంత సరేయని వెళ్లిపోయెను.

వివాహమనుకొని స్థిరపరచిరి. ఎవరైన వివాహప్రశంస తెచ్చినపుడు “ నావివాహ మైనపుడు చూదాములే ” అని యనుచుండును. నాతోగూడ నొకసా డట్లేయన్నది. అదేమిటమ్మా అట్లందువన “గృహస్థాశ్రమమను సంసారసాగరమునబడి యేమిసౌఖ్యముల ననుభవించుచున్నారు తాతయ్యా” యని యేమేమొ వైరాగ్యబోధ సల్పుచు “సరే గాని తాతయ్యా! నీజగచ్ఛిల్ప గ్రంథమును త్వరలో పూర్తిచేసికొ”మ్మని ప్రోత్సాహముగా బల్కినది. ఇట్టి ధోరణుల గాంచ నామె మనస్సత్యమేమొ తెలిసికొనలేకపోతిని.

ఇంతలో నామెకు టైఫాయిడ్ జ్వరముతగిలి తగ్గినట్లే తగ్గి పథ్యముపెట్టగా గుంటూరు స్త్రీలకాలేజీలో ప్రవేశపెట్ట తండ్రి ప్రయత్నించి స్థానము సంపాదించెను. ఆకాలేజి ప్రిన్సిపల్ ఫీజుకట్టకుండిన యొక పిల్లను తగ్గించి తనకు స్థానమిచ్చెనన్న వార్తవిని “ నాకొరకు ఆపిల్ల విద్య పాడుచేసి నాకు సీటు తీసికొని వచ్చినావా నాన్నా!” అని ప్రశ్నించెను. అందుల కెవ్వరును మాటాడలేక పోయిరి. తన కాయుర్దాయము లేదని గ్రహించినదేమో ? మందు సేవించుటయం దుపేక్షాభావ మూనెడిది.

ఆనాడు మంగళవారము. సాయంకాలము నాలుగ్గంటలవేళ తల్లిని పిలచి “అమ్మా ! నే నానందముగా నున్నాను. నీవును అమ్మమ్మయును సంతోషముగా నుంటారు కదూ ?” అని అట్లుండెదమని అనిపించుకొని చేతిలో చేయి వేయించుకొన్నది. పిమ్మట తల్లి,తండ్రి, ముత్తవ,తాతయ్య యట్లె పినతండ్రులు బంధువులను వరుసగా నొక్కొక్కరిని పిలచి మూడు ఉద్ధరణుల గ్లూకోసు నీరును అందరిచేతను పోయించుకొని త్రాగెను. కొంతసేపటికి మరల తల్లిని పిలిచి “ అమ్మా ! రేపు సాయంత్రము 5 గంటలకు సినిమా నాటకము పూర్తియైపోతుందమ్మా, అని ఆలోచించి, కాదమ్మా రేపు సాయంత్రం ప్రారంభమై యెల్లుండి ఉదయము 9 గంటలకు పూర్తియైపోతుందమ్మా!” అని చెప్పినది. అట్లె బుధవారమునా డైదుగంటలకు మగత ప్రారంభముకాగా గురువారముదయాన 9 గంటలకు కుటుంబమును మిత్రబృందమును దుఃఖవార్ధి ముంచి మందహాసవదనముతో తన భౌతికదేహమును వదలివేసినది.

— కోలవెన్ను పరబ్రహ్మతీర్థులు.

# ఆశీస్సులు

సీ. శ్రీలసదాత్రేయ ఋషిగోత్రజాత బాళ్ల
వంశపయోధి జైవాతృకుండు
అచ్చమాంబికకు సాంబయ్యశ్రేష్ఠికి వంశ
పావనుండైన ప్రపౌత్రకుండు
అమలాత్ములగు వెంకమాంబ కోటయ్య దం
పతుల కతిప్రియ పౌత్రకుండు
అల రాజమాంబికా యల్లమందయ్యల
పూర్వపుణ్యోద్భూత పుత్రకుండు

గీ. ప్రాజ్ఞ మాణిక్యమా మనఃస్వామి నాదు
సత్కృతి ప్రకటనకుఁ బ్రోత్సాహి సుగుణ
శాలి సాంబయ్యశ్రేష్ఠి వాంఛాఫలమ్ము
శ్రీజగచ్ఛిల్పి యొసఁగి రక్షించుఁగాత.

సీ. సత్కార్యములను బ్రచ్ఛన్నదానము ముఖ్య
ధర్మమార్గ మటంచు దలచి యేమొ
తనయూరు తనపేరు తానిచ్చు ధన మింత
యని వెల్లడించరాదని వచింప
వినయమ్మెలర్పగా ధన మొసంగినవాని
సతము సజ్జనమైత్రి సల్పువాని
కాయ యంత్రముల నిష్కామబుద్ధిని మర
మ్మతులనొనర్చు సన్మాన్యతముని

గీ. ఈజగచ్ఛిల్పకృతి ముద్రణాప్రణయుని
ఆయురారోగ్య నిత్యభాగ్యము లొసంగ
మహిత గాయత్రి విశ్వకర్మయు సతంబు
వెలిగి యాశీర్వదించి రక్షింత్రుగాత.



"జగచ్ఛిల్ప" గ్రంథరచన పూర్తి కాకపూర్వమే
ముద్రణకు ప్రోత్సహించి రు. 116/- లొసంగి
తమ ప్రాజ్ఞాభిమానమును జూపిన దాతలు

**శ్రీ నాళ్ల సాంబయ్య శ్రేష్ఠి గారు**

# ఈ గ్రంథముద్రణకు ధనసాహాయ్య మొనర్చిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ | ఊరుపేరు చెప్పవద్దన్న గుప్తదాత | రూ. 340 |
| శ్రీ | యలవర్తి ఆంజనేయశాస్త్రి విశ్వబ్రాహ్మణ సంస్కృత పాఠశాల నిధి నుండి ... | 200 |
| ,, | కంకిపాడు కోలవెన్ను గ్రామ విశ్వబ్రాహ్మణసంఘంవారు | 140 |
| ,, | నాళ్ల సాంబయ్య శ్రేష్ఠిగారు (తెనాలి) ... | 116 |
| ,, | బందరుపుర విశ్వబ్రాహ్మణ సంఘమువారు ... | 116 |
| ,, | తెనాలిపుర విశ్వబ్రాహ్మణ సంఘమువారు ... | 108 |
| ,, | పామర్రు విశ్వబ్రాహ్మణ సమాజమువారు ... | 85 |
| ,, | కోట ఈశ్వరమ్మగారు (ఏలూరు) ... | 50 |
| ,, | కానూరు వీరభద్రయ్యగారు (పొట్లవల్లూరు) ... | 50 |
| ,, | పులివర్తి కేశవాచార్యులుగారి భార్య వీరమ్మగారు (గుంటూరు) ... | 50 |
| ,, | బచ్చు ఆదిలక్ష్మమ్మగారు (తెనాలి) ... | 35 |
| ,, | గిరిరాజు మహాలక్ష్మీదేవిగారు (బెజవాడ) ... | 35 |
| ,, | యలమర్తి శేషమ్మగారు (బందరు) ... | 28 |
| ,, | లక్కింశెట్టి సీతారామమ్మగారు (ఏలూరు) ... | 25 |
| ,, | నందిపాటి వెంకట్రామయ్యగారు (తెనాలి) ... | 25 |
| ,, | ఆరూరి వీరమల్లయ్యగారు (ఐతానగర్) ... | 25 |
| ,, | కొండూరు వీరమల్లయ్యగారు (అంగలకుదురు) ... | 25 |
| ,, | బచ్చు ఆంజనేయులుగారు (తెనాలి) ... | 25 |
| ,, | మొవారీల సీతారామమ్మగారు (ఏలూరు) ... | 25 |
| ,, | దీవి కోటేశ్వరరావుగారు (చిలకలూరుపేట) ... | 25 |
| ,, | కాటూరుగ్రామ విశ్వబ్రాహ్మణ సంఘమువారు ... | 20 |
| ,, | కొండూరు నాగాచార్యులు, కోనూరు సుబ్బయాచార్యులుగార్లు (పెదవలి) ... | 24 |
| ,, | చీమకుర్తి వెంకటలక్ష్మయ్యగారు (గుంటూరు) ... | 20 |
| ,, | జగ్గాపాత్రుని వీరభద్రాచార్యులుగారు (బెజవాడ) | 20 |
| ,, | బచ్చు రామచంద్రరావుగారు (తెనాలి) ... | 20 |
| ,, | కొండూరు భ్రమరాచార్యులుగారు (అంగలకుదురు) | 20 |
| ,, | కొండూరు విశ్వనాథముగారు (వల్లభాపురం) | 15 |
| ,, | కొమ్మూరు బుచ్చయ్యగారు (తెనాలి) ... | 10 |

| | | |
|---|---|---|
| ,, పోష్టుమేన్ సూర్యనారాయణగారు (తెనాలి) | | 10 |
| ,, గుత్తికొండ నమయ్యగారు (కాజ) | ... | 10 |
| ,, కోలవెన్ను సత్యనారాయణగారు (కంకిపాడు) | | 10 |
| ,, కొత్త భావయ్యచౌదరిగారు (సంగంజాగర్లమూడి) | | 5 |
| ,, పొన్నపల్లి సుబ్బయ్యగారు | ,, | 5 |
| ,, బోళ్లపాడు విశ్వబ్రాహ్మణసంఘమువారు | ... | 8 |
| ,, మానుకొండ విశ్వబ్రాహ్మణ సంఘమువారు | ... | 16 |
| ,, కలవపాములపాడు విశ్వబ్రాహ్మణసంఘమువారు, డాక్టర్ గారు | | 7 |
| ,, యల్లయ్యపాత్రుడు (బెజవాడ) | ... | 5 |

—(0)—

శ్రీ రాచపల్లి సోమసుందరరావుగారు

టౌనుప్లానింగ్ డిప్యూటీ డైరెక్టరు, హైదరాబాదు. రు. 25



# జగచ్ఛిల్పము

## ప్రణవ ధ్యానము

శ్రీ మహాప్రపంచ సృష్టిమూలకి పర
బ్రహ్మ చెంగట గుణ వర్ణ భూత
త్రివిధ త్రికము సంగూడఁ నవసంఖ్య ప్రగతిచే
ప్రణవమయ్యెఁ దానిఁ బ్రస్తుతింతు. ౧

## గాయత్రీ ధ్యానము

విశ్వజననియగుచు విశ్వసామ్రాజ్యాస
పట్టమహిషియగుచుఁ బ్రజల నెల్లఁ
గరుణఁ బ్రోచునట్టి గాయత్రిమాతకు
వందనము లొనర్తు డెందమలర. ౨

## మాతాపితృ ధ్యానము

నా నివాసమగుచు నే నొనర్చుచునున్న
నిఖిలకర్మములకు నిలయమైన
తనువుఁ గన్నయట్టి తల్లిదండ్రుల దివ్య
పాదపద్మములకుఁ బ్రణతులిడుదుఁ. 3

## సకలదంపతీ ధ్యానము

విశ్వసృష్టిలోని వివిధ స్వరూపాల
సకలజీవరూప జంగమముల
తనువులను సృజించి దయతోడఁ బోషించు
సకల మిథునములను సన్నుతింతు.

## ఆదిమదంపతీ ధ్యానము

ఆదివిశ్వసృష్టి కాధారులగువారు
ఆదివిశ్వ తల్లులైనవారు
ఆదివిశ్వకర్తృ [illegible]దించువారును
ఆదిదంపతులను దాత్మఁ జేతు..

## గురు ధ్యానము

జన్మసఫలమొందు సాధనంబునొసంగి
తత్త్వబోధసుధలఁ దన్పినెలయు
కమలమడుపు సుబ్బయాచార్యసద్గురు
చరణ సరసిజముల సంస్మరింతు.

# జగచ్ఛిల్పము

## సృష్టితత్త్వము

ఆదివిశ్వసృష్టి యయ్యె నెట్టులు ? మూల
మెవరు ? దాని నెందు కేర్పరించె ?
దీనిమర్మ మేమొ తెలియంగ లేమైనఁ
గాలి యు నెంతు మిట్టులఁ దెలియువరకు. ౧

సృష్టిసేంచ విపుల చిత్రనాటకమును
సృష్టిసేంచనాది శిల్పవాను
సృష్టిసేంచ సత్యశీలనాటకమును
సృష్టితత్త్వమెంచి చెప్పఁదరమొ ? ౨

అఖిలసృష్టితత్త్వమానందముగఁదోఁచుఁ
దెలిసికొనియుండుఁ దెలియకుండుఁ
దెలిసి తెలియనట్టిస్థితి జగచ్ఛిల్పంబు
తెలియునగునె దాని సులభముగను. 3

విశ్వసృష్టిఁగూర్చి వేద్యోపకీర్తులఁ
బండితాళి తెలియఁబలికినారు
ఏకమార్గమునకు నెందుఁ గోరారు
అందియుంకనట్టిదగుట సేమొ. ౪

అందియుం గాక సృష్టి యాసృష్టిమూలము
స్వప్రకాశమండ్రు సాక్షియండ్రు
అప్రమేయమండ్రు రాద్యంతశూన్యంబు
నండ్రు రదియఖండమైనదండ్రు. ౪

ప్రకృతినుండి సృష్టి పరిణమిల్లెనటండ్రు
ప్రకృతిసృష్టి స్వస్వభావమండ్రు
ప్రకృతిపురుషు లైక్యభావమందగ సృష్టి
యయ్యెనండ్రు కొందరార్యజనులు. ౫

వ్యాదికల్పితమందు రదిమాయయనరాదు
ద్వైతమనఁగరాదు దానినెపుడు
స్పృశమనఁగరాదు కొంతింబనఁగరాదు
జడమనఁగరాదు చలముఁగాదు. ౬

ఆత్మయన్నది యనాత్మలోనుండును
అచలమన్న చలనమునందియుండు
యేకమన్నది యనేకంబునైతోఁచు
బ్రహ్మమన్ననందు వ్యాప్తియుండు. ౭

ఎట్టులెంచి నామమేర్పరించిన నద్వి
అర్థయుక్తమగుఁ బదార్థశూన్య
మైన పరముసైన యామహాతత్త్వంబు
నెంచి నామమేర్పరించుటెట్లు. ౮

అచలమైనఁగాని అఖిలమైనఁగాని అ
నాత్మదైన నాత్మదైనఁ దుదకు
ఏదిగానివందు రెదిగానిదానితో
యొప్రయత్నమూను బొప్పలగును. ౧౦

అనుపమానమైన దాద్యమందనిచంద్రు
ఎంచరానిగందు రెంచుచుంద్రు
ఎంచలేనిదాని నెంచబూనుటకన్న
నెంచఁదగినదాని నెంచరాదె. ౧౧

వాక్కుకందదంద్రు వచియింపలేమంద్రు
చెప్పరానిదంద్రు చెప్పుచుంద్రు
చెప్పలేనిదానిఁ జెప్పఁబూనుటకన్నఁ
జెప్పఁదగినదానిఁ జెప్పరాదె. ౧౨

చెప్పఁదగినదానిఁ జెప్పఁబూనుటయన్నఁ
జెప్పఁదగిన స్థూలసృష్టి విధము
వరుసతప్పకుండ వర్ణించి శోధించి
చెప్పరాదె సూక్ష్మ సృష్టి దెలియ. ౧౩

స్థూలసృష్టి జగము శోధించితరచంగ
నందుసూక్ష్మతత్వ మందనగును
స్థూలదారువులను శోధించితరచంగ
నందునగ్ని తేజమందునట్లు. ౧౪

చెప్పఁదగినదానిఁ జెప్పినయట్టులఁ
జేయ నేర్పెరింగి చేయుచున్న
స్వానుభవమునదియె సాక్షాత్కరించును
గాన దానిఁజెప్పఁబూనుటేల ?|| ౧౫

చెప్ప నేర్చినంత చేయ నేర్వఁగ లేదు
చేయ నేర్చినంత చెప్ప లేదు
చెప్ప నేర్చుటేమొ చేయ నేర్చుటదేమొ
తెలిసి తెలియనట్టు తెలుపరాదె. ౧౬

చెప్పఁగలుగు తెలివి చెప్పుటయుగనుండ
చెప్పఁగలిగినంత చేయలేదు
చేయఁగలుగు తెలివి చేయుటయుండుంత
చేయఁగలిగినంత చెప్పలేదు. ౧౭

చేయఁగలుగు తెలివి చెప్పఁగలుగు తెల్వి
రెండు రెండువిధములుండునవ్వి
తల్లిపరముగాఁగ నిల్లాలిపరముగాఁ
బరమునిహాయనీతిఁబరగుచుండు. ౧౮

పారమార్థికముఁగబడయఁగల్గిన తెల్వి
యైహికమునఁ దానినందఁజేయు
నైహికసుఖములను ననుభవించెడు తెల్వి
పారమార్థికముగఁబలుకుచుండు. ౧౯

ఎద్దియైనఁగాని యేమైననుంగానిఁ
జెప్పఁదగినదానిఁ జెప్పఁబూని
మనకు మనమె సాక్షియనుకొని మనజన్మ
మూలమెంచెదము విశాలదృష్టి ౨౦

జగము పుట్టుచుంట జగము పెరుగుచుంట
జగము చచ్చుచుంట జగములోని
అఖిల జీవరాసులందు మానవునకు
జ్ఞానబలము దివ్యమైనయంత్రము. ౨౧

జగము తెలియుతే జగము లేదందురు
అజ్ఞులకును దెలియదండ్రు గాని
సాధ్యమైనయంత సత్యంబు శోధించి
తరచిచూచెదము సదానసృష్టి. ౨౨

ఏకమునను సృష్టిగాకయుండుటఁజేసి
ద్వంద్వమునను సృష్టి దనరెనేమొ
ద్వంద్వమన్న నాది సంపతితో వాం
ఛాది సృష్టికర్తలైరా యేమొ. ౨౩

ఆదివిశ్వసృష్టి కాదిపంచతత్త్వమైరి
భూతపంచకమునఁ బోడమెజగము
ప్లస్సేత తెల్ల నుల్లాసమునఁగాంచఁ
చిత్రముగను సృష్టి సేసిరేమొ ౨౪

ఆదిదంపతులకు నానందమదియే మొ
పిల్లలంగనంగఁ బ్రేమమే మొ
అల్లరెపుడు సేయు పిల్లలంజూచు వి
నోదమే మొనిత్యమోదమే మొ. ౨౫

అట్లుగాకయున్న యల్లకల్లోలాన
కల్లరీంద్రునగుచుఁ బిల్లలెల్లఁ
గారణంబు లేని కలహంబులొందంగఁ
దల్లిదండ్రులిట్టు లొల్లఁగలరె. ౨౬

అసలు తల్లిదండ్రి యానందమది యేడ
పిల్లలొందు దుఃఖభీతియేడ
సత్యరూపమైన సందీప్తి యదియేడ
అనృతరూపమైన యంధమేడ. ౨౭

తల్లిదండ్రిజాతి పిల్లలకున్ బాహ
పిల్లలందుజాతి భిన్నములగు
విత్తనంబొకండు వృక్షంబు కోటయౌను
సృష్టిశిల్పకర్త చిత్రమేమొ. ౨౮

జగముఁ జేయనెంచు సంకల్పము నసంగ
వివిధభిన్నజాతి విత్తనములు
ముందె సిద్ధయించి యుంచుకేమొదాన
నఖిలభిన్నవిశ్వ మయ్యెనేమొ. ౨౯

సృష్టిగాంచనూత్నసృష్టిచిత్రితమౌను
యొపటికపుడు తనువు నెంచనందు
నొక్కముఖము మాదిరొకముఖంబుండదు
నూటికైనగాని కోటికైన. ౩౦

ఒకపెయూ శిరమ్మునొకపెయూనంపుండు
నింద్రియంబులైదు నెల్లెడలను
అట్టిముఖమునున్న యైదింద్రియములలో
నిన్నిక్రొత్తమార్పులెట్టులగునో. ౩౧

సంతకమ్ములందు స్వాభావికములందు
వర్తనమ్ములందు వాక్కులందు
సకలవిధుల నొక్కటొకటికి మార్పులు
సుంతయైన లేకఁ జూడలేము. ౩౨

మరణమొందినట్టి మనుజరూపము నైన
బోలుమనుజుఁడొకఁడుఁ బుట్టబోడు
నిజముగా నెయిట్లు నిర్మించిరా ? లేక
మాయసృష్టిశిల్ప మర్మమగునో. ౩౩

బాల్యయౌవ్వనములవార్ధక్య కౌమార
ములముఖాలమార్పుగలుగువాని
నెట్లు తెలిసికొందు రెంచంగ నేత్రాల
కళల నెంచి తెలియగలరొ యేమొ. ౩౪

సృష్టిశిల్పమొన్న స్పష్టమౌనదిగాదె
సృష్టిశిల్పులసలె స్పష్టపడరు
ఎన్నొవిధులసృష్టియొప్పుటికప్పుడు
నూతనమ్మెయగును ప్రాతదైన ౩౫

పతితనమ్మునందు పాపమై తనుధర్మ
మూకలైన నేర్తు వంతెగాని
ఆననమునసున్న జ్ఞానేంద్రియంబులఁ
జేరి వానిపనులఁ జేయలేవు ॥ ౩౬

బాల్యతనువు బలము బడయఁగల్గు కొలంది
నీకుఁగూడ బలము సోకుచుండి
అనుట వినుట కనుట తినుట గ్రహించుట
ఆటపాట నడక లమరియుండు ॥ ౩౭

బాల్యతనువునందు బాలుండ వగుదువు
యౌవనమ్మునందు యౌవ్వనుడగు
వృద్ధిపొందఁ దనువు వృద్ధుడ వౌదట్టి
దేహమందునుండి దేహివగుదు॥ ౩౮

జాగరమున నీకు స్వాతంత్ర్య మున్నట్టి
గడిపి గతఫలమ్ముఁ గట్టికుడువు
నస్వతంత్రుఁజేసి యాల స్వప్నసుప్తులన్
నడుపు దేహవాసనా బలమ్ము ॥ ౩౯

నీస్వదేశమందు నీస్వగృహంబందు
నీయధీనమైన నెలవుఁదప్పి
అన్యదేశమందు నన్యగృహంబున
నస్వతంత్రుఁడవగు దన్నివిధుల॥ ౪౦

నీపుజన్మభూమి నిఖిలార్థదంబగు
లోకమన్న సత్యలోకమగును
స్థానమష్టభూతదళపద్మమైన న
విద్యఁగూడ నవ్వివీడనయ్యె॥ ౪౧

పుట్టుభూమియైన తపోభూమి యయ్యెను
నీకు జనసమాఖ్య లోకమయ్యె
ద్విదళపద్మమందు విహరింప నయ్యె నీ
కఠిన విధులు మూడుఁ గలుగనయ్యె॥ ౪౨

తల్లిదండ్రి వీడి యిల్లాలినింగూడి
ఇల్లువదలి అద్దెయిల్లుఁజేరి
కల్లరిండ్రమైత్రి నుల్లాసముగఁజేసి
తల్లిదండ్రులన్నఁ దలపఁబోవు॥ ౪౩

అనుభవింపఁ దగిన ఆరబ్ధమనియెడు
భార్యయందు నాత్మ భావమూని
శాశ్వతాను రాగ జన్మ పరంపర
లంతులేని సంతు గాంతువోయి ॥ ౪౪

నిఖిల దేహములును నీదు దేహంబును
పుట్టుచుంట పెరిగి గిట్టుచుంట
అవనిఁ దిరుగుచుంట అన్నియు సమముగాఁ
గాంచుదువు నిజమ్ముఁ గాంచఁ బోవు ॥ ౪౫

ప్రాత దేహమందు ప్రాత సేతల నెన్నొ
ఆచరించి ఫలము ననుభవింపఁ
గ్రొత్త తనువుఁ దాల్చి క్రొత్తసేతలు చేతు
విట్టులంతు లేని పుట్టుకలను ॥ ౪౬

ప్రాతవాఁడ వీవు నూతనుఁ డగుదువు
నూతనుడవు మరల ప్రాతవాడ
వగుదు క్రొత్తప్రాత లననేమొ గుర్తించు
తెలివి లేక యేమొ పలుకుచుందు ॥ ౪౭

తెలివిగలదటంచు తెలిసికోఁగలనంచు
తెలియఁబడెనటంచుఁ దెలుపు నీవు
తెలియఁబడిన దాని తెలిసికొన్నట్టుల
తెలియఁబడు విధాన దెలుపఁగలవె ॥ ౪౮

నా శరీర మంచు నాయింద్రియములంచు
నానిలయము దేహమానటంచు
భావగర్భితముగ భాషింపనేర్తువు
ఏదృఘాత్మ బుద్ధి నెంచియేమొ ॥ ౪౯

దేహమందు వెల్గు తెలివియే నేనంచు
తెలివి పెంపుఁ జేసి దెలుపుదుగద
దేహబాధలన్న దేహానికేగాని
దేహికంటదంచుఁ దెలుపుదుగద॥ ౫౦

దేహబాధలెల్ల దేహానికా? నీక?
తెలుపుమయ్య మరల తెలివి గలిగి
దేహమునకెయన్న దేహంబుతో పాటు
బాపురుందెదేల నీవుఁగూడ॥ ౫౧

అనుటయందు పలుకు వినుటందు కనుటందు
తెలియజేయుటందు తెలివిచూలి
దేహబాధలన్న దేహంబుతోఁ గూడి
బాపురొందవలసె నీవుఁగూడ॥ ౫౨

నీదు దేహమందు నిర్మితంబులునైన
అవయవముల కెదియొ తెవులుగల్గ
దేహబాధలనుచు దెలిపెద వీవెగా
దేహమది జడంబు దెలుపఁగలదె॥ ౫౩

పలుకులుడిగి మోము వెలవెల బారంగ
కనులుమూయ మనసు కలతఁజెంద
అబ్బయమ్మ యనుచు తబ్బిబ్బులొందుట
దేహివైన నీవ? దేహమావ?॥ ౫౪

బాల్య యౌవ్వనాద్యవస్థలు గన్పట్టు
దేహమందు నీవు తిరుగువరకు
దేహమందు నీవు తిరుగకుండిన దేహ
మేయవస్థలన్ వహింపఁగలదు॥ ౫౫

నీవు తనువు కొరకు నిర్మింప బడితివా!
నీకుఁగాను తనువు నిర్మితంబ?
ఎవరికేది కూర్చి ఏర్పడెనో దాని
గుట్టు దెలుపఁగలవె రట్టులేక। ౫౬

బ్రహ్మమౌదు నీవు మాయయౌ కాయమ్ము
తెలివినీవు జడము దేహమౌను
ఇట్టివికట మైత్రి యెట్టులయ్యెనో దాని
గుట్టు తెలియరాదె రట్టులేక॥ ౫౭

ఒకటినిత్యమౌ మరొకటి యనిత్యమౌ
ఒకటి తేజమౌ మరొకటి తమము
వీనిరెంటి మైత్రి విపరీతమౌ దీని
గుట్టు తెలియరాదె రట్టు లేక ౫౮

పుట్టకుండనొకటి పుట్టినట్టుండును
పుట్టి పెరిగి యొకటి గిట్టుచుండు
పుట్టి గిట్టునట్టి పోడిమదేమొ యౌ
గుట్టు దెలియరాదె. రట్టులేక ౫౯

దేహిగల్గకున్న దేహంబు రాబోదు
దేహమలరకున్న దేహిరాదు
విత్తొముందొ లేక వృక్షంబొ యనునట్టి
చందమయ్యె నిట్టెఁ జూడఁ జూడ ౬౦

ఏదిముందొ మూలమెంచి శోధింపంగ
దేహికారణమ్ము దేహియగుట
దేహితలచుకొన్న దేహార్థకర్మముల్
కట్టికుడుప తనువు పుట్టునేమొ॥ ౬౧

మాతృగర్భమందు మాయపిండాండంబు
ఏరసాయనమున నేర్పడియెనొ॥
అట్టులైన పిండమందున నీవెట్లు
జేరునదియు నైనఁ జెప్పఁ గలవె॥ ౬౨

స్వప్నతుల్యమైన జగము సర్వమిథ్య
బ్రహ్మసత్యమనుచుఁ బలుకుదింక
నఖిలమున కతీతమౌ "అహంబ్రహ్మాస్మి"
అనుటనీవుబ్రహ్మమైతివిగద। ౬౩

రక్తనాళములును రక్తంబు చర్మంబు
పలలమస్థిమజ్జ పరికరములు
ఏరసాయనమున నేర్పరించెనొ బ్రహ్మ
బ్రహ్మమైననీవుఁ బలుకఁ వేల॥ ౬౪

దేహమందు నీవు దేహివై వెల్గొంది
దేహజనన మేమొ తెలియకున్న
తనువుసృష్టిఁజేయు తల్లిదండ్రులఁ గూర్చి
యేదృఢాత్మ బుద్ధి నెంతువయ్య॥ ౬౫

నిన్నుగన్నయట్టి నీతల్లిదండ్రులఁ
దెలుపకుండ నీవు తెలియ లేవు
అదియ స్థూలరూప మంశమాత్రమెగాని
దంపతీత్వమేమొ దలప లేవు॥ ౬౬

ఏకదంపతీత్వ మెంచ లేనప్పుడ
నేకదంపతీత్వ మెంచఁగలవె
ఆది దంపతీత్వ మసలే తెలియువింక
నేక మాదితత్వమెంచుటెట్లు॥ ౬౭

ఆది దంపతులకు నర్థంబదేమన్న
భూతజాలమూల జాతమన్న
నేకమేమొదాని నెంచంగ రాదయా
స్వానుభూతి సుప్రసన్నమగుట॥ ౬౮

ఎందరెన్ని విధుల నెంత నేర్పున నైనఁ
జెప్పలేనిదాని జెప్పుచుండ
నేకమన్నదాని నేమాత్రమెంచకు
మెంచఁదగిన దాని నెంచుమయ్య॥ ౬౯

ఏమిగానిదాని నేమేమో తలపోసి
కాన రానిదానిఁ గానఁబూని
అచల మచల మంచి నాత్మ యనాత్మ యటంచు
నేక మేక మంచు నెంచు టేల॥ ౨౦

భావశోధనమున భాసింపఁగారాఁడు
పూనిపల్కనంద రానివాఁడు
వర్ణనంబు సేయఁ బ్రత్యక్షమున్ గాడు
వానిఁగూర్చి పల్కఁబూను టేల?॥ ౨౧

వానితో సమానుఁడైన తేజోమూర్తి
వానిసాటియైన జ్ఞానమూర్తి
వానితోడ సరిసమానుఁడై యుండు వి
లక్షణముగ లోకచక్షువలరి॥ ౨౨

అచలుఁ డప్రమేయుఁ డాద్యంత శూన్యుండు
కర్మసాక్షి విశ్వకర్మ సముడు
భాస మానుఁడతఁడు ప్రత్యక్ష దైవంబు
భానుమూర్తిఁగూర్చి పల్కరాదె॥ ౨౩

నిత్యమేకమనుచు ప్రత్యక్ష రహిత శూ
న్యమునుగూర్చి ప్రాకులాడు టేల?
ప్రాకులాడ రాదె ప్రత్యక్షమున నున్న
భానుబింబమరసి ప్రజ్ఞ గలిగి॥ ౨౪

శబ్దరహితపరుని శబ్దయుక్తంబైన
వాక్కుచేత బలుక వలను పడునె
రూపరహిత పరుని రూపయుక్తంబైన
కనులచేత జూడ గలుగనేనె॥ ౨౫

## —: ఆదిమ దంపతులు :—

మనలఁగన్నవారు మన తల్లిదండ్రులు
తల్లిదండ్రిఁగన్న తాతలెవరు
వారివారిఁగన్న వారిమూలంబెన్న
నాది దంపతులు మోదముగద॥ ౨౬

మనము వచ్చినట్టి మార్గంబునకు మూల
కారకులయియున్న కారణమున
అసలు దల్లిదండ్రులై రింక నెందునన్
వారికన్న దిక్కువేరెగలరె॥ ౨౭

తెలిసి తెలియకున్న తెలియకున్నను గాని
తెలిసికొనుటకైన తెలివినొసగి
తెలియఁజేయువారు తల్లిదండ్రులెకదా
తల్లిదండ్రులమదిఁ దలచఁరాదె॥ ౨౮

ప్రస్తుతమున భూతపంచకంబుఁదలంచి
పాంచభౌతిక ప్రపంచమెంచి
తనువునెంచి కన్నతల్లిదండ్రుల నెంచి
అఖిల దంపతులను నరయుమవల॥ ౨౯

పంచభూతములును పంచీకరణ మొంది
యిరువదైదునయ్యె నింద్రియమ్ము
లవి ప్రపంచమంత దఖిలాండ పిండాండ
తనువులందు నిండి తాండవించు॥ ౮౦

ఇంద్రియముల కెపుడు నింద్రియాధిపు లిచ్చు
సకల కర్మచయము సాంఖ్యమండ్రు
సాంఖ్యసూత్రమాను జగముగుణింపంగ
నెక్కముల విధంబు లెక్కఁకును॥ ౮౧

తనువురూప మొంది తాండవం బొనరించు
నట్టియింద్రియముల కధిపు లెవరు
తనువుఁగన్న యట్టి తలిదండ్రి సములె సూ
తల్లిదండ్రు లఖిల దంపతులును॥ ౮౨

తాననంగ నేమొ తన దేహమున నేమొ
తనువు నిలయమైన తత్త్వమేమొ
తనకు దేహమునకు తగులాట మదియేమొ
తరచిచూడవలె నిదానదృష్టి॥ ౮౩

తల్లియంశచేత తనదు దేహముంగల్గె
తండ్రియంశచేత తాను గల్గె
తల్లిదండ్రికన్న తత్త్వంబు శోధింప
తనువు నిలయమాట తథ్యమేమొ॥ ౮౪

ద్వైత భావమొంది తను తేజముల చేత
జగమెయైన సృష్టిజాలమందు
నొకరు గానుపించి యొకరు గానఁబడకుండ
దల్లిదండ్రులిట్లు దనరిరేమొ॥ ౮౫

తనువు తల్లియౌను తండ్రి తేజంబౌను
దేహమధ్యమునను తేజముండు
తనువు తేజములును ద్వైతంబనగనొప్పు
ద్వైతమన్న తల్లి తండ్రులు సుమ॥ ౮౬

తల్లి రక్తమౌను తనుచర్మ మాంసంబు
నయ్యె తండ్రివీర్య మస్థి మజ్జ
తల్లిదండ్రి రూప తనువు ద్వంద్వంబ య్యె
నట్టితనువు నిలయమయ్యె నీకు॥ ౮౭

ధర్మసాధనమున తనువు ముఖ్యంబౌను
తనువనంగ తల్లి దండ్రులౌను
తల్లి దండ్రిరూప తనువును నీవెట్లు
గాంచుచున్న విధిద లంచవేమొ॥ ౮౮

తనకు నిలయమైన తనుమధ్యమున వెల్గు
వీర్యవ త్తరమ్ము వీడకున్న
తల్లియందు వెల్గు తండ్రిస్వరూపాత్మ
తత్త్వమెరుగ బుద్ధి తత్త్వమండు॥ ౮౯

తనువు పోషణమునఁ దగనూర్ధ్వరేతస్సు
గలిగి దివ్యదేహ కాంతిగలుగు
తల్లి సేవవలనఁ దనువుఁ దల్లిగఁజూడఁ
గలిగి తంద్రిఁగాంచు కాంతిగలుగు॥ ౯౦

ధర్మ సాధనమునఁ దనువు నారోగ్యంబుఁ
జెందికాయసిద్ధి నొందుటకును
అర్ఘ్యవందనంబు లాభానునకునిత్తు
రరుణ కిరణకాంతు లలరువేళ॥ ౯౧

# తనువులు - అవస్థలు

తనువనంగనొక్క తనువే మొగాదింక
తనువునందునారు తనువులుండు
జాగరమునకూర్ధ్వ భాగానమూడును
దిగువయందుమూఁడు దీరియుండు॥ ౯౨

ఊర్ధ్వతనువులందు నూర్ధ్వదృక్పథ యోగి
వరుల కౌనుదిరుగ దిరుగవీవు
తిరుగఁగల్గినట్టి దిగువశరీరాల
దిగుచుండి వానిఁదెలియఁ బోవు॥ ౯౩

స్థూల తనువువీడి సూక్ష్మంబుఁగనియట
స్వప్నమందుఁగన్న చరితనెల్ల
సత్యమని తలంచి జాగ్రచ్చరితనెల్ల
మరచిపోవునట్టి దరయఁగలవె॥ ౯౪

స్వప్నమందుఁ జేరి జాగ్రచ్చరిత నెల్ల
మఱచిపోవునట్టి మర్మమేమొ
స్వప్నమందుఁ బొందు క్షణిక చరిత సత్య
మని దలంచు చిత్ర మౌనదేమొ॥ ౯౫

జాగరమున నీవు స్వాతంత్ర్యముం బూని
అహముతోడఁ గర్మ లాచరించి
పైశరీరములను బరికించవనినిట్లు
కన్నతల్లి చేయుచున్న దేమొ॥ ౯౬

నీదు క్షేమమరసి నిన్ బరీక్షింపంగ
దినదినమిటుఁ బుద్ధిఁ దెలుపుచుందు
జననిభావమేమొ కనలేక కడుమంచి
కలను గంటినంచు కులికెదీవు ౯౭

స్థూలమందు గూడఁ జూడలేనట్టివి
పెక్కులున్నవందు నొక్కటిగను
స్థూలమైన జగముఁ జూడగల్గిన కన్ను
స్థూలమైన ముఖముఁ జూడదేమొ॥ ౯౮

పైశరీరములను బ్రాకనేర్చిన యోగి
దిగువతనువులెంచి తిరిగిరాఁడు
దిగువతనువులందు దిరుగనేర్చిన భోగి
పైశరీరములకుఁ బ్రాకఁబోఁడు! ౯౯

యోగశక్తుఁ డూర్ధ్వ భాగంబునందుండి
నిర్మల పరయోగ నిద్రనుండు
భోగరతుఁడు దిగువ భాగంబునందుండి
మాయకలల నిద్ర మరిగి యుండు ॥ ౧౦౦

స్థూలమునకుఁ బైన సూక్ష్మంబనఁగ నింకఁ
గారణంబనఁగఁ గ్రాలుచుండు
కారణముల కెల్లఁ గారణంబగు మహా
కారణాంగమనఁగఁ గ్రాలుచుండు॥ ౧౦౧

స్థూలమైన తనువుఁ జూడగల్గినయట్లు
సూక్ష్మమైన తనువుఁ జూడలేవు
కారణాంగమేమొ కాంచలేవిక మహా
కారణాంగమెట్లు కాంచఁగలవు॥ ౧౦౨

స్థూల కారణంబు సూక్ష్మదేహంబౌను
స్థూలదేహమందె సూక్ష్మముండు
సూక్ష్మమును గ్రహింప స్థూలకారణమౌను
తనువు లిట్టులుండు ద్వంద్వగతులఁ॥ ౧౦౩

స్థూల దృష్టినిలిపి సూక్ష్మంబుఁగన వచ్చు
సూక్ష్మమందు నిలిపి జూడనగును
కారణంబు నల్లె కారణంబున మహా
కారణమను తనువుఁ గాంచనగును ౧౦౪

సాధనమునఁ బసులు జక్కఁబడును గాన
సాధనములు నాల్గుఁ జక్కఁబరచి
సాధనములు నాల్గు స్వాధీన మందుంచ
సమతతనువులవియె సాధ్యమగును॥ ౧౦౫

## కర్తవ్యము

తాను వచ్చినట్టి దారిఁగన్గొని పూనిక
దారిత్రప్పనట్టి దారినడువ
దారి కడ్డములగు తనవులలోనుండి
ఆదిపితృప్రదేశ మరుగఁగలవు॥ ౧౦౬

ద్వైతదేహజగతి తల్లి మార్గంబులోఁ
దనువులనేడు నదుల దాటిపోవ
సంత్యమందు మోద మగు హిరణ్మయి ప్రత్య
గాత్మ పితరులఁగన నర్హుఁడౌదు॥ ౧౦౭

ఆదిదంపతులస మారాధనము సేయ
బిడ్డలందుమంచి ప్రేమజూపి
మనమువారిఁగాంచ మార్గసౌకర్యాలఁ
గలుగజేసిసృష్టిఁ దెలియఁజేయుఁ॥ ౧౦౮

సృష్టియొకటైనఁ జేయుదురిరువురు
దల్లిదండ్రులనగ నెల్లపుడును
వక్త్రియొకటియైన వాక్కుజిహ్వయునందు
రెండుపనులఁ జేయు చుండునట్లు॥ ౧౦౯

బ్రహ్మపనికిసాయ పడువృద్ధిగనిమాయ
సాయపడకుబ్రహ్మ మాయకెపుడు
వాక్కుపనికిసాయ పడుజిహ్వగని సాయ
పడదువాక్కుజిహ్వ పనికినెపుడు॥ ౧౧౦

జననికనుటఁబెంప పనులరెంటినొనర్చు
నొక్కపనియుబీజ మొసగుఁదండ్రి
యనుటతినుటరెండు పనులొనర్చునుజిహ్వ
వాక్కువచనమొక్క పనియొనర్చు॥ ౧౧౧

సత్యలోకమందు సాక్షియైన యనాది
బ్రహ్మమనగఁదండ్రి వరలుచుండు
బ్రహ్మదేహమై హిరణ్మయకోశగా
యత్రియనఁగఁదల్లి యలరుచుండు॥ ౧౧౨

జనకుఁడైనబ్రహ్మ సత్యరూపుండౌట
సత్యవాక్కుతోడ నిత్యమున్న
ననృతదోషమన్న నాసింపదందుచే
జనకు నిత్యపూజ సలిపినట్లు॥ ౧౧౩

అంగసౌష్టవంబు నలరనాధ్యాత్మిక
జ్ఞానమలరజిహ్వ చపలముడుగ
పథ్యమునువహించి పరమాన్నముఁభుజింపఁ
దల్లిపూజజేసి దనరినట్లు॥ ౧౧౪

చెప్పతరముగాని సృష్టిశిల్పజగంబు
ద్వంద్వరూపమొంది తనరియుండు
అందుఁబిల్లలెప్డు దర్శింపఁగా రాదె
ఆదిశిల్పవిభుల నాత్మఁదలచి॥ ౧౧౫

ఖండదేహములన ఖండరూపమొనర్చి
తనువృతల్లిగాను దలచికొలిచి
తల్లిజగమునందుఁ దండ్రిజాడ నెరింగి
ఆదిదంపతులను నరయఁగలవు॥ ౧౧౬

మాతృతత్వమరసి మదిఁగొల్వనేర్చిన
జననిరూపమాను జగమదెల్ల
జననిరూపజగము వినుతింపనేర్చిన
ఆదిదంపతీత్వ మరయఁగలవు॥ ౧౧౭

## సకలదంపతులు

అర్కబింబమొక్క టైననందు ననేక
కిరణములుజనించి పరగునట్లు
ఒక్క తల్లి దండ్రు లొప్పిరెప్పుడు పెక్కు
తల్లిదండ్రులాట తథ్యమేమొ॥ ౧౧౮

మనుజజాతికాది జననీ జనకులట్లు
అఖిలజీవజాతి కంతటికిని
ఓర్మిఫేర్మిగలుగు నొక్కొక్క తలిదండ్రు
లుండిర న్నసత్య మున్నదేమొ॥ ౧౧౯

సకలజీవజాతి సంఖ్యయెన్నబది నాల్గు
లక్షలనిరి బుధులు లక్షణమున
అట్టిజీవజాతి కన్నింటికందరు
తల్లిదండ్రులాది దనరిరేమొ॥ ౧౨౦

అఖిలజీవజాతి కన్నింటి కందరు
తల్లిదండ్రులుంట తథ్యమగుట
అట్టితల్లిదండ్రు లాకారభేదాలు
గలిగి యొకరినొకరు గలియఁబోరు॥ ౧౨౧

## సాకారవిధానము

బహుళసంఖ్యగలుగు బహుళ స్వరూపాలఁ
గలుగు. దంపతులను గన్న యట్టి
ఒక్క తల్లిదండ్రి ఒక్కరూపముగాక
బహుళరూపులనుట భావ్యమగునె॥ ౧౨౨

ఏకరూపులయియు నేక రూపములైన
జీవకోటిఁ గనెడు చిత్రమేమొ ?
భిన్నరూపములగు బిడ్డలఁ గన్నట్టి
వార లెట్టిరూప వంతులొగద॥ ౧౨౩

వివిధరూపములను విశ్వమందు వెలింగి
విశ్వజీవులకును శాశ్వతముగ
విశ్వకర్మలందుఁ బ్రేరేపణముఁజేయు
వారు విశ్వరూపు లెరొయేమొ॥ ౧౨౪

అఖిలజీవజాతి కగ్రజుండైనట్టి
జ్ఞానవంతుడైన మానవుండు
మాతర పితరులకు మానవాకారంబు
సల్పనెంచి యిటుల నిల్పెనేమొ॥ ౧౨౫

ఆది పితరులకు నరాకారమొనరించి
ప్రార్థనంబుసేయ రాదనేమొ
మానవాతిరేక మాన్యదైవత రూప
మేర్పరించు మార్పు నెంచిరేమొ॥ ౧౨౬

అవయవంబులందు నన్నిసమానమై
ముఖము లెప్డు నూత్న ముఖములౌట
వదనములను బ్రహ్మ వర్చస్సు వెలిగొంద
వదనములకు మార్పు వలచిరేమొ ౧౨౭

అఖిలభిన్నరూప మైన ప్రపంచంబు
పంచభూతములను బరగ నా ప్ర
పంచ రూపధరులఁ పంచభూతచ్ఛాయ
లనగఁ బంచ శిరము లయ్యె ననిరి॥ ౧౨౮

## మహాత్మ్యపూజ

అట్టి పంచశీర్షు లాకారమొకటిగ
నాది దంపతులుగ నైరివారు
అట్టి తల్లిదండ్రు లందు తల్లిని ముందు
అర్చనంబుసేయు టర్థమాను॥ ౧౨౯

♦ తల్లిఁ గొల్వనేర్వ నెల్ల భూతగణాలఁ
గన్నతల్లు లెల్లఁ గనబడుదురు
అట్టితల్లిగణము నర్చింపఁ నాది దం
పతులఁ జూపి కానఁ బడరు వారు ౧౩౦

---

## సాకారము. ఆదిమదంపతీత్వము.

♦ శిల్ప ప్రధానమగు సామ్రాజ్యము నేలిన పంచర్షి మండలమువారి కాలమున పంచశీర్ష సాకార విధానమున నాదిమదంపతీపూజలు మున్నగునవి ప్రజలయందాచరణలో నుండెడివి.

పిమ్మట సారస్వత ప్రధానమగు సామ్రాజ్యము నేలిన సప్తర్షి మండలమువారి కాలమున వైదిక ధాన్యములన్నియు సన్నగిలుటయే కాక జనకునిపట్ల పంచముఖములకు చతుర్ముఖములనియు, బ్రహ్మదు లైదుగురకు ముగ్గురనియు, మొదలగు మార్పులెన్నియో కాగల్గినవి.

బ్రహ్మదులైదుగురని యోగతత్త్వోపనిషత్తును, నింకనితర గ్రంథములును నుడువుచున్నవి.

పంచభూతములకు పంచపాలకులుండుట సహజమే గదా?

పూర్వవాసనాఫలవిశేషమున నేమొ కాళిదాసమహాకవి తన కావ్యారంభమున "జగతః పితరౌ వందే" యని ప్రార్థించినాడు.

## పంచర్షి మండలము

♦ శ్రుతి: "ప్రాచీదిశాం..................సాగరు ష్షిః" యజుః కాండ ౪. ౩. ౫.

ఇట్లై పంచఋషులకు పంచమంత్రాలున్నవి. తూర్పు మొదలుకొని యూర్ధ్వము వరకు పంచదిక్పతులుగా యజ్ఞారంభమున యీ పంచమంత్రములచే పంచఋషులు ప్రార్థింపబడుదురు. వీరసాంప్రదాయులగు నాభానేదిష్టాది ఋషులు యజ్ఞసదస్యులుగను, శిల్ప కల్పకులుగను, యజ్ఞకల్పమున వర్ణింపబడిరి.

భూమి మాతగొల్వ భూజంబుల నొసంగు
భూజమాతఁ గొల్వఁ బుష్పమొసఁగు
పుష్పమాతఁ గొల్వ పుష్ప మధ్య ఫలంబుఁ
గృప నొసంగ తా నదృశ్య మగును॥ ౧౩౧

నామరూప మొందు ప్రేమ జగన్మాత
కాంచి పెంచినట్టి కారణమున
తండ్రికన్న మున్నె తల్లి ప్రత్యక్షమౌ
స్థూల జగ మనంగ సులభముగను॥ ౧౩౨

జనని తను జగంబు సద్భక్తిఁ బూజింప
జగమునందు వెలుగు జనకుఁ జూచు
దేహమందు వెలుగు తేజంబునుం జూచు
దాన దేహ మమత బూనిరాదు॥ ౧౩౩

తల్లితత్త్వమరసి ధ్యానింప నేర్చినఁ
దన్మయత్వమైన తత్త్వ మొసఁగి
తత్త్వమార్గమందుఁ దండ్రి తత్త్వ మొసంగి
తా నదేమొగాని కానకుండు॥ ౧౩౪

అందుచేత నేమొ యగ్రజన్ములు గాగ
హిందు సాంప్రదాయ హిత మతాన
కాలసంధి వేళ గాయత్రి మాతకే
వందనములు సల్పు చుందు రేమొ॥ ౧౩౫

## —* దంపతీ మంత్రము *—

కనగ స్త్రీ పరముగ గాయత్రి మంత్రంబు
పరగు నర్ధమగును పురుష పరము
మంత్రమయ్యెఁ దల్లి మంత్రార్థమా తండ్రి
ఆది దంపతీత్వమై వెలింగె॥ ౧౩౬

అట్టి జనక పరము నర్థమై వెలిగొందు
శబ్ద జనని మంత్ర జపమొనర్చి
తల్లియందు తండ్రి తత్వార్థమున్ గాంచ
ముందు తల్లిఁ గొల్చుచుందురేమొ॥ ౧౩౭

అయ్యగారి తేజ మాధారముగఁ గొని
అఖిల సృష్టిఁ జేయు నమ్మగారు
అఖల సృష్టియనెడు అమ్మ మార్గంబున
అయ్యగారి జేరనౌ క్రమంబు॥ ౧౩౮

కలడు సకల జనని గాయత్రి మంత్రాన
సవితృమూర్తి విశ్వ జనక సముఁడు
ప్రాణికోటిఁ బ్రోచు ప్రత్యక్ష దైవంబు
సర్వసాక్షి యతఁడు సర్వసముఁడు॥ ౧౩౯

కలిగి సవితృమూర్తి గాయత్రి మంత్రాన
నిహ పరముల రెంటి నిచ్చునవియు
అంగ సౌష్టవంబు నాధ్యాత్మి కానంద
బలము నిటుల నిత్యఫలము లనగ॥ ౧౪౦

♦ గాయకులను ప్రేమఁ గాంచి రక్షింప గా
యత్రి పేరఁ దల్లి యలరెనట్టి
విశ్వజననిఁ గూర్చి విశ్వకర్మాయని
పిలచినారు భక్తిఁ దలచి బుధులు॥ ౧౪౧

తండ్రి లక్ష్యముంచి తల్లిని ధ్యానింప
దల్లి కరుణఁ బూని తండ్రిఁ జూపు
అందుచేత శాశ్వతానంద కరమైన
పర హితార్థ జన్మ పదము గలుగు॥ ౧౪౨

తల్లి లక్ష్యముంచి తండ్రిని ధ్యానింప
తండ్రి కరుణ బూని తల్లి జూపు
అందుచేత నైహికానంద కరమైన
స్వార్థ సహిత జన్మ పదము గలుగు॥ ౧౪౩

తల్లి దండ్రులను సదాలక్ష్యమున గొల్వ
జీవకోటి సేవఁ జేయఁ జాలి
కామ్యరహితమైన కర్మ జేయంజాలి
కారణ జనియతడు కాఁగలండు॥ ౧౪౪

---

♦ "గాయంతంత్రాయతే యస్మాద్గాయత్రీ తేనకథ్యతే"
గానము చేయు బిడ్డలను రక్షించునది గావున గాయత్రి. గాయత్రీకల్పము
శ్రుతిః "దేవాసురాః సంయత్తా ... ... ... ...
విశ్వకర్మన్నితిదేవా దాధీత్యసురాః॥
యజుః కాం౨ ప్ర 3 అ 3
దేవతలు గాయత్రినిగూర్చి విశ్వకర్మాయని పిలచిరి.

## —* తల్లి దండ్రి పూజ *—

సృష్టి జగమునందు సృష్టికర్తనుగాంచ
సృష్టికర్తయందు సృష్టిగాంచ
సృష్టియన్న నేమొ సృష్టింపఁబడు టేమొ
స్పష్టమగును విశ్వసృష్టి నెల్ల॥ ౧౪౫

కర్మభావమందకర్మభావంబుఁ న
కర్మభావమందు కర్మభావ
మునను గాంచి కర్మములసేయు ప్రాజ్ఞుండు
కర్మలేనివాడె కాఁగలండు॥ ౧౪౬

తల్లియౌను కర్మ తండ్రియగు నకర్మ
తల్లి భావమందుఁ తండ్రిఁ గాంచి
తండ్రి భావమందుఁ దల్లిని గాంచుటే
తల్లి దండ్రి పూజఁ దలచినట్లు॥ ౧౪౭

ఏది చూతమన్న నెంత శోధించిన
వివిధ రూపమైన విశ్వమందు
గడ్డిపోచ మొదలు దొడ్డబ్రహ్మముదాక
దంపతీత్వమెపుడు తనరుచుండు ౧౪౮

ఆదిదంపతులసదాజ్ఞ చొప్పునఁ గాంచి
పెంచి పెద్దచేసి పెండ్లి జేసి
పిల్లవాండ్రఁగూడ తల్లిదండ్రులఁజేసి
తల్లిదండ్రులంత తరలుచుంద్రు॥ ౧౪౯

ఉదయమందుభాను డుండునుచల్లఁగ
సాయమందునుండు చల్లఁగాను
మధ్యమున జనించి మధ్యమ్ము్రనంబోవు
వేలకిరణములుగ వేడిజూపి ౧౫౦

ఆదిపితరు లిరువు రాదిజన్మమునను
నంత్యమున నిరువురు నలరియుంద్రు
మధ్యమున జనించి మధ్యమ్ము్మనంబోదు
రిట్టులధికపితరు లిహముజూపి॥ ౧౫౧

లక్ష్య మొక్కటగును లక్షణమొకటౌను
లక్ష్యలక్షణాల విలక్షణమున
లక్ష్యముంచఁ దాన లక్షణుఁడైనను
అక్షయుండునగు విలక్షణుఁడుగ॥ ౧౫౨

తండ్రి భావమందుఁ దా లీనమైయున్నఁ
తల్లి భావమెల్లఁ గల్లయగును
పుష్పమధ్యఫలము పొడమి పెంపొందంగ
పుష్పమెల్ల లయముఁ బొందినట్లు॥ ౧౫౩

స్థూలమైన జగము జూడకుండగఁ జూచి
వీనులందు దృష్టి లీనపరచి
విశ్వసృష్టి రవము విన్నంతఁ గన్నంతఁ
దలపఁవలయు సతము నిలుపవలయు॥ ౧౫౪

ఏకలక్ష్యమందు నేకీభవింపంగ
నేకమౌను సృష్టి యేకమందు
అనెడు వినెడు కనెడు పనులెవ్వి లేకయా
యేకదివ్య తేజమే వెలుంగు॥ ౧౫౫

సర్వహీనమైన సర్వసాక్షిత్వమ్ము
దరిని జేరఁగలుగు ధన్యునకును
మంత్రహీనమౌను తంత్రహీనముభక్తి
హీనమౌను కామ్య హీనమౌను॥ ౧౫౬

ఆటవెలఁదియందు మాటలాడితి నిట్లు
భావశోధనమునఁ బ్రశ్నలంది
స్థూల విశ్వసృష్టి జూచి పల్కితిగాని
అనుభవైక వేద్య మగుటఁ గాదు॥ ౧౫౭



# పిండబ్రహ్మాండములు

చంద్రభాస్కరులను జననీజనకు లట్లు
స్థూలరూపముగను జూపివారి
మూలకముగ భుక్తి ముక్తులఁ బ్రాపించు
తల్లిదండ్రిగూర్చి దలచరాదె॥ ౧

కారణంబు లేని కార్యముండ దటండ్రు
కారణంబ దేమొ కార్యమేమొ
కార్యకారణముల కలయిక నదియేమొ
గానివానిఁ దెలియగలమొ లేమొ॥ ౨

ప్రభవఖండమైన బ్రహ్మాండముదయించి
కారణంబు నగుచుఁ గాలుచుండు
ఖండరూపమైన పిండాండ ముదయించి
కార్యరూపమగుచుఁ గాలుచుండు॥ ౩

భవమునొందె పిండబ్రహ్మాండములుగాను
ఖండరూపముగ నఖండముగను
రెండురీతులుగను నుండి విశ్వంబెల్ల
కార్యకారణములఁ గాలుచుండు॥ ౪

కారణంబునగుచుఁ గాలు బ్రహ్మాండాన
నుండు కార్యరూప పిండమలరి
కారణమునఁనొప్పి కార్యముండిన యట్లె
కారణంబునుండు కార్యమందు॥ ౫

క్రాలుపిండములుగ బ్రహ్మాండమందున
గ్రహములెల్లఁ దిరుగు గగనవీధి
ఖండరూపముల నఖండరూపంబుల
సచలచలములనగ నలరియుండు॥ ౬

అచలరూపుడగుచు ఆభానుమండంగ
చలనరూపుడగుచు చంద్రుడుండు
లక్షలాదిగాఁగ నక్షత్రములు సదా
చలనరూప మొంది సంచరించు॥ ౭

లక్షలాదిగ చల నక్షత్రములలోన
అచలముగ ధ్రువుండు నలరియుండు
అచలమందు చలన మమరియుండినయట్లె
అచలముండు చలన మందుగూడ॥ ౮

గ్రహములమరియుండి బ్రహ్మాండమందున
చలనరూప మొంది సంచరించు
అచలుడగుచు నభమునందు సూర్యుండుండు
గ్రహములెల్ల నేలు ప్రభువనంగ॥ ౯

ఖండపిండములకు గ్రహములన్నిటికి న
ఖండరూప మొంది యుండుఁగాని
ఆకసమున మాత్ర మాభానుబింబంబు
ఖండరూప మొంది క్రాలుచుండు॥ ౧౦

అక్షయంబులైన నక్షత్రములు నెల్ల
గ్రహములెల్లవాని గణిత గతిని
అవ్వియొకటి కొకటి యాకర్షణీయమై
నిరతమాకసమునఁ దిరుగుచుండు॥ ౧౧

అట్లుతిరుగుటకు నిరాధారమౌదాని
హేతువేమొగాని యెంచిచూడ
విపులమైనయట్టి విద్యున్మహాశక్తి
యొక్కఁడుండవలెను నిక్కముగను॥ ౧౨

అట్టిగొప్పశక్తి కాధారులెవ రట్టి
భూరిశక్తిగల్లు వారెయగును
వారిగొప్పశక్తి పేరలకెట్లయ్యె
గొప్పయంత్ర మొకటిఁగూర్చిరేమొ॥ ౧౩

పృథులయంత్రమందు నేర్పడు విద్యుత్తు
నంతనర్కబింబ మందునిలిపి
యేరుపాటుఁజేసెఁ బారంగనందుండి
సర్వగోళకములఁ జాలునంత॥ ౧౪

ఒక్కనిముసమైన యూరకుండనియట్లు
యొక్కకాలమైన మొక్కవోని
యంత్రముల సృజించు యాజగచ్ఛిల్పుల
నాదిదంపతులన హర్షముఁగద॥ ౧౫

గ్రహములెల్ల దిరుగ ఘనమైన విద్యుత్ప్ర
భావమునికిఁ జేసె భానువిభుని
అచలరూపమైన యాభానుదీప్తిచే
చలనమొంది తిరుగు చంద్రమూర్తి॥ ౧౬

అంబరమున భాను డాజగచ్ఛిల్పుల
యాజ్ఞవడసి గణితమంతఁ దెలుప
గగనవీధిఁ దిరుగు గ్రహరాశిమొదలైన
గణములెల్ల నొక్కక్రమవిధాన॥ ౧౭

అచలభాను విద్యుదాకర్షణంబున
ధరణి భానుఁజుట్టి తిరుగుచుండు
భానుదీప్తిచేత భాసించి చంద్రుండు
ధరణి నాశ్రయించి తిరుగుచుండు॥ ౧౮

అచలమైనయట్టి యాభానుబింబంబు
విద్యుదాలయముగ వెలయుచుండ
నంతనుండి బింబమందుండి చలనమా
కిరణజాలమెపుడు ధరణిఁ బారు॥ ౧౯

గ్రహములైనగాని రాసులైననుగాని
తారలైనగాని తారతమ్య
మెంచివేనికెట్టు లేర్పరించిరో యట్టి
లెక్కమీరకొక్క ఫక్కిఁ దిరుగు॥ ౨౦

కాలచక్రమిట్లు క్షణఘటికాయామ
గతుల చేతఁ దిరుగగడగికడగి
పవలురాత్రులుకఁను బ్రతిపక్షమునకును
వివిధభిన్నసరణి వెలయుచుండు॥ ౨౧

ఒక్క పవలు గాదు యొక్క రాత్రియుఁ గాదు
ఒక్క నెలయు ఋతువు నొక్క వర్ష
మొక్క యుగముఁ గాదు పెక్కు యుగాలిట్లు
మొక్కవోక నొక్క పక్కిఁ దిరుగ॥ ౨౨

ఎట్టికట్టుదిట్ట మిట్టుల గైసేసి
అద్భుత జనకమ్మ లైన వీని
ఎవరికోస మెప్పు డేర్పరించిరో యింత
కే ప్రయోజనమ్మొ యెంచవలయు॥ ౨౩

అఖిల గ్రహము లెల్ల నాజగచ్ఛిల్పుల
కొరకు సృష్టిచేసి కొనిర? కాదు
నీనిమిత్తమేమొ నీక్షేమమున కయి
తల్లి దండ్రు లిట్లు తలచిరేమొ॥ ౨౪

పారజూడు మీవు బ్రహ్మాండ మందున
గగన వీధి జరుగు గణితమెల్ల
అఖిల జీవకోటి కాదర్శమౌ నట్టి
గణిత గతులనేర్వ గలవొ లేవొ॥ ౨౫

అట్టి గణితగతుల నాదర్శముఁగ గొని
అనవరతము భక్తి నాచరింప
నెట్టి వేళలందు నెన్ని విధంబులో
అన్ని విధుల సుఖము లందగలవు॥ ౨౬

ఖండ రూపమొంది కార్య రూపంబైన
పిండ జాలమున కజాండ మెపుడు
బ్రతుకుటకును వలయు పరికరంబుల నెల్ల
నవసరమ్ము కొలది నందజేయు। ౨౭

ఊరనున్న చెరువు నీరము తనయూరి
ప్రాణికోటి కెల్లఁ బంచురీతి
ఖండ పిండముల కఖండ బ్రహ్మాండంబు
పంచభూతములను బంచుచుండు॥ ౨౮

నిర్నిమిత్తముగను నీ క్షేమమునకయి
గ్రహము లాచరించు గణిత గతుల
నాశ్రయించి వాని నాచరించుట నీకు
లెక్కగొనుట కగును నిక్కముగను॥ ౨౯

లెక్కసేయ మూల మెక్కాలు రావలె
యెక్కములను గొనక లెక్కరాదు
లెక్కఁ దెలియమూల మొక్కబ్రహ్మాండంబు
నుండ నయ్యె పెక్కు పిండములకు॥ ౩౦

గగనవీధిఁ జరుగు గణితక్రమంబున
లెక్కలరసి దెలియు నెక్కములగు
అట్టి గణితగతుల నాచరించుట యన
నిక్కమైన మంచిలెక్క లగును॥ ౩౧

లెక్కగొన్నవాడు లెక్కింపఁబడుచుండు
లెక్కగొననివాడు లెక్కగొనఁడు
లెక్కగొన్నజన్మ మొక్కటైననుచాలు
పెక్కుజన్మలేల లెక్కచేటు॥ ౩౨

ఘడియఘడియకును సకారణంబైనట్టి
కాలగణితగతుల గ్రాలుచుండ
యేఘడియలవల్ల నేప్రయోజనమౌనో
ఆప్రయోజనముల నందరాదె॥ ౩౩

లెక్కగావినవలె లెక్కగానవలె
లెక్కగాకనవలె నిక్కమరసి
పెక్కుమాటలేల నొక్కనిముసమైన
లెక్కగొనెడుపట్ల సొక్కిపోక॥ ౩౪

నిన్నగూర్చిగాదె నిర్మితంబయ్యె బ్ర
హ్మాండ మొక్కలెక్కనుండియుంట
అట్టిగణితములను నాధారముగఁగొని
యరసియాచరించు టర్హమౌను॥ ౩౫

నీవిధంబిటుండ నీకుటుంబమువారి
కందరికిని నందరధిపతులయి
వారివారి కర్మఫలితక్రమంబుల
నందజేయుచుందు రనవరతము॥ ౩౬

జననికగును చంద్రుడినుడు జనకునకు
కుజుడు సోదరులకు గురుడు సుతుల
కాయువునకు శనియు జాయకు శుక్రుడై
ఆధిపత్యమిట్టు లలరియుందు॥ ౩౭

నిన్నుగన్నయట్టి నీతల్లిదండ్రులఁ
దెలుపకుండనీవు దెలియలేవు
అఖిలదంపతులను నసలే తెలియవంచు
కన్నకడుపు కరుణగాంచెనేమొ॥ ౩౮

అసలు తల్లిదండ్రు లానందమయులౌట
పిల్లలనఁగనెంత ప్రేమగలదొ
తమ్ముస్థూలముగను దర్శింపలేరని
స్థూలమందెదారి జూపినారు॥ ౩౯

తల్లిదండ్రులెవరొ పిల్లలుగనలేరు
గాన బాహ్యమందె కాంచిమనగ
వారిపోల్కి జూపి నారుబ్రహ్మాండాన
చంద్రసూర్యులన విచక్షణమున॥ ౪౦

జననికారకునిగ చంద్రునిగా జేసి
జనకకారకునిగ సవితృఁ జేసి
చంద్రసూర్యులనిట జాయాపతులఁ జూపె
జ్ఞానపథముగా ప్రసన్నముగను॥ ౪౧

♦ పితృ పదమ్మునకును విభుఁడౌట నినుఁడు వి
లక్షణమున లోక చక్షువయ్యె
జనని యింటి విభుఁడు చంద్రుఁడై లక్షణ
మున చరించు లోక మనసు నయ్యె॥ ౪౨

జనని చంద్రుడయ్యె జనకుడు సూర్యుఁడౌ
జనక తేజమునకు జనని వెలుగ
ఒకడు రేవిభుత్వ మొకడు దినవిభుత్వ
మొకడు నిశయు వెలుగు నొక్కఁడౌను॥ ౪౩

—*చంద్ర లక్షణము*—

చీకటియున నద్ది చీకటి యనరాదు
వెలుతురన్న దాని వెలుతు రనరు
వెలుగు చీకటియును గలసిన దౌటచే
ద్వంద్వరూప రాత్రి దనరియుండు॥ ౪౪

♦ శ్రు॥ చంద్రమా మనసో జాతః। చక్షోః సూర్యో అజాయత।
యజురారణ్యక ప్రశ్న 3 అ ౧3 దశ ౧

వివరణ: మనస్సు ప్రకృతిసంబంధమౌటచేతను, ప్రకృతి మాతృవగుటచేతను మనస్సున కధిపతియగు చంద్రునిగూడ మాతృస్వరూపముగను, చక్షువు తేజోసంబంధమగుటచేతను, తేజస్సు పరమాత్మయగు పితృవగుటచేతను, చక్షువున కధిపతియగు సూర్యునిగూడ పితృస్వరూపముగ భావించవలెను

—♦సూర్య లక్షణము♦—

అచలమైన సూర్యునందు ననేకముల్
చలన సహిత కిరణములు జనించి
అన్ని దిశలయందు వ్యాపించి యొండయై
ప్రబల తేజమొందుఁ బవలనంగ॥ ౪౫

—*చంద్ర సూర్య లక్షణము*—

అనుపమానులైన యాచంద్ర సూర్యులు
కాల జగమనంగ గాంచజేసి
పవలు రే లొనర్చి బాలింపు చుందురు
పితరులట్ల గణిత గతిని సతము॥ ౪౬

చంద్రుడనెడు తల్లి చల్లదన మొసంగి
దినకరుడను తండ్రి తేజ మొసగి
ధరణి కాజ్ఞసేయ తనయుల కాహార
మునకుఁ దగిన సస్యముల నొసంగు॥ ౪౭

అట్టి చంద్రభాను లాధారులై యుండి
అంది యందనట్టి పొందుగలిగి
అఖిల జీవకోటి కన్నాదు లందిచ్చి
తనరియుందు రెత్తల్లిదండ్రు లట్లు॥ ౪౮

అంది యందకుందు రాచంద్రసూర్యులు
అవని జనము లిరువు రందియుండు
అందియును సగుస్య మర్పించి పోషించు
కన్నతల్లి దండ్రు లన్ని విధుల॥ ౪౯

అంగసౌష్టవమున కారోగ్యమున పూర్ణ
బింబకళల దర్శనంబు జేసి
జనని చంద్రుగూర్చి చాంద్రాయణ వ్రత
మాచరించు చుండు రనుభవమున॥ ౫౦

అనవరతము భక్తి నాధ్యాత్మి కారోగ్య
సంపదలకు కాల సంధివేళ
సూర్యజనక గూర్చి సూర్య నమస్కార
మాచరించుచుండు రనుభవమున॥ ౫౧

—*భూత దాంపత్యము*—

భూత పంచకమునఁ బొడసూపు చుండియు
దంపతీత్వ మనగఁ దనరియుండి
ధరణి తాసృజించు స్థావరంబుల యందు
ద్వైతభావమింకఁ దనరియుండు॥ ౫౨

పంచభూతములును పతి సతు లయిరెట్టు
లందు స్త్రీలు నోదు రవని జలము
వాయువును వరించి వరలు గంగాదేవి
అగ్నిని వరించు నవనిదేవి॥ ౫౩

అగ్నిదేవు వలన ననయంబు భూదేవి
స్థావరాత్మకమగు సంతుఁ గనును
వాయుదేవువలన వరలి గంగాదేవి
భూమిగన్న సంతు బ్రోచుచుండు॥ ౫౪

బయలునందు వెడలు పవనాగ్నుల దలంచి
గంగభూమి యిరువు రింగితమున
స్థావరముల నిట్లు జనన పోషణముల
సర్వప్రాణికోటి సాకుచుండ్రు॥ ౫౫

అట్టి భూజలంబు లనవరతంబును
ఎలమి నొకరి నొకరు కలసి మెలసి
అఖిల జీవకోటి కాహార మిత్తురు
అఖిల తరుల ఫలము లందజేసి॥ ౫౬

ఆకసంబు నుండు నాద్యంత శూన్యమై
అంతటను వెలింగి యన్నిటికిని
నన్ని పనులొనర్ప నవకాశము నొసంగు
సర్వశూన్యమయి నెసంగుచుండి॥ ౫౭

—*స్థావరములు, ద్వైతభావము*—

స్థావరంబు లనగ జంగమంబు లనంగ
రెండు రీతులుగను నుండు నందు
నుండు స్థావరములు రెండు తెరంగుల
తరులనంగ నొప్పి గిరులనంగ॥ ౫౮

అట్టి స్థావరంబు లచలముల్ చలములై
యచల గిరులు చలన మైన తరులుఁ
గాగ బీజరహితమైన పర్వతములు
నలరు బీజయుక్తమైన తరులు॥ ౫౯

మొదట బిందువుగను మీఁద పంకంబట్టు
లెన్నొ పుట్టి పెరిగి చిన్న పెద్ద
కఠిన గిరులు నయ్యెఁ గాన్పించు వార్ధియం
దెన్నొ రత్నములను గన్నవిధము॥ ౬౦

అచలగిరుల గనులసరయంగ వెలసెంక
లోకపోషణకగు లోహములను
శిల్పకృత్యములకు శిల్పోపకరణాల
కల్పనకవి సృష్టిసల్పఁబడియె॥ ౬౧

* వివరణము *

భానుభాసగు చంద్రభాసంబు నదిపొంది
ధరణిమాతగాంచు స్థావరముల
నందుతరులపంట లందిచ్చు జంగమ
సంఘజీవనముల సల్పుచుండు॥ ౬౨

జంగమములకొరకు స్థావరంబులునయ్యె
స్థావరములకొరకు ధరణియయ్యె
ధరణి కమృతరసముకొరకు చంద్రుండయ్యె
చంద్రకాంతికొరకు సవితృడయ్యె॥ ౬౩

యేదితల్లిగాదు యేదితండ్రియుగాదు
విశ్వమెల్లఁద్రిప్పి వెతకిజూడ
స్థూలమందుఁగాని సూక్ష్మమందునఁగాని
తల్లిదండ్రిలేని తావులేదు॥ ౬౪

ఇందరొక్కరొక్క రెన్ని విధాలనో
కలసిమెలసిపనుల నెలగుచుంట
నిన్ను గూర్చిగాదె నీక్షేమమున వాసి
నన్నెఁదెలియరాదె చిన్నితండ్రి॥ ౬౫

—*ఆశ్చర్య జనని భావము*—

సత్వ గుణముఁ దమము సమ్మిశ్రితై పొందంగ
ద్వంద్వరూపమయ్యె తద్గుణంబు
అది విశ్వసృష్టి కాధార మయ్యెను
అది రజోగుణంబు నైయెసంగి॥ ౬౬

వెలుగు చీకటియును కలసిన దౌటచే
ద్వంద్వ రూపమయ్యె తన్నిశయును
అఖిల సస్యసృష్టి కర్త్రమై తగినేయ
నద్ది రజనిపేరు నందగలుగు॥ ౬౭

నెలకు నెలకుఁ గొత్త నెలబాల బింబంబు
షోడశ కళలంది శుద్ధమందు
అది సస్య సృష్టి కాధారమౌ రజ
నీ కరాఖ్య రజని కాకరమయి॥ ౬౮

నెలకు నెలకుఁ గ్రొత్త నెలఁతయగా జనయిత్రి
గర్భమర్హమయి తగఁ ధరించ
షోడశాహములను శోభిల్లు నందాక
అది రజస్వలాఖ్య నైయెసంగి॥ ౧౯

ఆట వెలదు లెట్టు లాటలాడించిన
నట్టు లాటలాడు టయ్యెగాని
ఆటవెలదు లాట లర్థంబు గ్రహియించి
అనుభవమున మాత్ర లాడనైతి॥ ౨౦



## —అస్తి నాస్తికతలు—

అస్తిగాగ నొకడు నాస్తిగా మరొకరు
అస్తి నాస్తి రెంటి నేస్తమునను
నిఖిల భువనములను నిర్మించి పోషించు
తల్లి దండ్రిగూర్చి తలచ రాదె॥ ౧

అస్తియనుచునండ్రు నాస్తియనుచునండ్రు
వానియందు నేది వాస్తవమ్మొ
అస్తినాస్తికలియ నయ్యెనేమొజగమ్ము
ఏకమునను సృష్టి గాకయుంట॥ ౨

నాస్తియన్ననందు నాస్తిక్యముండును
అస్తికతయటన్న నాస్తియుండు
యస్తినాస్తికతలు నానార్థములుగాగ
అస్తినాస్తిజగము నయ్యెనేమొ॥ ౩

ద్వైతమున్నదాని ద్వైతంబనగరాదు
అనరు ద్వైతరహిత మనుచుదాని
సృష్టిశిల్పమెంచి జెప్ప లేమైనను
దెలిసికొనుటకింక దలతుముసుమ॥ ౪

వాగతీతమాట వచియించుటకురాదు
అంతులేనిశక్తి యెయెసంగు
కనులకింపుగాను గన్పడినట్లుండి
కానుపించకుండు కలయనంగ॥ ౫

అన్నివిధులసృష్టి యానందముగదోచి
దెలిసినట్టియుండి తెలియబడదు
ద్వంద్వరూపజగము ద్వంద్వభావంబుండు
పాలునీరుగలిసి పరగినట్లు॥ ౬

పాలు నీరు గలుప బహు సులభమె గాని
పాలు నీరు వేరుపరుప లేము
నిప్పు వేడిగాగ నీరు పోయిన నింక
పాలయందు ద్వంద్వ భావముండు॥ ౭

కాగుచున్న పాల గర్భంబు నందుండి
మీగడనగ నొకటి మెరయు నింక
జూడనగును వెన్న శోధించి తరచంగ
నట్టి వెన్న పాల నంటకుండు॥ ౮

నీటి మయమగు ధర నీతలంబందురా
నీరు గానబడదు నీటికొరకు
శిల్ప సాధనమున కల్పించి నిర్మించు
కొన్న రూపమున ప్రసన్నమగును॥ ౯

ఆననంబులోని అక్షి సర్వజగమ్ము
గాంచి యాననమును గాంచనట్లు
సృష్టికర్తలోని జీవుండు సృష్టిని
గాంచి సృష్టివిభుని గాంచలేడు॥ ౧౦

స్థూలజగమునందు సూక్ష్మతత్వంబును
సూక్ష్మతత్వమందు స్థూలతయును
దానియందుఁ దీని దీనియందున దానిఁ
గాంచ నస్తినాస్తికతలు గందు॥ ౧౬

పంచభిః ప్రవృత్త బ్రహ్మమయం జగ
త్తనిరిగాని గాన నెఱుఁగదేమొ
గానఁబడెడు జగము గాంచకుండుట నేర్వ
గానబడని యజుని గాంతువేమొ॥ ౧౭

పలుకు పలుకుచుంట పలుకుట వినుచుంట
వెలుగుచుంట దీపములు నెసంగి
బండ్లనీడ్చుచుంట బహువైన చక్రాలు
దిరుగునట్లు వడిగ త్రిప్పుచుంట॥ ౧౮

విశ్వమయము నైన విద్యున్మహాశక్తి
వేనవేల పనుల వెలయ జేసి
విశదపడదదేమొ విద్యుత్స్వరూపమ్ము
వెలయు పనుల జూడ గలిగినట్లు॥ ౧౯

విశ్వమయుడు నైన విశ్వసృష్టి విభుండు
విశ్వసృష్టి జేసి విశదపరచు
విశ్వసృష్టి జగము విశదంబయినయట్లు
విశదపడదదేమొ విశ్వకర్త॥ ౨౦

వివిధ కార్యములను విద్యుత్తు వెలయించి
తానదేమొ గాని గానబడదు
వివిధ సృష్టినెల్ల విశ్వకర్త సృజించి
తానదేమొగాని గానబడడు॥ ౨౧

విశ్వమయము నైన విద్యున్మహా దీప్తి
విశ్వమంత నెపుడు వెలుగబోదు
విశ్వమంత వెలుగ విద్యుత్తు యొక్కటై
విశ్వశూన్యమగుచు వెలయుచుండు॥ ౨౨

విశ్వమయము నైన విద్యు దాధారాన
విశ్వమను జగంబు వెలయుచుండు
విశ్వ మొకటె యన్న విద్యుత్తు శూన్యమై
అంధమయ జడంబె యలరుచుండు॥ ౨౩

విశ్వకారణమ్ము విద్యుత్ప్రభావమ్ము
విద్యు దాశ్రయమ్ము విశ్వమగును
విశదపరతురట్టి విశ్వ విద్యుత్తుల
వేరు పరచి శిల్ప వేదవిదులు॥ ౨౪

విశ్వమయము నైన విద్యున్మహాదీప్తి
విశ్వమెల్ల వెలిగి వెలయదన్న
పవన రహితమైన బలుబులందున నద్ది
మేఘమందు నొకట మెరయుచుండు॥ ౨౫

బ్రహ్మమయము గాదె బ్రహ్మాండ మంతయు నంచు
గాని బ్రహ్మమంచు గానబడదు
జ్ఞానవంతులైన మానవ నేత్రములకు
బ్రహ్మ తేజమొకటె బయలుపడును॥ ౨౬

విద్యుదాకర్షణములు వెలుగొందు కిరణాలు
వెలయుచుండ జూడ వెలుగులోని
వెలుగు కారణమగు విశ్వశక్తి స్వరూపంబు
గాంచగలవె తెలివి గలిగి నీవు॥ ౨౭

నీశరీరమందు నిలిచి యాటాడించు
నింద్రియముల మొదటి యింద్రియమగు
సర్వకర్మములకు సంకల్పమును లోనుంగు
మనసు రూపమైన గనగలావె। ౨౮

అంతదూరమేల యింద్రియములలో
గూడియెల్లనాట లాడు నీవు
నేను నేనని యెడు నీస్వరూపంబైన
తెలిసికొనగ దంగ తెలియగలవె॥ ౨౯

సృష్టిజగములోని జీవుండవీవౌట
సృష్టిజగమదెల్ల స్పష్టమగును
సృష్ట్యతీతుడైన సృష్టికర్తను గాంచ
సృష్టిలోని వానికెట్లు లగును॥ ౩౦

యోగతత్త్వమున ననేకంబులగునట్లు
ఆసహస్రకిరణు డొకనుసాక్షి
అంతకన్న పాత్య్య మరయంగ లేమయా
సవితృడాదిజనక సముడుగాన॥ 3౧

అచలసూర్యబింబ మందుననేకముల్
చలనకిరణపాళి గలిగినట్లు
బ్రహ్మసంబంధమాయ ప్రభవించిజగమెల్ల
సృష్టిగలిగెనన్న కష్టమగునె॥ 3౨

ప్రకృతి తత్త్వమందు పరతత్త్వ ముండును
ప్రకృతి రహితమగుచు పరమనంగ
ప్రకృతి తత్త్వమెల్ల పరిశోధనము జేయ
ప్రకృతి రహితమైన పరమె తెలియు॥ 33

అస్తియన్ననాతడాస్తికుడుంగాడు
సద్విచారణంబు సల్పకున్న
అనుభవంబునోడ నాచరింపకయున్న
అస్తియన్నగాని నాస్తికుండె॥ 3౪

నాస్తియన్ననతడు నాస్తికుడుంగాడు
నాస్తియనెడుజగతి నాస్తిగాంచి
సాధనమున నాస్తి శోధకుండైయున్న
నాస్తియన్నగాని ఆస్తికుండె॥ 3౫

కర్షకులకు వలయు వర్షింపఁజేయఁగఁ సాధ్య
యంత్రములసృజించి యంత్రమునను
మేఘజలమొసఁగు మేఘవాహనుఁడన
♦ విశ్వకర్మయనఁగ బిరుదుఁగలిగె॥ ౮

అఖిలమును సృజింప నయ్యె జగచ్ఛిల్పి
వానివలన శిల్పవంశ్యుఁడవయి
రాజిత జగదుపకరణ శిల్పివై చిరం
జీవియగుము దేశసేవగఁడ॥ ౯

యజ్ఞమునను వర్షమునతరించునటంచు
అర్జునునకు కృష్ణుఁడనుగాన
యజ్ఞమూలములగు యజ్ఞోపకరణాలు
శిల్పికర్మలని వచింప లేదు॥ ౧౦

శిల్పకర్మలని వచించినయంత్రమా
వర్ష ధారలుట్టి పడున! కాదు
వర్ష యంత్రమునను వర్షించుఁగాని రా
మేఘవాహనుని సమేతయైన॥ ౧౧

---

♦ శ్రుతి  స ప్రథమస్సంస్కృతిర్విశ్వకర్మా| ...........
... .. .....బృహస్పతిశ్చికిత్వాన్॥
యజుర్బ్రాహ్మణ.పం. ౧

ఉత్తమమైన నూతన శిల్ప నిర్మాణ కర్మనెవఁడు చేయునో వాఁడు సంస్కృతి యన బడును. అట్టివాఁడే విశ్వకర్మయును అతఁడే ఇంద్రుఁడే. (విద్యారణ్యుఁడు.)

పర్వతాగ్రభాగ పర్యాప్తహిమశిలా
ఖండతతులు ద్రవముగా కరంగి
వెల్లివిరియ దేశ మల్లకల్లోలమా
గతిని సింద్రుడరసి కరుణతోడ ॥ ౧౨

పర్వతములనుండి ప్రవహించు నీటిని
నదులమార్గమున నొనర్చ గిరుల
తలలగొట్టి వజ్రధారల గోత్రభి
త్తనగ బరగె ప్రజల హాయిగూర్చి ॥ ౧౩

అయిదు సింహముఖము లమరగా సింహాస
నము నలంకరించు నమరపురిని
దేవశిల్పిచంద్రు దేవేంద్రునాశిల్పి
రాజువగుము శిల్పరాజ్యమేల ॥ ౧౪

---

4. వ- పద్యమునకు, దేవతలు మృతిభయనాశనము కొరకు చంద్రునిలో నున్న అమృతమును, శిల్పయంత్రసాధనమున మొట్టమొదటగా గ్రహించిరి. తదాది చంద్రునికి అమృతకరుడని నామము గల్గెను.

5. వ- పద్యమునకు, సూర్యబింబమునుండి వరమాణుశక్తిని శిల్పయంత్రసాధనమున గైకొని ఆశక్తిచేత కొన్ని లోహముల గరగించుచుందురు. యీ విధానములు కాశ్యపశిల్పమునం దున్నవి.

8. వ- పద్యమునకు, దేవేంద్రుడు గొప్ప శిల్పియని, లోగా చదివియున్నారు. యీతని వాహనము శ్వేతగజ మని ప్రతీతి. ఆ యింద్రుడు

వర్షము కురిపించు వర్షసాధకయానము తెల్లనైన గజాకారము గలదియు, ఐరావత మను పేరుగలిగిన విమానమనియు, గ్రహింపవలెను. యిందుకు ఉత్తరహిందూస్థానమున "విశ్వకర్మపూజ" యను చిత్రపటములు ఒక్క ముఖముతో యేనుగవాహనముపై నెక్కిన మానవరూపముతోను, పూజా ద్రవ్యములు గలిగి పూజించుచున్న యొక భక్తునితోను, చిత్రింపబడిన చిత్రపటములు ప్రకటితములై యాపటముల నెల్లరు పూజింపు చుందురు.

అంతేగాక న్యూఢిల్లీ రైల్వేస్టేషనున కెదుటి భాగమున "విశ్వకర్మ టెంపుల్" అను బోర్డుతో విశ్వకర్మదేవాలయ మొకటి కట్టబడి యున్నది.

దేవలోకమున పరిపాలించిన మహేంద్రులలో యితడొక యింద్రుడు. యిత డింద్రపదవి నధిష్టించి కశ్యపవిశ్వకర్మవలన పట్టాభిషిక్తుడైన వా డిత డొక్కడే. యీతని పట్టాభిషేకము మాఘ శు ౧౩ లు. ఢిల్లీరాజధాని ప్రభుత్వమువారు "విశ్వకర్మ హాలీడే" యని వత్సరమున కొకరోజు శలవు. యిప్పటికిని తేదీ అమలులో నున్నది. యితడు భువనవిశ్వకర్మ పుత్రుడు. భౌవనవిశ్వకర్మ నామముచేతనొప్పు దేవేంద్రుడు.

యిందుకు. శ్రు. ఏతేన హవా ఐంద్రేణ మహాభిషేకేన కశ్యపో విశ్వ కర్మాణం భౌవనమభిషేషేచ। తస్మాదు విశ్వకర్మా భౌవనః॥

[ ఐతరేయ బ్రాహ్మణ పంచికా ౮ ఖం ౨౧ అ ౪ ]

యింక — "విశ్వకర్మా భౌవనః సర్వమేధే" [ అని నిరుక్తము ]

శ్లో॥ భువనోనామయోదేవో । విశ్వకర్మా తతస్సుతః
ప్రసిద్ధో యస్సశాస్త్రేషు । భౌవనః సురవర్ధకి ॥

[ విష్ణురహస్యము ]

ప్రసిద్ధో శిల్ప శాస్త్రేషు అని పాఠాంతరము.

ఇట్లైనన్నో గ్రంథములయందు యితనిగూర్చి వర్ణితములై యుండిన్న. యిట్లగుటకు పూర్వపుటింద్రు లెవరును పొందనట్టి పట్టాభిషేకము నిత

డొక్కడే పొందిన కారణమునను, యింక నీతనిచరిత్ర బహుచిత్ర విచిత్రమైన దగుటను, యింద్రపరంపరాగతమగు ధర్మములకన్న, యొక నూతనమునైన ధర్మ మార్గముల నవలంభించి, యుగపురుషుడుగ విలసిల్లి శ్రుతులు సైతము కొనియాడ దగినంత విఖ్యాతిని వడయ గల్గెను. యిప్పురుషుని యొక్కయు, దేవలోకము యొక్కయు సంపూర్ణచరిత్రము నాచే వ్రాయబడుచున్న "చరిత్ర చంద్రిక" యను గ్రంథమున పంచర్షిమండల మను భాగమున జూడనగును.

## విశ్వకర్మ — విశ్వకర్మబిరుదు

సత్యలోకమందున్న సహస్రార పుండరీకమధ్యంగత హిరణ్మయ కాంతిగలదై, కారణములకెల్ల కారణంబగు మహాకారణదేహమన దేవాది దేవతా రూపముగలదై సకలభువనములను సృష్టించి జగన్మాతగనై తా గన్నబిడ్డల ధ్యాన గానముల నాలించి రక్షించుటచే గాయత్రియను నామము పొందినదై, ఆ సహస్రారమునుండి చిచ్ఛక్తి రూపమున నాజ్ఞేయము వరకు దిగివచ్చి అచ్చట బ్రహ్మాది పంచకర్తలకు సృష్ట్యాది పంచకర్మల నాజ్ఞాపించు చుండుటచే పంచకర్మరూపిణియై ఆ పంచకర్మలే ప్రధానాంగములుగా శిర సావహించి యుండుటచే పంచశీర్షములు గలదై యొప్పెను. అట్టి పంచ శిరస్సులుగల గాయత్రి స్త్రీరూపమునొందిన తనువురూపముగలదాయెను. తద్రూపమైన మహాకారణశరీర మధ్యభాగమున తదధిష్ఠాన చైతన్యమగు ప్రత్యగాత్మయును పురుషరూపమున దేవాదిదేవుండును, పంచశీర్షములు గలవాడునునై కర్మరూపిణియైన గాయత్రియను తనువునందు ప్రకాశించి కర్మవిభుండై చైతన్యరూపమున సర్వకర్మలను ప్రేరణ చేయుచుండుటచే తాను విశ్వకర్మనామముపొంది సకలఖండజీవహృదాకాశమున సాక్షిమాత్రు డగుచు తా నఖండరూపమున సదా ప్రకాశించు చుండును.

యిందుకు, శ్రుతి. —

" ఏషదేవో విశ్వకర్మా మహాత్మా । సదాజనానాం హృదయే సన్నివిష్టః ॥
హృదామనీషా మనసాఽభిక్లిప్తో । యఏతద్విదుర మృతాస్తే భవన్తి "
[ శ్వేతాశ్వతరోపనిషత్ ]

యింకను. శ్రుతి. — " ధీమహిధియో యోనః ప్రచోదయాత్ "

నః = మాయొక్క, ధియః = బుద్ధులను, యః = ఎవడు, ప్రచోదయాత్ = ప్రేరేపణచేయుచున్నాడో ( అనగా మనోబుద్ధులు మొదలైన అంతఃకరణములను యెవడు సంకల్ప వికల్పాత్మక సమస్త కర్మలచేత ప్రేరేపణచేయుచున్నాడో యనుట] అట్టి కర్మప్రేరకుడు సర్వకర్మాధికారియై విశ్వకర్మనామమును పొందినవాడయ్యెనని యర్థము.

గాయత్రీ మన్త్రము:— మంత్రగత శబ్దాత్మకము జనని యనియు. అర్థాత్మకము జనకు డనియు, వీ రిరువురు ఆదిమదంపతులనుట.

గాయత్రీని వేదమాతగను జగజ్జననిగను, విశ్వకర్మను పరమాత్మగను జగజ్జనకుడుగను వేదములు మొదలగునవి వేనోళ్ల చాటుచున్నవి.

అవ్విశ్వకర్మ. ఆదియందు పంచభూతములను సాధనములుగా గొని సమస్త భువనములను యెప్పటికప్పుడు నూతన విధానమున సృష్టికర్మ ల్పొచుండుటచేత నతడు జగచ్ఛిల్పి యయ్యెను.

దేవేంద్రుడు. ఆదియందు పంచలోహములను సాధనములుగా గొని ఆ జగచ్ఛిల్పి యొనర్చు నూతన జగత్సృష్టి విధానము ననుసరించి నూతన జగజ్జనులకగు నూతనజగదుపకరణశిల్పంబు లొనర్చి, జగదుపకరణశిల్పియు నైన మన దేవేంద్రు డొక్కడె విశ్వకర్మనామ బిరుదమును పొందిన వాడయ్యెను [ ఇతరు లెవ్వరికిని హక్కులేదనుట].

12, 13 పద్యములకు, ఇంద్రపరాక్రమములు.

శ్రుతి : ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం ।
యాని చ కార ప్రథమాని వజ్రీ ॥
అహన్నహిమ న్వపస్తతర్ద ।
ప్రవక్షణా అభినత్పర్వతానామ్ ॥

ఋ. ౧-౩౨-౧

వజ్రహస్తుడైన ఇంద్రుని పరాక్రమములు మూడు విధములుగా చెప్పబడెను: 1. మేఘరూపమగు సర్పమును హింసించెను. 2. పిదప వెంటనే భూమియందు జలమును ప్రవహింపజేసెను, 3 పర్వతములనుండి ప్రవహించు నదులిరువైపుల ఒడ్డొదుసుకొని ప్రవహించునటులచేసెను.

మం॥ యదింద్రాహన్ ప్రథమజామహీనామ్. [ ఋ ౧-౩౨-౩ ]

" అహన్న హిమరిణా త్సప్తసింధూన్ ।
అపావృణోదపి హితే వఖాని ॥

ఋ. ౪-౨౮-౧

ఇంద్రుడు మొట్టమొదట మేఘములలో బంధింపబడిన జలములను వర్షరూపమున వర్షింపజేసి పర్వతములపైనుండి సప్తసింధువులు ప్రవహించునట్లు చేసెను.

మం॥ ఇంద్ర అపో మనవె స్రుతస్కః ॥ [ ఋ, ౪-౨౮-౧ ]
ఇంద్రుడు మనుష్యుల కొరకు ఉదకముల నొసంగెను.

వి వ ర ము లు :

ఇంద్రుడు వజ్రాయుధము ధరించుటచే వజ్రి యను నామమును పొందెను. వజ్రాయుధ మనగా నవరత్నములలో రత్నరాజమగు వజ్రమే

గాని యెంత తపించినను దధీచి మాత్రుని వెన్నెముక వజ్రాయుధము కాజాలదు. వజ్రము కఠినములగు శిలలు మొదలగు వానిని భేదించు శక్తి వంతమైనది గనుక దాని నాయుధముగజేసికొని పర్వత శిఖరముల భేదించు టచే యింద్రుడు గోత్రభిదు డయ్యెను మేఘము లెపుడును యెక్కువగా గొప్ప గొప్ప పర్వతపంక్తులపైననే విహారములు సల్పుచుండుట ప్రకృతి విలాసము. అందుచేత పర్వతములపైన యెక్కువగా వర్ష ములు వర్షించు చుండి, ఆ వర్షజలప్రవాహము వెల్లివిరిసి దేశమున గల ప్రజలకు నష్టకష్టముల గలిగించు చుండుననుట అనుభవవేద్యము. పై యుక్తుల భావములజూడ ప్రవాహజలముల వలన బాధపడుచున్న ప్రజల రక్షింపబూని యే యే పర్వతములనుండి యే యే విధముగా జల ప్రవాహము ప్రవహించు చున్నవో ఆ యా వాటిని మరల్చి అనుకూల భూ ప్రదేశమార్గముల ప్రవహింపజేసి ప్రజలకు యే నష్టకష్టములు గలుగకుండా ఆ యా పర్వతముల పై భాగముల యెత్తుగనుండి అడ్డుగలుగ జేయుచున్న ప్రదేశశిఖరముల వజ్రాయుధముచే భేదించి నదీమార్గమున ప్రవహింప జేసెననుట విశదమగుచున్నది.

ఇట్లెచ్చటచ్చ టవసరమో ఆ యా పర్వతశిఖరముల నరికివైచి ప్రవ హింపచేసినవి మొట్టమొదట సప్తసింధువులని తెలియు చున్నది. అందుచే ఇంద్రుడు లోకోపకారి యగు యొక మహాశిల్పి యనుట సత్యేతరముగాదు.

వారధి గట్టుచున్న రామచంద్రుని కుపచరించు చున్నదని యొక వుడుత వీపున మూడువ్రేళ్లతో నిమురగా సృష్టిలో లేని మూడు గీతలు వుడుతజాతి కంతటికిని రాముని వలన నేర్పడిన వనుటయు,

పక్షములుండి యెగురుచున్న పర్వతముల నొకదాని పక్షముల ఖండిం చుటచే అన్ని పర్వతముల పక్షములు తెగి పడియుండెననుటయు,

సృష్టివిరుద్ధములగు నిరాధారములైన కల్పితములే ! జగదుపకరణ శిల్పి యగు దేవేంద్రుని శిల్పచైతన్యమును కప్పిపుచ్చుటకై వర్ణనాడంబరము లచే కల్పింపబడిన యింద్రుని గోత్రభిదుత్వమును, శ్రీరాముని కరస్పర్శ

మున గల్గిన వుదుత గీతలను, దదీచి వెన్నెముక వజ్రాయుధముగా మారుటయు అసంభవములు.

14 వ పద్యమునకు

సింహాసనము. ప్రజాపాలన మొనర్చు రాజులు మొదలు చక్రవర్తుల వరకును వారివారి యున్నతాసనములను సింహాసనములందురు. సింహాము నకు పంచాస్య మని పేరుగలదు. కొందరు నిమంటుకారులు, సింహాము విశాలమైన ముఖముగల దగుటచే పంచాస్యమైనదనిరి గాని యది సత్య నిర్వచనముకాదు. ఎట్లన । సింహగమనము పంచదిగ్ముఖావలోకమైనదిగ నుండును, అనగా సింహము అడవిన సంచరించునపుడు వెనుకను ముం దును యిరుప్రక్కలను పైభాగమును అయిదు దిక్కులను తిలకించుచు ముఖము అయిదుదిక్కులయందును అయిదు విధములుగ మరల్చుచు నడచు చుండును గనుక సింహము పంచాస్యమైనదనుటుచితము. ఇట్లే పరిపాలకు లును ప్రపంచజ్ఞానము గలిగి పాంచభౌతిక ప్రజల నేలునపుడు పంచవిధ ముల ( అనగా సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ కర్మల ) సత్య పరిశోధనముచే పాలించుటకు, సింహగమనముగుర్తుగా వారివారి యున్నతా సనములకు సింహవదనము (కీర్తిముఖము) గలదిగ లోకకల్యాణ మొన గూర్చు శిల్పయోగులు నిర్మించి వారిచే యొసంగబడిన రాజాసనములను సింహాసనము అందురు. మన మహేంద్రచక్రవర్తికి మాత్రము పంచసింహ వదనములు గల సింహాసనముండును. కారణము " చరిత్ర చంద్రిక " యను గ్రంథమున జూడనగును.



# జ్ఞాన విజ్ఞానాలు

—(౦)—

చేయఁదగినదేమొ చేయదగని దేమొ
సూనృతానృతముల సూత్రమేమొ
సర్వభూత దయయు శమదమాదు లవేమొ
వాని తెలిసికొనుట జ్ఞానమంత్రము. ౧

ఆది తల్లి సంద్రము లందున బ్రహ్మాండ
మందు సంచరించు నట్టిగ్రహము
లందు నఖిల జీవులందు నెట్లుండుటో
వానిఁ దెలిసికొనుట జ్ఞానమంత్రము. ౨

భూమిగర్భమున నభోగర్భమున నున్న
నఖిలవస్తుగుణము లరయుటయును
లోకపోష పంచలోహ కల్పనము వి
జ్ఞానమంత్రము దేశసౌఖ్య మరసి. ౩

శిల్ప సాధన కగు శిల్పశాస్త్రమ్మును
ధర్మశీల శిల్ప నిర్మితమును
వీని రెంటి మైత్రి విజ్ఞానమందురు
ఆర్య శిల్పయోగు లరసి తరచి. ౪

శిల్పశాస్త్రవిదులు శిల్పనిర్మాతలు
గణన శిల్పి విశ్వకర్మలెల్ల
వెలయఁ జేయు వారు విజ్ఞానులా దేశ
భాగ్యకర్మశాల భక్తులయ్యె. ౫

మాననీయములగు జ్ఞాన విజ్ఞానాల
జంట శాశ్వత ప్రశాంతయుక్త
సర్వమంగళాత్మ స్వాతంత్ర్య సామ్రాజ్య
పూర్ణతత్వ పదము పొందఁజేయు. ౬

శిల్పమాతృసేవ జీవనంబుగఁ గల్గు
శీలమున్న యట్టి శిల్పయోగి
దేశభాగ్యలక్ష్మి దీర్చి నిల్పును గాని
మోక్షమన్న దాను మురియబోడు. ౭

అఖిల జీవ కరుణఁ నాత్మయందు నెసంగి
యఖిల జీవసేవ నందగలుగు
నట్టి శిల్పయోగి యాత్మ సన్యాసియై
వేష భావలన్న దోషమనును. ౮

జగతి జీవకరుణ జ్ఞాన విజ్ఞాన సం
పత్తిఁ గలుగు శిల్పి పరమునున్న
నిహము నున్న నొక్కటే చిరంజీవియై
అమరుడనగ నొప్పు ననిమిషుడయి. ౯

జనుషు పొందదగిన జన్మాంతిమునకును
నీడ నిలువ జలకమాడ త్రాగ
పండగట్ట గుడువ నుండ శిల్పవిశేష
ణములుఁ గాక జీవనమ్మె లేదు. ౧౦

దేశభాగ్యమునకు దేశోద్ధరణకును
దేశ మంగళముల దీర్చ గలుగు
జ్ఞానము గల సర్వమానవుల్ శిల్పులై
పరగవలయు దేశ భక్తులయ్యి. ౧౧

---

" విజ్ఞానం శిల్పశాస్త్రయోః " అని అమరము.

శిల్పము, శాస్త్రము అనుట యిది ద్వివచనము అందు శాస్త్రమును గురించి వ్యాఖ్యాకారకుడు షట్శాస్త్రములని నుడివినాడు. గాని అది సత్య దూర మగుచున్నది. శిల్పశాస్త్రము లన్నపుడు శిల్పమునకు సంబంధించిన శాస్త్రములే కావలెను. గనుక శాస్త్ర మనగా షట్శాస్త్రములని అర్థము చేసికొన గూడదు. ఎట్లన శిల్పమునకును, శిల్పశాస్త్రమునకును సంబంధము గలదగుటను శిల్ప శాస్త్ర జ్ఞానముల రెంటియొక్క కలియక విశేషమైన జ్ఞానము గలదగుటను, విజ్ఞాన మనగా శిల్పమును, శిల్పశాస్త్రమును ననుట సమంజసము.

# ఆదిమూలము

—:0:—

ఏకమకుట తేజమేమి సేయక యాది
మూల మనగ మాయలీల గలిగి
వెలికి లోపలికిని వెలయుచు కలియుచు
మెరయుచుండు బింబకిరణ సరణి ॥ ౧

మాయలీల తత్ప్రభాయుతంబయి యన
న్యముగ నన్యముగ ననాత్మయయ్యె
లీలయందు తా విలీనమొందెనన న
నాత్మవలన తేజ మాత్మయయ్యె. ౨

ఆ యనాత్మ కొనియు నాత్మప్రభాచయం
బును హిరణ్మయాఖ్యమున నెసంగె
ఆ హిరణ్మయంబు నందున నా యాత్మ
ప్రతిఫలింపనయ్యె ప్రత్యగాత్మ. ౩

ప్రత్యగాత్మమైత్రి, నిత్యంబు నీ హిర
ణ్మయ గ్రహించి చేతనమును పొంది
మూలప్రకృతి నామమున దదీయ వ్యాప్తి
వలన ప్రత్యగాత్మ బ్రహ్మమయ్యె.

బ్రహ్మనామమున ప్రపంచసృష్టికి నేము
ద్వైతభావగతి విధానమునఁగా
భావిమార్గమునఁగా బ్రహ్మంబు మాయయుఁ
లింగభేదమున వెలింగినారు. ౫

కారణములకెల్ల కారణంబన మహా
కారణమను తనువు కాంతగాఁగ
ప్రకృతి తన్వియందు బ్రహ్మంబు పురుషుఁడై
ప్రకృతిపురుషులిట్లు పరలినారు. ౬

ప్రకృతి బ్రహ్మను తన భర్తగానెంచి ప్ర
పంచరచనకగు సృజింపఁబోవు
బ్రహ్మలోకమందు బ్రహ్మపట్టణము ప్ర
ధానముగ నొనర్పదలచి యిట్లు. ౭

బ్రహ్మలోకదేశ బయలున నావృత
ముగను త్రివ్వె నదులమూఁటినందు
కర్మజలమునింపి గంగను యమునాస
రస్వతులనుఁ బేర్ల ప్రకృతిమాత. ౮

మూఁడునదులపైన మూఁడు పురంబుల
గట్టనెంచి ముందు దిట్టపరచె
ఆదిభూతములగు యవ్యక్త మహదహం
కారములు పునాదులేరుపరచి. ౯

ఆదిమూలభూత మవ్యక్తశక్తి, య
నంగఁ బ్రథమమగు పునాది పైనఁ
గట్టి, సత్త్వగుణ వికాసకుడ్యములు, అ
కారవర్ణములను కప్పఁగూర్చి॥ ౧౦

అలవిశాలమగు మహద్భూతశక్తి య
నఁగ ద్వితీయమగు పునాది పైన
గుణరజః ప్రభావ కుడ్యముల్ గట్టి, ఉ
కారవర్ణములను – కప్పఁగూర్చి॥ ౧౧

అల బలీయమగు, నహంకారశక్తి య
నఁగ తృతీయమగు, పునాదిపైన
గుణతమః ప్రభావ కుడ్యముల్ గట్టి, మ
కారవర్ణములను కప్పఁగూర్చి॥ ౧౨

త్రివిధభూత, త్రిగుణ, త్రివిధ వర్ణంబుల
గొప్పపురములు సమ – కూర్చికట్టి
నాదబిందుకళల – నాణెంపు ద్వారాలు
త్రివిధములుగ దీర్చి త్రిపురములను॥ ౧౩

మూఁడు నదులపైన మూఁడు ప్రస్థలయందు
మూఁడు పురములొక్క భువన మనఁగ
మోదమున సృజించె ముక్కోణముగ, నవ
ద్వారముల్ క్రమంబు దీరియుండ॥ ౧౪

మూఁడునదుల నీరములు, మూఁడుపురముల
యంతరములనుండి యనుగమించి
మధ్యమమునఁ జేరు మార్గంబొనర్పఁ ద్రి
వేణిసంగమ మన వెలసెనద్ది । ౧౫

మూఁడు నదులపైన మూఁడు ప్రక్కల నొక్క
టొకటి మూఁటిచె, న వకమునయ్యె
నందు త్రిపురరాణ్మహాదేవి రాజ్ఞయై
త్రిపురసుందరి యనఁ దేజరిల్లు॥ ౧౬

ఇట్టి పురములింక సృష్టించి మఱియును
రాజధానులుగను రాష్ట్రములుగ
భువనములుగ దీర్చి ముఖ్యకేంద్రము నొక్క
ఔంచి, తనరెఁ ద్రిభువనేశ్వరి యన॥ ౧౭

## సూక్ష్మము

అన్నిటికిని నడుమ నవకాశమున బ్రహ్మ
మునకు సత్యలోక మును సృజించె (తలంచె)
సకల భువన విభవ సామ్రాజ్యమనసత్య
పాలనమున కేము భావిగతికి॥ ౧౮

బ్రహ్మలోకమరుగ భావినుజ్ఞానాళి
మరణభయ వినాశ కరణమునకా
అమృతపూరితమగు నమృతసరోవరం
బొండొనర్చె నెప్పు డెండనటుల। ౧౯

ఆ సరస్సునఁగ విహారమునకు, బ్రహ్మ
భావమైన 'హ'యును ప్రకృతిభావ
మైన 'స'యును గూడి యజువానబిందువు
హంసలమధ్యఁజేర హంసయయ్యె॥ ౨౦

హంస మూఁడునదుల యందున్న నజ్ఞాన
మనెడు కర్మజలము నమృతసరసి
యందు నుండు జ్ఞాన మనుపయస్సును రెంటు
కలియుచుండ వేఱుసలుపుచుండు॥ ౨౧

సత్యలోకవుదరి సంగమించు త్రివేణి
సాక్షియైన యమృత సరసియందు
పరమహంస పేర బ్రహ్మవాహనమయి
తిరుగుచుండు మూఁడు పురములరసి॥ ౨౨

## అష్టదళపద్మము

అమృతసరసియందు నఖిలలోకాధార
సూక్ష్మభూత త్రికము స్థూలభూత
పంచకాదిమూల భవ్యాష్ట దళముల
పద్మమును సృజించె భావిగతికి॥ ౨౩

అష్టవిధములైన యష్టదళంబుల
మూఁడు గుణము లందిగూఁడియాడు
నింద్రియంబులగుచు నిరువదినాలుఁగు
నందువేలకర్మ లలరునింక॥ ౨౪

అట్టిపద్మముల సహస్రారమునవేల
గండుతుమ్మెదలు నఖండలీల
మధుర రాగ గాన సుధల జోలలఁబాడు
భావిబాలజనన భావమునకు॥ ౧౫

శుద్ధసత్త్వమనెడు శుద్ధస్ఫటికశిలల్
గాజుకుప్పెలట్లు కఱగికొలిమిఁ
బోతవోసిచేసె నూతన వర్ణ కాం
తులసతమ్ము దళము లమరుచుండ॥ ౧౬

అట్టిపద్మమందు సకలలోకములకు
నేకచక్రపురి సృజించె నేక
చక్రపతిగ బ్రహ్మ సార్వభౌముండేల
సత్యలోకమందు సాక్షిగాఁగ॥ ౧౭

కారణము ప్రాకారములు

అట్టి పురమునందుఁ గట్టెను ప్రాకార
సప్తకమ్ము లోక సప్తకమన
వానియందు నాలు ప్రాకారములకును
నడుమగాను నాల్గు వైపులందు॥ ౧౮

ఏర్పఱింపనైన నిరువదినాలుఁగు
గోపురములుగట్టె గొప్పవి; యిఁక
గుప్తమైనరీతి సప్తమప్రాకార
మంచి గోపురము సృజించె నొకటి॥ ౧౯

## బురుజులు – కోట

అందు బురుజులు పదియారును నెనిమిదిఁ
గూర్చికట్టి రొక్క గొప్పకోట
బురుజులనఁగ నెవ్వి యిరువదినాలుఁగు
నింద్రియముల భావిహేతువులకు ॥ ౩౦

చంద్రకాంతశిలల సానఁదీర్చియొనర్చ
షోడశ శకలములు షోడశ కళ
లనఁగ బురుజులు పదియారునునగు భావి
కల్పవృక్షముల ప్రకల్పనకవి॥ ౩౧

సూర్యకాంతశిలల శోధించి సానలఁ
దీర్చి యష్టవర్ణ దీప్తులలర
నేర్పఱింపఁబడియె నెనిమిది బురుజులు
నష్టపర్వతముల సృష్టికేమొ ॥ ౩౨

అట్టికోట మధ్యమందు షోడశవర్ణ
కాంచనంబుచే సృజించిరిట్లు
శిల్పశిష్టశీల శ్రీచక్రరాజ సౌ
ధమ్మునునవి యేవిధమ్మునంగ॥ ౩౩

భూత వర్ణ గుణములా తొమ్మిది త్రికోణ
ములుగ దీర్చి వాని మూలకముగ
తొమ్మిదావరణలు తొమ్మిదంతస్తులఁ
బొందుపఱచె బిందు వందుపైన॥ ౩౪

మహాకారణము — బ్రహ్మాసనము

అందుఁబదియవదిగ నంతస్తువును, హిర
ణ్మయ విశిష్ట శిల్ప మర్మవిధిని
ప్రణవరత్నఖచిత బ్రహ్మాసనమ్మును
అణుమహాత్ స్వరూప మున నొనర్చె॥ ౩౫

నాదము

సృష్టి చిహ్నముగను నేర్పడు చక్రమం
దొక్క యావరణము నొక్కవిధము
నవవిధంబులైన నాదముల్ ప్రయోగించి
నాదరూపిణి యను నామమొందె॥ ౩౬

నాదబ్రహ్మము

అన్నిఁటికిని నడుమ నవకాశబిందువు
నందు బ్రహ్మ, నాదమైన తాను
నిరువురాల్మగలుగ నెనఁగి " నాదబ్రహ్మ "
లనఁగ దంపతీ సమాఖ్యనొందె॥ ౩౭

ప్రణవము

అట్టి నాదరాజ్ఞి యవ్యక్త మహదహం
కృతి త్రికమ్ము, త్రిగుణ, త్రికము అ. ఉ. మ.
త్రివిధ వర్ణములగు నవసంఖ్య ప్రగతిచేఁ
బ్రణవరూపిణి యనఁ బ్రణుతికెక్కె॥ ౩౮

## రాజరాజేశ్వరి

రాజయోగచక్ర రాజసామ్రాజ్య, స
ర్వస్వతంత్ర సుస్వరాజ్యకల్ప
సృష్టిశిల్పరాజ్ఞి శ్రీరాజరాజేశ్వ
రియను పేర సద్వరేణ్యయయ్యె॥ ౩౯

బ్రహ్మతేజ మనెడు భానుప్రకాశము
నఖిల బీజసృష్టి కాదియైన
పద్మమంది పొందు పరితోషమునఁ గ్రింద
నలరు బుడఁగ లమృత జలము పొంగి॥ ౪౦

## అడవి

బ్రాహ్మరూప జనని బ్రాహ్మీనామము నొంది
త్రిపురములకుఁ బై ప్రదేశమందు
నావృతముగ నతిభయంకరమ్ముగ నిబి
డాంధ తమసమైన యడవి నిల్చె॥ ౪౧

## బ్రహ్మబిలము

బ్రహ్మపురికిఁ బోవ పశ్చిమవీధిని
నలఁతియైన బ్రహ్మబిలము నిల్చె
నందు చండగతుల నడవి ఘోరమ్ముగాలి
వలన మృత్యుభయముఁ గలుగకుండ॥ ౪౨

### అమృతోపసరస్సు

అమృతసరసినుండి యావిరిరూపమై
పద్మదళములందు పడఁగురియఁగ
నా ప్రవాహరూప మమృతోప సరసిగా
నలరునద్ది బ్రహ్మబిలమునందు॥ ౪౩

### సరస్వతి

త్రోవతుదిన, లోక, స్థూలసూక్ష్మంబుల
నమృతరసము సరసియందుఁ బాఱ
సకలకర్మరూప శబ్దామృత ప్రవా
హము * సరస్వతి యను నాఖ్యనొందె॥ ౪౪

### వీణ

బ్రహ్మబిలమునందు బహిరంతరములఁ గ
వాటములను నిల్పె వరుస నవి, ప
రాదివాక్చతుష్టయము దానినాల్గింట
వరసి పెంపఁగఁ బదియాఱునయ్యె॥ ♦ ౪౫

---

*"బ్రహ్మలోకే బ్రహ్మసరః ఆశ్రయత్వేన అస్యా అస్తీతివా సరస్వతీ" బ్రహ్మలోకమందు బ్రహ్మసరస్సునాశ్రయించి నదీరూపముగాఁ బ్రవహించునది" గావ సరస్వతి (లింగాభట్టీయము)

♦ శబ్దజనన మూలములగు వాగ్ద్వారములు పదియాఱింటియందును ముందుగనే యేర్పడినవి అచ్చులైన అకారాది వర్ణములు పదియాఱు మఱియు వైఖరీ వాక్కు మొదలు పరావాక్కు వరకు జాగ్రదాది నాలుగవస్థలను ఒక్కొక్కదానియందు నాలుగవస్థలేర్పడగా నైనవి పదియాఱవస్థలని గ్రహింపవలెను.

బ్రహ్మాబిల నదీప్రవాహా ధ్వనులగు, న
వ్యాకృతులనేఁడు మెట్లవరుసపైన
ప్రణవతంతువులను పఱచి, నిర్మించిన
విశ్వమోహనమగు వీణయందు. ౮౬

భావరాగతాళ భరిత * భారతిపేర
విశ్వశిల్పియజుని విశ్వసృష్టి
చిహ్నమనఁగనేమొ ? శ్రీకారముగ జయ
మంగళములపాట పొంగిపాఁడు. ౮౭

* " బిభర్తీతి భారతీ " భరించునదిగాన భారతి.

(లింగాభట్టీయము)

సృష్టిచిహ్నమునకు త్రికరణమేళనముగ భావ, రాగ, తాళయుక్త భావి నాదశబ్ద విశ్వసృష్టితత్వముభరించి గానమొనర్చుటచే "భారతి" యను నామమును పొందినదయ్యెను. అట్టి భారతిచేయు గాన చిహ్నమును యీ దేశమునందే (అజనాభిదేశమున) జరిగి సృష్టియు నిచ్చుటనే ప్రారంభింప బడినదగుటచే యీ దేశమునకు భారతదేశమని పేరు గలిగినది. ఇటీవల జనించిన రాజమాత్రులగు జడభరతునిపేర దేశమును, శకుంతలకొడుకగు భరతునిపేర వర్షఖండములను, ఏర్పడినవనుట సమంజసముకాదు.

జగజ్జననియైన భారతీదేవి [భరతమాత] పేరును తప్పించి రాజుల పేర నొప్పించుట కేమిహేతువో. విమర్శకులైన పండితులు దీర్ఘముగ నూహించెదరుగాక.

సృష్టి యీ దేశముననే ప్రారంభింపబడిన దనుటకు మా " చరిత్రచంద్రిక " చూడుడు—

## బ్రహ్మము - బ్రహ్మపట్టణము.

బ్రహ్మనగరవాణి బ్రహ్మంబులోనుండు
పట్టణంబులోన బ్రహ్మముండు
బ్రహ్మపట్టణమన బ్రహ్మంబనంగను
ద్వంద్వభావమునను దనరియుండు॥ ౪౮

అట్టి బ్రహ్మమునకు నాకారమును లేక
పట్టణంబె రూపభావములర
బ్రహ్మపట్టణమునఁ బ్రభువుగా వెల్గొంద
బ్రహ్మమిట్లు రూపవంతుఁడయ్యె॥ ౪౯

దేహరూపమందు దేహాంగములయట్ల
నగరమనెఁడు తనువు ననుజెలంగు
నట్లుజెలఁగువాని యఖిలేంద్రియములకు
నన్నిగోళకంబు లమరియుండు॥ ౫౦

అట్టు లమరియుండు నా సత్యలోకాన
సకల భువనసృష్టి సల్పనెంచి
సకల సాధనముల సత్యవతి యొసంగ
సత్యరూపుడుండు సాక్షిగాఁగ॥ ౫౧

బ్రహ్మ సత్యమాట బ్రహ్మసత్యత్వమ్ము
వచనములుగ జిహ్వ పలుకజేయఁ
బలుకరింపనద్ది పలుకువెలందియై
బ్రహ్మవక్త్రమందు బరఁగుచుండు॥ ౫౨

వాక్కు నాదమొసగి వచియింప లేకుంట
వాక్కునందు జిహ్వవలుకఁజేయఁ
వక్త్రమందు జిహ్వ వాక్కులొండొరులును
ఆలుమగలనంగ నలరియుండు॥ ౫౩

వాగ్విభుండు బ్రహ్మ వాక్సతిగీర్వాణి
యందు శబ్దజనని యఖిలసృష్టి
నలరు ప్రణవ వీణయందు గానమొసర్చి
శబ్దభువనసృష్టి సలుపుటకును॥ ౫౪

మూఁడు నదుల జలముఁగూడి యావిరిఁగాఁగ
మేఘరూపమున నమోఘమైన
వారిధారలం బ్రవర్షింపగాఁజేయు
విపినతరు మృగాది వృద్ధిగాఁగ॥ ౫౫

భయతమోటవికిని పంచదిక్కులయందు
పంచమాత్రలకు నివాసమనఁగ
పంచపురములను సృజించెను, అందుండి
భూతపంచకమ్ము బొడమునటుల॥ ౫౬

ఆకసమ్ము వాయు వగ్ని జలమ్మును
భూమియనఁగ పంచభూతములను
సృష్టిఁజేసె, నింక వృద్ధియందై దైన
భావములను తగి ప్రపంచ మనఁగ॥ ౫౭

పంచభూతకములఁ బ్రతిబింబితులఁ జేసి
పంచమూర్తులను సృజించి వారి
వాసములు సృజించెఁ బంచలోకములనఁ
బంచచక్ర కమల పంచకముల॥ ౫౮

బ్రహ్మమూర్తి మొదలు పంచమూర్తుల వల
సృష్టి మొదలు పంచకృత్యములను
పంచచక్ర కమల పంచలోకంబుల
పాలనం బొనర్పఁ బరఁగనుంచె॥ ౫౯

## జీవుఁడు

పంచలోకములకుఁ బైన దపోలోక
మనఁగ సృష్టిఁజేయు వల యవిద్య
యందు ప్రతిఫలించి యలరు బ్రహ్మచ్ఛాయ
యనెఁడు జీవుఁడేలు నందునుండి॥ ౬౦

శ్రీమదాదిరాజ్ఞి చిచ్ఛక్తియై సహ
స్రారమందునుండి సరగవచ్చి
యాజ్ఞసేయుచుండు నాజ్ఞేయమున మూర్తి
పంచకములకుఁ గర్మ పంచకమ్ము॥ ౬౧

విద్యుదాత్మకముగ వెలయు బ్రహ్మాండంబు
సృష్టిఁజేసె మొదట శిల్పగరిమ
జీవరూపముగను సృష్టించె పిండాండ
తనువులెల్ల గొప్ప వనితనముల॥ ౬౨

స్థావరములుగాను జంగమంబులుఁగాను
కోట్లకొలది సృష్టి కోరిచేసె
నందు మానవాళి కన్నపిస్త్రాలకై
యుల్లలాఁడు నట్టి యవసరమున॥ ౬౩

కన్న ప్రజలొనర్చు గానంబు నాలించి
రక్షణం బొనర్ప దీక్షఁబూను
కన్నతల్లి పొందె గాయత్రి నామంబు
నామకీర్తనం బొనర్ప సుతులు॥ ౬౪

పంచకర్మలనఁ బ్రపంచ హేతువులైన
యైదుపనులు ముఖ్యమని తలంప
నవ్వి పంచశిరములయ్యె గాయత్రికి
రూపనామములిటు రూఢినొందె॥ ౬౫

పంచకర్మములకుఁ బ్రభువయి ప్రేరేప
కుండునోటఁ బతియుఁగూఁడనిటుల
రూపనామములను రూపొందె శ్రీ విశ్వ
కర్మ పంచశీర్ష కల్పనమున॥ ౬౬

ఆది దంపతులకు నలరు పంచముఖాల
నుట్టిపడిరో యనఁగఁ బుట్టినారు
పంచఋషులు లోక భవ్యకళ్యాణ మ్మొ
నర్ప సానగాది నామములను॥ ౬౭

శౌనగాది ఋషులు మానవసోదర
రక్షణంబొనర్చ దీక్షఁబూని
యుండ తినఁగఁ గట్టఁ బండనొప్పినట్టి
సాధనములు ముందు సల్పిచూపి॥ ౬౮

ప్రస్తుతమున నిత్య వర్తన పథముకై
ప్రజల కవసరమగు పరికరములఁ
గల్పనమ్మొనర్చి కల్పకులుగఁ జేసి
చేయదగినవన్ని చేసియింక॥ ౬౯

విశ్వసృష్టి యొక్క విధమెఱుంగఁ దలంచి
నిష్ఠదపమొనర్చి నిర్వికల్ప
సత్సమాధియందు సత్యలోకంబేగి
యజుని శిల్పకర్మ లన్ని తెలిసి॥ ౭౦

భూనభోంతరాళముల వస్తుగుణముల
సాధనములతోఁడ సంగ్రహించి
యేవి దేనిఁగూడ నేప్రయోజకములో
ఆ ప్రయోగముల సమాచరింత్రు॥ ౭౧

లోకమంగళకర లోహఖనుల్ ద్రవ్వి
పంచలోహముల సృజించుచుంద్రు
మేఘమందు మెఱుపు మింటసూర్యుని పర
మాణుశక్తి సంగ్రహమ్మొనర్చి॥ ౭౨

సృష్టిజననిజగతి నెన్నికల్పించెనో
అన్ని తెలిసి వాని ననుభవమున
నెపటికవుడు భాష నేర్పఱించుచు సూత్ర
శిల్పశాస్త్రముల రచించుచుండ్రు॥ ౭౩

## పాఠశాలలు

పంచభూతయుత ప్రపంచవిజ్ఞానంబు
పసి తనమున నుగ్గుఁబాల వోలె
బాల బాలికలకుఁ బ్రథమశిక్షణముకై
పాఠశాల లేర్పఱచినారు॥ ౭౪

ఐదుతరగతులుగ నైదు గ్రంథముల ర
చించి, బదులబోధ, సేయుచుండ్రు
సూటిఁదెల్పుచుండ్రు సూర్యనమస్కార
సూత్రములను స్థూలసూక్ష్మములుగ॥ ౭౫

పంచమూర్తులెవుడు బ్రహ్మాండపిండాండ
ములను నేలు సృష్టి మొదలు పంచ
కర్మములకు శాస్త్రకారికల్ వ్రాసిరి
పాఠ్యపుస్తకములఁ బంచవిధుల॥ ౭౬

పంచభూతసృష్టి భావమర్మములను
పంచభూతతత్వ భావములను
పంచమూర్తి కర్మభావపుస్తకముల
వ్రాయుచుండి బోధ సేయుచుండ్రు॥ ౭౭

పంచఋషులు ముందు పంచకర్మలసృష్టి
తత్వమార్గముల విధమ్ముఁ దెలియ
మూలములుగ పంచమూర్తుల పేరిటఁ
బంచమతము తేర్పఱించినారు॥ ౭౮

బ్రహ్మకర్మఁ దెలియ బ్రాహ్మణుఁడందురు
విష్ణుకర్మ దెలియ వైష్ణవుఁడగు
శివుని కర్మఁదెలిసి చెలగిన శైవుఁడౌ
నింద్రకర్మఁదెలియ నైంద్రుఁడండ్రు॥ ౭౯

సూరకర్మఁదెలియ సౌరుఁడౌ; నిఁక బ్రహ్మ
సృష్టి విష్ణువృష్టి శివునినాశ
మింద్రుగోపనంబు నిను ననుగ్రహమును
నైదు తరగతులుగ నలరియుండు॥ ౮౦

ఆఱవతరగతిని నరసి సల్పిరి యద్ది
సత్యలోకమందు సల్పు విశ్వ
శిల్పియైన బ్రహ్మ సిద్ధాంతకర్మల
నరసి తెలిసికొనుటకైన వగును॥ ౮౧

పంచవర్గములకుఁ బాలకులుగనుండి
సత్యలోకమందు జరుగుచుండు
సకలభువన శిల్ప సామ్రాజ్యమున జగ
చ్ఛిల్పియైన బ్రహ్మకల్పనమ్ము॥ ౮౨

కాంచఁబూని నిర్వికల్ప సమాధిని
బ్రహ్మలోకమందు పదవులొందు
నట్టి యాఱవదగు నా పరీక్షనుపొంద
శిల్పబ్రాహ్మణులని చెలగుచుంద్రు॥ ౮౩

## షట్కర్మాదులు

జన్మమంత గడవ జనుఁడుఁదా సలుపు ష
ట్కర్మల ప్రభావ క్రమము లోక
షట్కషట్సమాధి షడ్భావముల బోధ
పఱతు రీవిధానఁ బంచఋషులు॥ ౮౪

అఖిల కష్టములను ననుభవించెడివేళ
నూరకుండక పెరవారిపైన
సల్పునిందయొక్క సంకల్పమాగామి
కర్మమై చెలంగు మర్మగతిని॥ ౮౫

సౌఖ్యమొందునపుడు సర్వసమర్థత
నాత్మగౌరవమ్ము నందుఁ జూపి
సల్పుచుండునట్టి సంకల్పమాగామి
కర్మమై చెలంగు మర్మగతిని॥ ౮౬

అనుభవింపఁదగిన యారబ్ధమునను సం
కల్పరూపమై వికల్పరూప
మై యెసంగునద్ది యాగామికర్మమై
యలరి సంచితమునఁ గలియుచుండు॥ ౮౭

పరులవలన కీడు జరుగు మింద్రియా
ధిపుల విస్మరణముఁ దెలిసి యటులఁ
జేయఁగీడురాదుగా యనుదలఁపు నా
గామి కర్మమువయి కలియునందు॥ ౮౮

అనుభవించుటంద యాచరణంబుంట
వాని రెంటి వేరుపరుపరాదు
ఆఱుజన్మముల సదాభ్యాసపరుఁడైన
వానిఁదెలిసి వేఱుపఱుపఁగలడు॥ ౮౯

ఆఱుజన్మలందు నాఱుకర్మంబుల
నాఱుగుణము లొప్ప నాచరించి
యాఱిటను పరీక్షనంది షట్కర్మాధి
కారియైన తాను వేఱుపరచు॥ ౯౦

ఆరుకర్మలనగ నారబ్ధమాగామి
సంచితములరెట్టి పెంపనిటులఁ
జను నొక్కొక్కదాని సంకల్పము వికల్ప
ములను యాఱుకర్మములుగ నెప్పు॥ ౯౧

షడ్గుణంబు లనఁగ సత్వరజస్తమో
గుణగణమ్ము లాఱుగుణములయ్యె
సగుణ ♦ నిర్గుణముల ద్విగుణీకృత మొనర్ప
నింక షట్సమాధు లెసగునవ్వి॥ ౯౨

---

♦ నిర్గుణంబులనగా గుణశూన్యములని భావింపరాదు. అమనస్క శబ్దమువోలె అనగా మనస్సుండియు బాహ్యవిషయ సంకల్పము శూన్యము

ఆరులోకములకు నవలకునేగి ని
ష్కామ కర్మముల నఖండనిష్ఠ
శీలనమ్మొనర్ప సిద్ధించుప్రజ్ఞలు
షట్సమాధులగు ప్రసన్నములుగ॥ ౯౩

ఆరులోకములన నాభూతిపోలోక
మజుడు శిల్పకల్ప మరసిజేసె
ఖండపిండములు నఖండ బ్రహ్మాండము
లతడు విశ్వకర్మ డాద్యుడగుచు॥ ౯౪

అట్టిలోకములను నజుని లక్ష్యముజేసి
షట్సమాధిమార్గసంచరమున
సత్యశీలనమ్మ సల్ప జగచ్ఛిల్ప
కర్మములయి బ్రహ్మకర్మములగు॥ ౯౫

ఆఱుకర్మములగు నాఱుసమాధుల
నాఱులోకములకు నవలగతిని
నాశ్రయించి విధిని నారోహణమొనర్ప
నగును నిర్వికల్పమను సమాధి॥ ౯౬

ఆఱుకర్మలైన యాఱుసమాధుల
నాఱులోకములకు నవలకేగి
యచటనుండి తిరిగి యవరోహణమొనర్ప
నగునది సవికల్పమను సమాధి॥ ౯౭

---

నొంది (అనగా) వికల్పమొనర్చి పరసాధనమునకగు యేకసంకల్పముగల మనస్సుండియు లేనిదే యగును అట్లె నిర్గుణశబ్దవిషయమునుగూడ తెలియ నగును.

ఆటుదాటిపోయి యారోహణంబున
సత్యశీలనమ్ము సల్పి నిర్వి
కల్పమను సమాధి గల్గియుండుట జగ
చ్ఛిల్ప కర్మమనఁగఁ జెలగుచుండు॥ ౯౮

అంగునుండి మరల నవరోహణంబున
సత్యశీలనమ్ము సల్పుచు సవి
కల్పమను సమాధి గల్గుట జగదుప
కరణములగు శిల్పకర్మములగు॥ ౯౯

నిశ్చలత్వమైన నిర్వికల్ప సమాధి
సత్యలోక మరిగి నిత్యమచట
విశ్వశిల్పిసలుపు విశ్వకర్మల సత్య
శీలనమ్మొనర్పఁ శిల్పమగును॥ ౧౦౦

---

శిల్ప శబ్దమునకు వ్యుత్పత్తిని విచారింపగా?

"శీలసమాధౌ" అనుభ్వాది ధాతువునుండియు, "శీల ఉపధారణే" అను చురాది ధాతువు నుండియు రూపము సిద్ధించుచున్నది. ఈ రెండర్థములును విరుద్ధములుగావు. శీలతి= సమాదధాతీతి శిల్పం; అనగా శిల్పము సమాధి సుఖదాయకమని తెలియుచున్నది. రెండవధాతువును బట్టి చూచిన శీలయతీతిశిల్పం; అనగా అభ్యసింపబడునదని యర్థము. ఈ యభ్యాసము సమాధి పక్షములో గూడ వ్యతిరేకముకాదు గదా!

సాధకుడగు వాడు సమాధి పరిశీలనముచే పయనించుచు బోగా సత్యలోకమున కేగును. ఆ లోకమున బ్రహ్మముండును. ఆ బ్రహ్మముచే నిర్మింపబడు మహాకారణాఖండరూపములగు మహాబ్రహ్మాండమున గల

ఆయుజన్మలందు నాగామిరహిత ప్రా
రబ్ధకర్మకుల శిరమునదాల్చి
అనుభవింప నిర్మలాంతః కరణత ని
ష్కామకర్మయోగిగా జనించు॥ ౧౦౧

ఆయుజన్మల వర కాగామి రాకుండ
ననుభవింపనేర్చి యులరియున్న
నంతవరకు నుండు యాగబద్ధమణగి ని
ష్కామ కర్మయోగిగా జనించు॥ ౧౦౨

ఆయు జన్మలందు నాగబ్ధ్హాకర్మఫలే
యనుభవింప నేర్చినంతి మగిడి
యేఁడవదగు జన్మమేర్పడుకాలమ్ము
వత్సరములు మూఁడు వందలగును॥ ౧౦౩

---

భువనంబులును ఖండరూపములగు పిండాండములనెడు జీవతనువులగు భువనంబులును జగచ్ఛిల్పంబులై యొప్పును.

మరియు చిరంజీవులుఁ గాఁదలంచిన నిష్కామకర్మయోగారూఢులు సమాధులనెడు సోపానద్వారమున సత్యలోకము నఁటిగి యందు సత్యపరిశీలన మొనర్చి యచటి జగన్మూలములగు శిల్పంబుల దర్శింతురు.

ఆ జగన్మూల శిల్పవిభుండగు బ్రహ్మ విశ్వకర్మలకు విలక్షణుడై సాక్షి మాత్రుడుగనున్నను ప్రకృతిమాతచే సమస్తజగత్తులు నిర్మింపఁడినవైనను, కర్మసాక్షియైన బ్రహ్మముయొక్క తేజము నాధారముగఁగొని విశ్వకర్మలు నిర్మింపఁబడినవగుటచేత నవి బ్రహ్మకర్మలుగ నాయెను.

పరమగురుఁడు బోధపరచె వీరబ్రహ్మ
మాచరణముజూపి యుల యహింస
హిందు తురక లైక్యమొంద నస్పృశ్య రా
హిత్య బీజముల సృజించినాటి॥ ౧౦౪

ఆఱుజన్మలందు నార్జించి శక్తిని
గాంధిగా జనించి కార్యరూప
ముగ ఫలింపఁజేసె మూఁడువందలకు రాఁ
గలఁడు యాఱుజన్మలలరి మరల॥ ౧౦౫

## కర్మశాలలు

పాఠశాలలందు పఠియింపఁబడినట్టి
శిల్పకర్మలను సృజించుటకును
ఐఁదు తరగతులుగ నై 'దువృత్తుల కర్మ
శాలలను ప్రతిష్ఠ సల్పినారు॥ ౧౦౬

ప్రజల కవసరముగఁ బ్రతియూర నున్నట్టి
కర్షకాదులకునుఁ గావలసిన
నిఖల పరికరముల నిర్మాణమొనరింత్రు
సోదర ప్రపంచ శోభకొరకు॥ ౧౦౭

పాఠశాలలట్లు ప్రతియూర నిల్పిరి
కర్మశాలలెన్నొ క్రాలుచుండఁ
బంచవృత్తులకును ప్రతివత్సరము పరీ
క్షల నొనర్చెదరు విశాలదృష్టి॥ ౧౦౮

గ్రామముల వెలుంగు కర్మశాలలయందు
ధర్మకర్మభావ మర్మములను
యనుభవమునఁ బిల్ల లాచరింపందగు
నటుల జేయుచుందు రనవరతము॥ ౧౦౯

పంచమతములందుఁ బంచవృత్తులయందుఁ
బంచవర్గములను పంచఋషులు
పాలనమ్మొనర్చి ప్రజలెల్లర వివేక
వంతులుగ నొనర్చి సంతసింత్రు॥ ౧౧౦

విశ్వబాలురెల్ల విజ్ఞానవంతులై
సర్వజీవసేవ సల్పుచుండి
పారమార్థికముగ భరిత మహానంద
మనుభవించుచుందు రతులగతుల॥ ౧౧౧

అన్నిటను పరీక్షలంద నుత్తీర్ణులఁ
జేసి రెండటిని విశిష్టగతుల
అందుకడు సమర్థులౌట శిల్పబ్రాహ్మ
ణులు పొగడ్తలంది వెలయుచుంద్రు॥ ౧౧౨

దేవలోకము – శిల్పసామ్రాజ్యము

భూతపంచకమున భూప్రదేశంబెల్ల
పంచఖండముల విభాగపరచి
పంచఖండములకు పంచనామములేర్ప
రించినారు మొదట పంచఋషులు॥ ౧౧౩

బ్రహ్మచేసె ముందుబ్రహ్మాండమంత భా
వ్యాండ పిండకోటి తిండికొఱకు
స్థావరము లొనర్చి; నావఽహిమశైల
దక్షిణమున నున్న ధరణియందు॥ ౧౧౪

అఖిల జీవసృష్టి యారంభమగుటను
యజుని నాభిదేశ మైన దగుట
నట్టిదేశమునకు యజనాభిదేశంబ
టంచు నామ మేర్పరించినారు ౧౧౫

సత్యలోకశిల్ప సామ్రాజ్యమూ జగ
చ్ఛిల్పి విశ్వకర్మ శిష్టశీల
కల్పనమ్ముబోలు శిల్పసామ్రాజ్య మీ
భూతలమున నిల్పబూని ఋషులు॥ ౧౧౬

విశ్వమానవులకు విద్యాత్సహాయ సౌ
కర్యములను యెన్నొ గలుగజేయ
త్రివిధ పర్వతముల త్రిపురాలొనర్చిరి
విద్యదాలయముల వెలయునటుల॥ ౧౧౭

ఉత్తరమ్మునను సమున్నతోన్నత దివ్య
వాసయోగ్యమైన వసుధ విశ్వ
కర్మశాల నొకటి గట్టిరి గొప్పది
విశ్వశిల్పములను విధినొనర్ప॥ ౧౧౮

దేవలోకమనియు దీర్చిరి నామంబు
దేవలోకమన్న త్రిపురములకు
కేంద్రరాజధాని కేంద్రప్రభుత్వ మ
ఖండలీల శిల్పమండలమన॥ ౧౧౯

బ్రహ్మసృష్టి విష్ణురక్ష రుద్రునినాశ
మింద్రు గోపనంబు నిను ననుగ్ర
హాములన తరగతుల నైదింటను పరీక్ష
లంది ప్రథముడౌచు నలరియుంక॥ ౧౨౦

అవని ముఖ్యములగు నారింట పైలోక
పట్టణములనుండు భవనసృష్టి
శిల్పమరయ నిర్వికల్ప సమాధితో
సత్యలోకమరిగి చలనముడిగి॥ ౧౨౧

నిత్యనూత్న శిల్ప నిర్మాణజగముల
బ్రహ్మకర్మల ప్రభావములను
అరయ గల్గి భువిని నాచరణపరీక్ష
లందుఁ బ్రథముడౌచు నలరువాని॥ ౧౨౨

నిర్నిమిత్తముగను నిష్కామియౌ జగ
చ్ఛిల్పియజుడు విశ్వసృష్టి సలుప
కామ్యరహిత శిల్పకర్మలచే తండ్రి
పనులకెపుడు సాయపడెడువాని॥ ౧౨౩

ప్రజలె శిల్పమగుట ప్రజలకైన సమస్త
కృత్యములును శిల్పకృతులె యగుట
అవిరామ్యరహిత మగుటను నిష్కామ
శిల్పకర్మ లెపుడు సల్పవాని॥ ౧౨౪

దేవలోకమందు దేవేంద్రుడని నామ
కరణ మొసగి ప్రజ్ఞగలిగి యనుభ
వాగ్రగణ్యునతని నధ్యక్షునిగనుంతు
కరసి "విశ్వకర్మ" బిరుదొసంగి॥ ౧౨౫

బ్రహ్మపంచకమన పంచగ్నులన మూర్తి
పంచకమన నుంద్రు భావములిడ
శాసన సభయందు సభ్యులుగాఁనింద్రు
నగ్రపదవిన పదునైఁదుగురును॥ ౧౨౬

ఆరుతరగతుల సమగ్రాన నుత్తీరు
లైన శిల్పకోటి నందరను వి
శిష్ట శిల్పముల సృజింపంగ దేవలో
కమున కంపుచుంద్రు క్రమవిధమున॥ ౧౨౭

ఖాండవవనము

క్షితి సృజింపఁబడిన సిద్ధౌషధులఁదీర్చి
నాటిపెంచి రొక్క చోటికోట
నింద్రు శిల్పకల్పవృక్ష లకల్గలి
ఖాండవవనమనగ గ్రాలుచుండ॥ ౧౨౮

అందు మయుడు ముఖ్యులౌ బ్రహ్మలుగా శిల్ప
కాండఋషు లనేకులుండి పధిని
సల్పుచుందు రెపుడు శిల్పరసాయన
శాలయనగ తద్రసాయనముల॥ ౧౨౯

న ం ద న వ న ము

వేలజాతులు కల పూలతోటల సృజించి
నందనవన మనుచు నందమర్చి
సింహావదన పంచ సింహాసనము కల
శాసన సభకోటకు సౌధమొకటి॥ ౧౩౦

పంచఖండములను పాలించుచురు విశ్వ
కర్మశాల త్రిపుర ఖాండవముల
దేవలోక సభల సేవజేతురు ఋషి
బ్రహ్మ మూర్తులను త్రిపంచకమ్ము॥ ౧౩౧

అమృత కలశిలోని అమృతమ్ము నింపిన
అమృతభాండమింద్రు నందనుండ
యూర్ధ్వదృక్పథులుగ నూర్ధ్వరేతస్కులు
గాగ ద్రావుచుందు రమరులనగ॥ ౧౩౨

*పర్వతములనుండి ప్రవహించు ఘనవర్ష
జలమువలన బాధగలుగకుండ
నదులమార్గములను నడిపించి ప్రజలకు
సౌఖ్యమొసగు శిల్పచక్రవర్తి॥ ౧౩౩

* యీ విషయము 16 వ పేజీలో విపులముగా తెలుపబడినది

వర్షయంత్రములను వర్షనిరోధక
యంత్రముల సృజించి యవసరముల
వర్షమిచ్చు నావు కర్షకులకు పశు
సస్యములు ఫలించి సౌఖ్యమొంద॥ ౧౩౪

విశ్వశిల్పియైన విశ్వకర్మ యొనర్చు
విశ్వశిల్పరాజ్య విధముఁ దెలిసి
దాని పగిది నతడు ధరణిపై శిల్పసా
మ్రాజ్యమేలు దేవరాజ్యమనగ॥ ౧౩౫

పంచభూతముల సృజించి యవ్వానిచే
విశ్వసృష్టిఁజేయ విశ్వకర్మ
పంచలోహముల సృజించి యవ్వానిచే
నింద్రమూర్తి శిల్పసృష్టిజేయు॥ ౧౩౬

పంచమూర్తుల కట పంచకర్మలొసంగి
ఆజ్ఞసేయ వారలాచరింత్రు
పంచవృత్తులిట సృజించి దేవతలకు
ఆజ్ఞసేయ వీరలాచరింత్రు॥ ౧౩౭

సత్యలోకమందు సాలోక్యముఖ్య త్రి
పదవులుంచి బ్రహ్మ భాసిలంగ
మూర్తి బ్రహ్మ ఋషుల మూడుపదవులతో
దేవలోకవిభుడు తేజరిల్లు॥ ౧౩౮

పంచశీర్షుడగుచు బ్రహ్మాసనమున ప్ర
పంచమెల్ల సల్ప పాలనమ్ము
సింహావదన పంచసింహాసనుండయి
దేవలోకమేలు దేవవిభుడు॥ ౧౩౯

అగ్రలోకమగు సహస్రారమున సహ
స్రాక్షుడన నజుండు యలరుచుండ
వేయికనులతో దివిజ నేలగా సహ
స్రాక్షుడనగ నింద్రు డలరుచుండు॥ ౧౪౦

బ్రహ్మచర్య భావపటిమ గల్గినవార
లుంద్రుగాని వనితలుండరందు
మానవతులునగుచు మానవలోకంబు
నందునుండెదరు గృహస్థులుగను॥ ౧౪౧

పనులొనర్చువారి వారినైపుణ్యముఁ
బట్టి పదవు లొసగ బడుచు నుండి
పశ్యకప్రభృతులు పర్యవేక్షకులు ను
ద్యోగులౌ ననేకు లుంద్రు దివిని॥ ౧౪౨

అందునున్న పదవులన్నిటిని వహించి
బ్రహ్మఋషిపదమ్ము పరగుచుండి
వార బ్రహ్మలగుచు వారలే మూర్తులై
వార యింద్ర పదవి జేరగలరు॥ ౧౪౩

ఇంద్రపదవివీడి యిష్టప్రకారమ్ము
జన్మమెల్ల బ్రహ్మచర్యమునను
గడపి దేశసేవకై సర్వమర్పించి
యార్యనామమొంది యలరుచంద్రు॥ ౧౪౪

దేవలోకమందు నేవారలెవ్వడైన
సిద్ధముగను పెండ్లిజేసికొనెడు
మనసుఁగల్గువారు మానవలోకాని
కరుగుటకును నాజ్ఞకలదు దివిని॥ ౧౪౫

## సా ర స్వ త ము

బ్రహ్మవక్త్రమందు రసశబ్దామృత
రస సరస్సునను సరస్వతియగు
శబ్దజనని అట్టి సారస్వతమ్మున
గ్రంథ రచనజేయఁ గడగినారు॥ ౧౪౬

## వే ద ము లు

పంచభూతముల ప్రపంచంబుసృష్ట్యాది
పంచకర్మముల సృజించి వాని
పంచమూర్తులొగ్గి పాలించుట నెఱంగ
పంచవేదముల సృజించినారు॥ ౧౪౭

నిర్నిమిత్తముగను నిష్కామముగ బ్రహ్మ
కర్మల ప్రభావమర్మమెఱిగి
ఆచరించుటకును ననుభవించుటకును
పంచవేదముల సృజించినారు॥ ౧౪౮

నిత్యకర్మలందు నిష్కామమార్గాన
బ్రహ్మపురముజేరి బ్రహ్మకర్మ
ధర్మములను నచట దర్శనంబొనరింప
పంచవేదముల సృజించినారు॥ ౧౪౯

విశ్వజీవులకును విశ్వంబునకును సం
బంధముంట విశ్వజీవభావ
మర్మముల నెఱింగి మనుటకు నైనట్టి
పంచవేదముల సృజించినారు॥ ౧౫౦

పంచభూతముల ప్రపంచ విజ్ఞానంబు
వడసి జీవకోటి బ్రతుకుటకును
పంచకర్మలేలు పంచమూర్తులపేర
పంచవేదముల సృజించినారు॥ ౧౫౧

పంచభూతములకు పంచతన్మాత్రల
పంచకర్మగుణము లెంచి తెలుపు
పంచవేదములను పంచమూర్తులపేర
పంచఋషులు మును సృజించినారు॥ ౧౫౨

మానవుడు తరించు మార్గంబులఁ జూపి
యాచరణకు యోగ్యమైన వాని
నెన్నిసల్పవలెను నన్నింటి మర్మాలు
చెప్పువేదములను చెప్పినారు॥ ౧౫౩

ధరణి సగుణ పంచతన్మాత్రల విధమ్ము
ధరణి బీజతత్వ ధర్మములును
ధరణి వివిధగంధ మరయుతత్వవిధమ్ము
విశదపరుప బ్రహ్మవేదమంత్రము॥ ౧౫౪

అవనినుండిన కఠినాంశ పదార్థ వి
జ్ఞానయుక్తములగు వానిలోన
నేదిదేని కలియ నేరసాయనమౌను
విదితమగును బ్రహ్మవేదమందు॥ ౧౫౫

వారిగుణ చతుర్థభావతన్మాత్రల
వారిపోషణ సమకూరు విధము
వారి వివిధరస వివర్ధమాన విధమ్ము
విదితపరుప విష్ణువేదమంత్రము॥ ౧౫౬

అంబువందుగల ద్రవాంశ విజ్ఞానమ్ము
జలము మధ్యమందు సంచరింప
గలుగునట్టి యోడకల్పనమ్మిక నెన్నొ
వేద్యములగు విష్ణువేదమందు॥ ౧౫౭

అనలుఁ ద్రివిధగుణములను గ్రహించు విధమ్ము
అగ్ని లయ విధాన మరయు విధము
అగ్నిరూప దశక మరయు విధమ్మును
విశదపరుప రుద్రవేద మంత్రము. ౧౫౮

అగ్ని జలముఁ గూడ నావిరి రూపమా
దాన లోహ మార్గ యానములను
కల్పన మ్మొనర్చు కల్పా లవెన్నియో
వేద్యములగు రుద్రవేదమంత్రము. ౧౫౯

వాయు నిరుగుణముల వర్ణించు విధమును
నవిలుని యభిధాన మరయు విధము
పవను నందుఁ గలుగు స్పర్శభావ విధమ్ము
విశద పరుప నింద్రవేద మంత్రము. ౧౬౦

అనిలు నందలి చలనాంశ విజ్ఞానమ్ము
వర్ష మొనఁగునట్టి వర్షమావు
నట్టిగాలి నొసఁగు యంత్రనిర్మాణముల్
వేద్యములగు నింద్రవేద మంత్రము. ౧౬౧

అంబరైక గుణమునగు శబ్దతన్మాత్ర
మాకసము ననుగ్రహాకృతి విధము
నాకసమ్ము శబ్దమేకమైన విధమ్ము
విశదపరుప సూర్యవేదమంత్రము. ౧౬౨

ఆకసమున బయలు నంశ విజ్ఞాన దూ
రశ్రవణ సుయంత్ర రచన విధము
గగన మార్గయాన కల్పనమ్ములు నెన్నొ
వేద్యములగు సూర్య వేదమందు. ౧౬౩

అది యఖండమైన దగుదాని కాకాశ
మను మహాతలము విహారభూమి
ప్రణవ నాద మగును ప్రాణంబు పరమాణు
శక్తియను రథమ్ము యుక్తమగును. ౧౬౪

అద్ది యెంతదూరమైన తరంగ జా
లములతోడ శబ్దసముదయమున
గమనముం బొనర్చుఁ గనురెప్పపాటులో
నాదవాణియై వినోదముగను. ౧౬౫

రూపు లేదు; దాని కాపురం బన్నింటి
మధ్యమమ్ము, సూర్యమండలమ్ము;
అచటినుండి వ్యాప్తమై సంతతమ్ము బ్ర
హ్మాండమెల్ల నిండుచుండు నద్ది. ౧౬౬

దాని వర్ణన మవతార నిర్ణయమును
పూని తెలియఁగల విధానములను
విస్తరిల్లఁజేయు; విజ్ఞానయోగులు
ధ్యాస గ్రుచ్చినట్లు బోధమంది. ౧౬౭

పేరుఁ బొందె నద్ది దూరశ్రవణ యంత్ర
ముఖ్య సాధనముల మూలమునను
విశ్వమంచు వెలయు విద్యుత్తనఁగ దాని
విశద పరుప సూర్యవేద మంద్రు. ౧౧౮

భానుకిరణజాత పరమాణుశక్తిచే
మింటనంటుఁ నట్టి మంట కేడిఁ
గలుగఁజేయు యంత్రకల్పా లవెన్నియో
వేద్యములగు సూర్యవేదమందు. ౧౧౯

చంద్ర పూర్ణ కళల సామర్థ్యమునఁజేసి
మంచు శీతలమును మించు చలువ
సల్పు యంత్ర శిల్పకల్పా లవెన్నియో
వేద్యములగు సూర్యవేదమందు. ౧౨౦

మూఁడు భూతములును మూఁడు గుణంబులు
మూఁడు వర్ణములును గూడఁ బ్రణవ
మఖిల కారణమ్ము; నట్టి ఓంకారమ్ము
విశద పరుప సూర్యవేద మంద్రు. ౧౨౧

ప్రణవ సృష్టి విధము ప్రణవంబు నందుండి
యఖిల భువన సర్గమైన విధము
సుకరముగను దెలుపు సూర్యవేదంబును
ప్రణవవేద మనియుఁ బ్రస్తుతింత్రు. ౧౨౨

మండలంబులన సమాధులనంగను
కాయములన పరకాయ మనఁగ
లోకములనఁ బరలోకం బనంగను
వేద్యములగు ప్రణవ వేదమందు. ౧౨౩

మూఁడు కాయములకు మూలమై తగి మహా
కారణమ్మను *పరకాయమందు
నరసి తెలిసి చేరనది పరకాయ ప్ర
వేశమనుచు ప్రణవవేద మిటుల. ౧౨౪

స్థూలమందు నుండి సూక్ష్మంబు నందుండి
కారణంబునుండి క్రమముగాను
కారణములకెల్ల కారణంబగు మహా
కారణమ్మునొందు క్రమవిధములు. ౧౨౫

పరగు కాయములకు పరమౌ యల హిరణ్మ
యమ్మునందు జీవుఁడల సమాధిఁ
బొందఁ గలుగునట్టి పూర్ణసాధనములు
వేద్యములగు ప్రణవవేదమందు. ౧౨౬

---

* స్థూల, సూక్ష్మ, కారణ, దేహములకు పరముగానుండు మహాకారణ శరీరమునే పరకాయ మందురు. దీనిని హిరణ్మయ కోశముగను చెప్పుదురు.

దీని యందు సమాధులద్వారా లక్ష్యార్థ వాచ్యార్థములఁ బోయి ప్రవేశించడమే పరకాయప్రవేశ మందురు. దీనియొక్క సంపూర్ణ వివరములను, ఆచరింపవలసిన సాధనములనుగూర్చి నాచే రచియింపఁబడినట్టి శ్రీ సరసవాణి యను విదుషీమణికిని, శ్రీ శంకరాచార్యుల వారికిని, జరిగెన వాదోపవాదరూపముగనున్న " సరసవాణి " యను గ్రంథముఁ జూడనగును.

అందరానియట్టి యంతస్తు లేనున్న
మేడ నెక్కఁదగిన మెట్లయందు
సులభముగను బోవఁగల కాలినడకను
పయనముం బొనర్చు పగిదిగాను. ౧౭౭

అంగసౌధమందు నగ్రభాగముఁజెంద
*హంసగమన క్రమము ననుకరించు
లక్షణంబులుఁగల లక్ష్యవాచ్యార్థముల్
వేద్యములగు ప్రణవ వేదమందు. ౧౭౮

బ్రహ్మ సృష్టిలోని ప్రాపంచికం బెల్ల
బ్రహ్మమయ మటన్న భ్రాంతి యగుట
సృష్టి శిల్పమగుట, శిల్పి బ్రహ్మం బౌట
శిల్పమయ జగము విశిష్టమగుట. ౧౭౯

---

* జ్ఞానాజ్ఞాన మిశ్రమ దేహమను సౌధమునందు ఆధారాది యంతస్తులేడుండును. అందారుమాత్రము ద్వంద్వభావముగలవై వానికి నగ్రభాగమున నున్న యేడవదగు సహస్రారము మాత్రము కేవలము జ్ఞానమయమై యొప్పును. అట్టి దాని జేరవలెనన్న హంసమార్గముననే ప్రయాణము చేయవలయును. హంస మార్గమన, అజ్ఞానమను నీరమును విడచి, జ్ఞానమను క్షీరమును పొందుచుండు నట్టిదగును. అటులె సాధకుడు గుర్వనుగ్రహము పొంది హంసరూపముఁదాల్చి జ్ఞానాజ్ఞానమిశ్రిత ద్వంద్వములైన దేహసౌధసోపానములయందు, నూర్ధ్వగమన ప్రయాణము చేయతగినదై యొప్పును. ద్వంద్వము లనఁగా ఆసోపానములు క్రిందు మీదులుగనుండి యొకదానికంటె నొకటి పైభాగమున నుండియుండుటచే వానియందు ప్రయాణము చేయునపుడు క్రింది మెట్టుపైన కాలిడి, పై మెట్టుపైన రెండవ కాలిడుచు, క్రమముగాబోవ క్రింది కాలు పైకాలగుచు పైకాలు క్రింది దగుచు నవి ద్వంద్వభావము గలవై యొప్పు.

ఇటులె మెట్లుఁగూడ వాచ్యార్థ లక్ష్యార్థములచే క్రిందిమెట్టు విడువఁబడగా పై మెట్టు పొందఁబడినదై నీరక్షీరన్యాయంబున వాచ్యార్థలక్ష్యార్థములు గలిగి ద్వంద్వభావములతో నొప్పును. వాచ్యార్థ మనఁగా, విడుచుట. లక్ష్యార్థ మనఁగా, పొందుట యని యర్థము.

శరీరమను సౌధమునందు ఆరంతస్థుల వరకును తిరుగుడు మెట్లవలె విషయములను మెట్లవైన గుండ్రముగా తిరుగుచు హంసగమనమునఁ బోవలయును. ఈ మెట్లసంఖ్య అంతస్థు లన్నిటికిని సమముగా నుండక భేదముగలిగి మొత్తము ఏబదిసంఖ్యగల విషయములను మెట్లచే నొప్పును.

సాధకుఁడు ఇట్లారంతస్థుల వరకుఁ బోగా పోగా సత్యలోకంబను ఏడవ అంతస్థు చేరఁగలఁడు. దానికిని యెనిమిది సోపానములు గుండ్రముగా నుండును. అందు నాలుగారోహణమునకును నాలుగవరోహణమునకును తగినవై యుండును. (దీనినే అష్టదళ పద్మమందురు) దాన నవియు ద్వంద్వము లేయయ్యెనవి పారమార్థికములై యొప్పును. అచ్చటి, దాని మొదటి మెట్టునుండి నాలవ మెట్టువరకు నారోహణమున బ్రహ్మస్థానముఁజేరి జీవహంసయైన తాను పరమహంసగా మారి అచటి పంచానన బ్రహ్మమునకు వాహనమై (అనఁగా, ఆబ్రహ్మ యొక్క నిత్యకర్మల మర్మభారమును గ్రహించిరింగి వహించడ మనుట.)

అచటి అమృత సరస్సునందు బ్రహ్మతో విహరించి వాని నిత్యకృత్యంబులగు బ్రహ్మకర్మంబులైన సృష్ట్యాది జగచ్ఛిల్పకర్మంబుల నెల్ల నవగాహన మొనర్చుకొని మరల తక్కిన నాలుసోపానముల నైహికదృష్టి నవరోహణ మొనర్చి స్వస్థానముఁజేరి ఆజగచ్ఛిల్పియగు జనకుని మహోకారణ రూపమగు జగచ్ఛిల్పంబులకుఁ గార్యరూపములగు జగదుపకరణ శిల్పంబుల మనోవాక్కాయికముగ వెలయించి సోదరప్రపంచమున కందచేసి పంచానన బ్రహ్మమున కగ్రపుత్రు డనఁదగిన మానవాగ్రజుఁ డగుచున్నాఁడు.

ఇట్టు లారోహణావరోహణములకగు మెట్ల సంఖ్య మొత్తము 108. వీనినే సనాతనార్యులైన పంచఋషులు జపమాలకు 108 ది పూసలుండ వలెనని తెల్పిరి. పరమహంస యెట్లు! బ్రహ్మవాహన మెట్లు! మున్నగు ప్రశ్నలకు "సరసవాణి" యను గ్రంథముఁ జూడనగును.

*శిల్పమయ జగమ్ము కల్పించిన విధమ్ము
అజుని సృష్టి శిల్పమైన విధము
బ్రహ్మమయ జగమను భ్రాంతి పొందు విధమ్ము
వేద్యములగు ప్రణవ వేదమందు. ౧౮౦

పంచభూత సహాకారము

అఖిల జంగమముల కాహారమున కైన
బీజములును వాని వృక్షములును
సృష్టిపోషణములఁజేసి ఫలముల న
యాచితముగ నొసఁగు నవని మాత. ౧౮౧

---

ఆత్మస్వరూపమగు బ్రహ్మమునకు వృద్ధిక్షయాదు లుండుననుట సమంజసము కాదు. ఎందువల్లనన, ఆత్మ అఖండపరిపూర్ణముగా నుండుటయు, కాగా నందుండి కలిగిన మూలప్రకృతి తనమూలమగు నాత్మ నాధారముగఁగొని కల్పించిన జగత్తును వ్యాప్తిపరచి కర్మస్వరూపిణియైన తానును వ్యాప్తిని పొందుచుండును. తాను పొందిన వ్యాప్తిని తన మూలాధారమైన యాత్మకును పొందింప తలంచి వృద్ధిపొందునను అర్థము గల్గిన బ్రహ్మమను నామము నొసంగెను. తన యాధారమున జరుగుసృష్టి శిల్పకర్మమే వ్యాప్తి నొందుచుండును గాని తానెపుడును వ్యాప్తి నొందజాలదు గదా! – “బృంహాతీతిబ్రహ్మ”

కర్మమున సృష్టి యగును. సృష్టియన శిల్పమగును. ఎట్లన, సృష్టియంతయు స్థావర జంగమాత్మకమైన జగంబగుటచే ఆజగంబు మానవ, మృగ, పక్షి, కీటకాది నానావిధ రూపములుగల విగ్రహములు గలదగుటచేత నది శిల్పమగును. కనుక “సర్వం బ్రహ్మమయం జగత్” అనుట కంటె “సర్వం శిల్పమయం జగత్” అనుట సమంజసము.

అబ్ధి లవణ నీర మావిరిగాఁ జేసి
దాని మొయిలుఁజేసి దానినుండి
స్వచ్ఛజల మొసంగు జనని గంగాదేవి
యఖిల ప్రాణులకు నయాచితముగ. ౧౮౨

అగ్ని దేవుఁడు జఠరాగ్ని నొసంగుచు
అఖిల ప్రాణికోటి కవసరమగు
నుష్ణతేజములను నొసఁగుచు నుండు దా
ననవరతము దయ నయాచితముగ. ౧౮౩

ఒడలియందు నెప్పు డుచ్ఛ్వాస నిశ్వాస
ములును ప్రాణితతికి నలయునట్టి
గాలి నొసఁగును సహాకారమ్ము జూపించి
యనిలదేవు డెపు డయాచితముగ. ౧౮౪

ఆకసమ్మిక సకలార్థ సాధనమయి
యివ్వి యవ్వి యనక యెవ్వియైన
నన్నిపను లొనర్ప నవకాశము నొసంగు
నఖిలప్రాణులకు నయాచితముగ. ౧౮౫

జంగమములఁ బ్రోవ సహాకార వృత్తిని
సాయపడెడు భూతసంఘమట్లు
మీరలెల్లరు సహాకార సంఘంబుగా
వర్తిలుడను వేదపంచకమ్ము. ౧౮౬

భూతపంచకమ్ము బూనిన సహకార
రీతినేని నాచరింపకున్న
అజ్ఞులౌట కాక హాస్యాస్పదులు నౌదు
రంచు పలుకు వేద పంచకమ్ము. ౧౮౭

జడములైన నిట్లు సహకారములు మీఱఁ
జలుపుచుండఁ జేతనులగు మీర
లట్లొనర్పకున్న నగు పశుత్వము మీక
టంచు పలుకు వేదపంచకమ్ము. ౧౮౮

మీసుఖంబుకేని మీలోన మీరలా
భువనదంపతుల సుపుత్త్రుల మని
యొకరి కొకరు మైత్రి నుండకుండిన నాత్మ
వంచకులను వేదపంచకమ్ము. ౧౮౯

బకచయమ్ము నింగి బారుదీర్చి గమించు
జీవనమున నైక్య భావమూని
నేలబారుదీర్చి వేల చీమలు నిజా
హారరథము నీడ్చు నైక్యగతిని. ౧౯౦

జాతియన్న నెంత సహకారి మనసాకొ
కాకి కన్నమెంత గన్పడినను
కేకవేసి పిలుచు "కాకా" యనుచు తన
కులము దాని పంచుకొనుట కిటుల. ౧౯౧

జనులలోన జనులు సహకారముల నట్టు
లాచరింపకున్న నంతులేని
యఖిల జీవకరుణ నందుటెట్లౌనని
మించి పలుకు వేదపంచకమ్ము. ౧౯౨

సుతుల సోదరత్వ శోభనుగాంచ నా
దర్శభూత ముఖ్యధర్మములను
స్థూలముగ నజుండు చూపె బ్రహ్మాండమం
దంచు తెలుపు వేదపంచకమ్ము. ౧౯౩

ఆదిసృష్టికర్త యాజ్ఞను భూతముల్
తలను దాల్చి సేవఁ దగిలియుంట
జనులు నట్లొనర్పఁజాలు సాధన సత్త్వ
పథముఁదెలుపు వేదపంచకమ్ము. ౧౯౪

జనులశోభకైన సహకారవర్గాల
నేర్పరింపఁగల యనేకవిధులు
ననుభవంబు నొంద నాచరించువిధాలు
మించి తెలుపు వేద పంచకమ్ము. ౧౯౫

వేదశబ్ద మొదవు విద ధాతువున నుండి
వేదమనగ నఖిల విశ్వగతుల
తెలియఁజేయునదియు; తెలియంగబడునట్టి
పాంచభౌతిక ప్రపంచ మదియు. ౧౯౬

వేదశబ్దమొదవె విదధాతువున నుండి
వేదమున, "సమస్తమై దనర్చు
పాంచభౌతిక ప్రపంచవిజ్ఞాన భా
వమగు దాని" దెలియబరచు ననుట. ౧౯౭

ఆప్రపంచకమ్ము నజునాజ్ఞఁ బాలింపఁ
గర్తలైన పంచమూర్తులగుట
పంచఋషులు అట్టి పంచమూర్తులపేర
పంచవేదములు సృజించినారు.

ఆదిదంపతుల వినోదప్రపంచ ప్ర
వర్ధమాన సూక్ష్మభావ మర్మ
విశ్వసచ్చరిత్ర విధమెల్ల విస్పష్ట
పరచుచుండు వేదపంచకమ్ము. ౧౯౯

అమ్మగారి చరిత మయ్యగారి చరిత్ర
మమ్మయయ్యగార్ల యైక్యచరిత
మమ్మ కరుణఁగాంచ నగుచరిత్రము కాని
యితర చరితమందు నింతలేదు. ౨౦౦

దేవలోకమందు దేవతలచరిత్ర
బ్రహ్మ, మూర్తి, ఋషుల భవ్యచరిత
మింద్ర సార్వభౌము నిద్ధచరిత్ర క
న్పడవు సుమ్మి వేదపంచకమున. ౨౦౧

హింసభావముల సహింపవు మానవ
వ్యష్టిభావమన్న నిష్టపడవు
స్వార్థమన్న క్షుద్రభావమ్మని సహింప
వలఘు పంచవేదములు నొకింత. ౨౦౨

శిల్పరచనలోని జీవుండు తా నాట
శిల్పజీవనంబె స్థిరము తనకు;
శిల్పమయ జగమ్ము గల్పించి తనుగన్న
శిల్పమాతృపూజ సల్పు మనును. ౨౦౩

శిల్పమాతృపూజ, శిల్పసామ్రాజ్య ప్ర
కల్ప శిల్పరచన సల్పుననును;
అన్నవస్త్రసంప దధ్యాత్మసౌఖ్య స్వ
తంత్రజీవన ప్రదాయి యనును. ౨౦౪

పంచ ఋషులు

వేదపాఠమందు వేదార్థములఁ దెల్పి
పారమార్థికమగు పనుల నేర్పి
భవ్యులుగ నొనర్చి ప్రజలు సంతుష్టులై
పరగ సానగాది పంచఋషులు. ౨౦౫

బ్రహ్మ ఋషులు

ప్రకృతిజనని సృష్టి భావమర్మంబుల
నఖిలశిల్పిజనుల వ్యాప్తిపరచి
జనకుఁడైన బ్రహ్మ సాక్షితత్త్వముఁ దెల్పి
ఆదిబ్రహ్మఋషులు నైరి మరియు. ౨౦౬

## పౌ రు షే యు లు

ఆద్యఋషులు వారలైన కతమ్మున
వారలన్నిటఁ దొలివారలౌటఁ
నాఁడుమూల పురుషు నాత్మపితగ నెంచి
పౌరుషేయులైరి బ్రహ్మఋషులు. ౨౦౭

## గో త్ర ఋ షు లు

అట్టి బ్రహ్మఋషులు నైదుగురొక్కొక్క
దిశకు నేగి యైదుదిశల దనరు
ముఖ్యశిల్పి బృందమునకు "శిల్పబ్రాహ్మ
ణు"లన బిరుదొసంగి నిలిపి మరియు. ౨౦౮

ఎవ్వరేదిశలకు నేగిరో యవ్వారి
పేర గోత్రములను బెట్టినారు
ఐదుదిశలనున్న యైదుసంఘములకు
నైదుగురగు సానగాది ఋషులు. ౨౦౯

ఐదుసంఘములకు నైదువేదంబులు
నైదుసూత్రములను నైదుశాఖ
లైదు గోత్రములఁ బ్రసాదించి నిల్పితా
మాది గోత్రఋషులు నైయెసఁగి. ౨౧౦

శిష్యసంఘమందు శిల్పాగ్రగణ్యులౌ
దేశసేవకులగు ధీయుతులను
నెంచి నిల్పిరిట్లు * పంచవింశత్యుత్త
రశత గోత్రసంఖ్య బ్రహ్మఋషుల. ౨౧౧

* దేవలోకమునకు దక్షిణమునసున్న మానవ లోకంబునం దైదుదీవుల యందు ననేక కర్మశాలలు స్థాపించి యందు బాలించు కర్మశాల శిల్పులగు శిల్పిసంఘమునకు పంచఋషులు తమ నామములనే గోత్రనామంబులు గా ప్రసాదించి తామైదుగురును, శిల్పిబ్రాహ్మణుల కాదిమగోత్ర ఋషులై విలసిల్లిరి.

మరియు దేవలోకమున క్రమముగా ఋషులుగను, బ్రహ్మలుగను, మూర్తులుగను రూపొందె మానవుల నుద్ధరింప నేతెంచిన శిల్పాగ్రగణ్యులలో యోగసిద్ధులకు బ్రహ్మర్షి పదవుల నొసంగి గోత్ర ఋషులుగా గూడ నొసర్చిరి.

మొదట తామైదుగురును, పిదప యిరువదైదుగురును, పిమ్మట నూట యిరువదైదుగుర సంఖ్యవరకు గోత్రఋషులను పెంపొందింప జేసిరి. ఇంకను ప్రవర ఋషు లనేకు లేర్పడిరి.

వీరి యవతరణమును, సృష్టిపరిణామవృద్ధి విధానమును, మొదలైనవి మహాప్రపంచ సృష్టివిధానము ననుసరించి యేర్పడినవైనట్లు తోచుచున్నది. ఎట్లన_ ప్రపంచ సృష్టికి మొదటగా పంచభూతములును, అవి యిరువదైదు సంఖ్యగను, పిమ్మట నూటయిరువదైదుగను, పిదప సహస్రంబుగాను విలసిల్లెను. అవి — నూటయిరువదైదు సూక్ష్మదళంబులుగల యొకస్థూలదళంబును, అట్టివి యెనిమిది దళంబులుగల యొకపద్మముగను, అది సహస్రారమను నాని కాసనమునై జగచ్ఛిల్ప సామ్రాజ్యపాలనాధికారిగా దాని ప్రాభవంబున నెలయు విశ్వకృతులు సహస్రముఖంబుల వెలుంగుచుండును. అనగా, ఒక్కొక్క దానికి నూట యిరువదైదు అంతరదళంబుల చొప్పున నెనిమిదింటికైన దళంబులసంఖ్య సహస్ర మగుటచేత నాఅష్టదళపద్మము సహస్రారమనియు పేరుపొందెను.

మొదట సానగాని పంచఋషులును, వారిచే నిరువదైదుగురును, పిమ్మట నూట యిరువదైదుగుర సంఖ్యవరకు శిల్పమహర్షులు వృద్ధిపొంది వారివలన జగదుద్ధరణ కొరకు జగదుపకరణ శిల్పసామ్రాజ్యము స్థాపింపబడి పాలింపబడుచుండ దాని ప్రాభవమ్మున వెలయు శిల్పకృతులు సహస్రముఖంబుల వెలుంగుచుండును.

ఇకారణమున జగచ్ఛిల్పి యాజ్ఞను పంచభూతంబులచే నేర్పడిన జగచ్ఛిల్పసామ్రాజ్యమునకును, జగదుపకరణ శిల్పులగు పంచఋషులచేత నేర్పడిన జగదుపకరణ శిల్పసామ్రాజ్యమునకును, సంబంధమేర్పడి యున్నది. . . .

వేదములనెసంగు వివిధ సూత్రంబుల
వెన్నిగలవో వాని కన్నిటికిని
ధర్మ, కావ్య, శిల్ప, తత్త్వ, విజ్ఞాన పు
స్తకముల వ్రాసిరిటు విశాల ఘనతి. ౨౧౨

ఆదిదంపతుల మహాజగచ్ఛిల్పమ్మె
పాంచభౌతికమయి పరగు; దాని
చరితమెల్ల పూర్ణ సారస్వతమ్మైన
పంచకావ్యముల రచించినారు. ౨౧౩

ఆదిదంపతుల మహాకథ నవరసా
స్పద సనాద ప్రణవ భావమగుట
నవరసంబులుఁగల నవకావ్యము లొసర్త్ర
ప్రతిరసంబున నవరసములొలుక. ౨౧౪

వేదశాస్త్రములను విరచించిరిటు నూత్న
భాషసృష్టిసల్పి పంచఋషులు;
వారు దేవతాగ్ర పూరుషులౌట న
వ్వారి భాష దేవభాషయయ్యె. ౨౧౫

---

...దీనినిబట్టి సానగాది పంచఋషులు సృష్టికాలమునందో, అవసరమగు కొంత పిమ్మటి కాలమునందో గాని సృష్టితత్త్వము ననుసరించి యవతరిల్లి రనుట సత్యేతరము కాదు.

ఈ సానగాది నూటయిరువదైదు సంఖ్యగల బ్రహ్మర్షుల నామములు యిప్పటికిని శిల్పిబ్రాహ్మణుల గోత్రనామంబులుగా భాసిల్లుచున్నవి.

— ఋషి, బ్రహ్మ, మూర్తుల కభేదము —

ఋషిపదమ్ముదీర ఋషులైన వారలు
బ్రహ్మపదము నంది బ్రహ్మలయ్యు
మూర్తిపదము నొంది మూర్తులయ్యేద రిట్లు
భేదవృత్తులను నభిన్నులగుచు. ౨౧౬

— మువ్వురు పౌరుషేయులే —

ఆదిమూల పురుషుఁడైన విశ్వబ్రహ్మ
విభుడు జనకుఁడైన విధముఁ దెలిసి
సాంప్రదాయకముగ సంతానముగనైరి
పౌరుషేయులనఁ బ్రపంచకమ్ము. ౨౧౭

మరియు,

శిల్పిగణమునన్ విశిష్టు లిట్టుల *ఋషి
పంచకముగ, బ్రహ్మపంచకముగ,
మూర్తిపంచకముగ, ముదమున నేలుచు
గ్రాలుచుందు రిటు పరంపరలుగ. ౨౧౮

---

* ఋషిపంచకమన! సానగ, సనాతన, ఆహభూన, ప్రత్న, సుపర్ణు లనువారు. బ్రహ్మపంచకమన! మనుబ్రహ్మ, మయబ్రహ్మ, త్వష్టృబ్రహ్మ, దైవజ్ఞ బ్రహ్మ, విశ్వజ్ఞబ్రహ్మ లనువారు. మూర్తిపంచకమన, బ్రహ్మ, విష్ణు, శివ, ఇంద్ర, సూర్య లనువారు. బ్రహ్మలే మూర్తులైనట్లు శ్రీస్కాందపురాణ నాగర ఖండ విశ్వకర్మోపాఖ్యానమునందు చెప్పఁబడియున్నది.

## పంచ బ్రహ్మలు

మనుమయాది లోకమాన్యులౌ బ్రహ్మలు
పంచ దిశల యందు పంచ వర్ణ
శైల శిలలచే ప్రశస్తినిఁ దమ పేర
పంచ నగరముల సృజించినారు. ౨౧౯

మనువిధాతపేర *మనుశిలానగరమ్ము
మయ శిలానగరము మయునిపేర
త్వష్ట్రధాతపేరఁ ద్వష్ట్ర శిలానగ
రములు నిల్పి రివ్విధమున నైదు. ౨౨౦

---

* ఉన్నత విద్యల నుత్తీర్ణులై పంచాశ్రేయ పదము దీరిన వారికి, నింక నుత్తమోన్నత విద్యాభ్యాసమునకైన విద్యాపీఠంబుల స్థాపించుటకు నిర్మింపఁ బడిన పంచవర్ణ శిలామయములగు మనుశిలానగరము, మయశిలానగరము, త్వష్ట్ర శిలానగరము, దైవజ్ఞ శిలానగరము, విశ్వజ్ఞశిలానగరము లైదెంటియందును పంచ బ్రహ్మల నామములుగల విశ్వవిద్యాలయము లైదును విరాజిల్లెను. అవి విజ్ఞాన కేంద్రములుగా నుండుటయేకాక మానవాభ్యున్నతికను నాధ్యాత్మికారోగ్యము లకు వలయు యోగసాధనములను ప్రసాదింపఁగలిగి యుండెడివి.

అజనాభదేశమునగల విశ్వవిద్యాలయములకు సకల దేశములవారు విద్యార్థులుగఁ బ్రవేశించి సకలవిద్యల నుచితముగ నభ్యసింపుచుందురు. అందు ముఖ్యముగా, చైనా, జపాను దేశముల విద్యార్థు లమితము.

అవి పంచర్షి మండలమువారి ఆధ్వర్యమున సూర్యవంశపు రాజులచేఁ బోషింపఁ బడుచుండెను. అందుపాధ్యాయులు పంచవేదతత్త్వరహస్యములను కర్మకౌశలమున నిమిడ్చి బోధింపుచుందురు.

మన అజనాభదేశమునగల విశ్వవిద్యాలయము లైదును జీర్ణావశిష్ట చిహ్నములచే పరిశోధనాశాఖవారి పుణ్యమున తక్షశిల పంజాబు దేశము

అట్లొనర్చిన భువ నాదర్శములగు నా
పంచ పురములందు పంచవిధుల
విశ్వవిద్య లొసఁగ విశ్వవిద్యాలయ
సంస్థలను ప్రతిష్ఠ సలిపినారు. ౨-౨౧

సందునను, నాలంద, బీహారు దేశమునందునను బయల్పడినవి ఇంకను కొన్ని బయల్పడవలసి యున్నవి.

వ్యాప్తప్రసిద్ధము రూపాంతరమున తక్షశిలయన నొప్పు. నాలందావిద్యా విహారము మున్ను తక్షశిలానగరమై యుండినదన్నను. విద్యాలయములుకూడ తన్నగరముల పేరిటనే వెలసియుండును. అవి కాలాంతరమున సూర్యవంశము వారికి గర్భశత్రువులుగా నవతరిల్లిన చంద్రవంశపు రాజులచే నాశనమొనరింపఁ బడఁగా వాని నామములుకూడ వానిలోనే లీనమై పోయెను.

— నాలంద నామము —

మహాయాన హీనయాన ప్రబోధములు గాంధారమునందు సాగస్వాప్రధాన వ్యాప్తికి నడ్డులేనివాఁడగుటచే నతనికి నాలందుఁడను నామముగలిగెను. (న-అలం-ద. ఇచ్చుటలో నాపుదల లేనివాఁడు) అతఁడు బీహారుదేశమున శిలాపథములోనున్న తక్షశిలానగర విశ్వవిద్యాలయమును పునరుద్ధరింపనెంచి అప్పటి బౌద్ధమతావలంబియగు అశోకమహాచక్రవర్తి పూనికచేఁ గావలసిన కట్టడములను, విహారగోష్ఠ విహారములను, నిర్మింపఁజేసి అందు వేనవేలు విద్యార్థుల కంతులేని విద్యాదాన మొనర్చి దేశదేశముల బహుళవ్యాప్తి గాంచెను. అప్పటినుండి తక్షశిలానగర విశ్వవిద్యాలయము నాలందా విహారముగా వాడుకలోనికి వచ్చినట్లు తెలియ బడుచున్నది.

మరియు ఉత్తర మగధ దేశమునందలి గంగాతీరమున నొక పర్వతము నందు బౌద్ధమత శత్రువులగు శంకర మతానుచరులు అప్పటి దేశాధీశుఁడగు ధర్మపాలుని సాయమున విక్రమశిలావిహారమును నిర్మించుకొని అందు వసించుచు తమ రాజబలంబున నాలందవిహారమునుకూడ వశపరచుకొని శంకర మత ప్రచారము సాగించుచుండిరి. పిమ్మట మహమ్మదీయుల దాడివలన విక్రమ శిలావిహారము నాశమగుటయె గాక బ్రాహ్మణ ప్రచారకులును నాశమొందిరి.

ఆత్మసౌఖ్య మొంద నాధ్యాత్మికారోగ్య
ముల నొసంగు కర్మములకు సూత్ర
కారికలను గూర్చి గ్రంథా లొనర్చిరి
పంచశాలలందు పఠనకొరకు. ౧౧౨

పంచమూర్తులు

పంచదేశములకు పంచమూర్తులుపోయి
పంచసూత్రముల ప్రభావములను
వేదవిధుల విశ్వవిద్యాలయమ్ముల
కరుగుచుండి బోధ జరుపుచుండ్రు. ౧౧౩

ఋషులు - గోత్ర కర్తలు

పంచఋషులు మొదట పంచవింశత్యుత్త
ర శతగోత్రములను క్రమవిశిష్ట
శిల్పివరుల కొసగి శీల ప్రవక్తల
గా నొనర్చి గోత్రకర్త లైరి. ౧౧౪

బ్రహ్మలు - సూత్రకర్తలు.

జన్మసఫల మొందు సాధనంబులు, నిత్య
కర్మ సూత్ర కారి కల విధించి,
శిల్పితతిని దేశసేవకులుగఁ జేసి
రగుట సూత్రకర్త లైరి వారు. ౧౧౫

## మూర్తులు - మతకర్తలు.

ఆది పంచమూర్తు లాచరణలఁ దెల్పు
పంచ మతగతుల విధించి శిల్పి
తతిని పంచదేశ మతబోధ సేవకుల్
గా నొనర్పగ మతకర్తలైరి. ౧౧౬

ఆదిమూర్తుల పనులైదింటికి మతంబు
లైదొనర్చి మతరహస్యములను
తెలిపి శిల్పితతిని నిల మతోద్ధారకుల్
గా నొనర్పగ మతకర్తలైరి. ౧౧౭

## దేవేంద్రుడు.

దేవలోకవిభుఁడు దేశోద్ధరణ కగు
శిల్పపరికరముల సల్పుచుండి
వానిఁ బంపుచుండు మానవావని, కర్మ
శాలలకును పాఠశాలలకును. ౧౧౮

## ఆర్షేయులు.

పంచఋషుల పేర పంచగోత్రంబులు
సంతరింప శిష్య సంప్రదాయ
మగ్రసంతతిగను నార్షేయులైరి వి
శిష్టకర్మలొంది శిల్పిగణము. ౧౧౯

పంచఋషుల కిటు లపత్యంబునయి ఋషీం
ద్రాజ్ఞలెల్ల శిరములందు దాల్చి

యాచరించు శిల్పులౌట పంచార్షేయు
లంచు కీర్తి నిల వహించినారు. ౨౩౦

## బ్రాహ్మణులు

ఆది విశ్వశిల్పి యజుని జగత్సృష్టి
ననుకరించు శిల్పు లౌటఁ జేసి
బ్రహ్మ కగ్రజాత బ్రాహ్మణులన వారు
పిలువఁ బడుదు రద్ది బిరుదనంగ. ౨౩౧

## వారి విశిష్టత

అల మదికి నతీత మద్వైత తత్త్వమ్ము
మానసమున నెంచఁ బూనఁ బోరు
ఆది దంపతుల మహానంద మునను ని
ష్కామ పూజ లెపుడు సల్పుచుంద్రు. ౨౩౨

ఆది తత్త్వ మేక మభిలషింపఁగ లేరు
ఆదిదంపతుల సమర్చ లందఁ;
స్వార్థ మైన పనులఁ జల్పఁ బూనగ లేరు
సోదర ప్రపంచ శోభ నంద. ౨౩౩

జన్మ రహితమగు ప్రసక్తి నొందఁగలేరు
జన్మగతి పరీక్ష సల్పుచుంట;
కర్మ రహిత పదవి కాంక్షింపఁగాఁ బోరు
బ్రహ్మకర్మ లంది పరగుచుంట. ౨౩౪

కామ్యకర్మములను గావింపఁబోరు; ని
ష్కామ కర్మములనుఁ గరమొనర్చి,
ప్రజల జీవనమున పనుల నొనర్తురు
దేశభాగ్యశోభఁ దీర్పఁగోరి. ౨౩౫

బ్రహ్మమైతి మంచుఁ బల్కఁబూనరుగాని
బ్రహ్మసుతుల మంచుఁ బల్కుచుండి
బ్రహ్మయంత తాము పరిగణింపంబడ
బ్రహ్మచర్య మంది పరగుచుంద్రు. ౨౩౬

కన్నతండ్రి నిత్యకర్మిష్ఠుడై యుండి
సకల భువన సృష్టి సల్పుచుంట
దానిఁ గోరఁబోరు తమ తండ్రికే లేని
కర్మరహితపదము గాంచ మనుచు. ౨౩౭

బ్రహ్మశిల్పి సల్పె బ్రహ్మాండ పిండాండ
ములును రెండు దేహమున నమర్చి
బ్రహ్మనెలవు గాఁగ బ్రహ్మాండమందు పిం
డాండమందు జీవు డర్చఁ జేయు. ౨౩౮

పరమచేతనముల బ్రహ్మాలయమ్ములు
దేహనగరు లందె తేజరిల్ల
బాహ్యమందు వేరె బ్రహ్మాలయంబులు
కఠిన శిలలచేతఁ గట్టఁబోరు. ౨౩౯

## జనకుఁ గూర్చి

జనకు బాహ్యపూజ సల్పఁ బూనకుగాని
చారుపత్ర పుష్ప చయముతోడ;
సత్యరూపుడౌట జనకు పూజలొనర్తు
సత్యవచన పుష్ప చయముతోడ. ౨౮౦

## జననిఁ గూర్చి

* తనువు లన్నములును దమ కాదియగా జగ
న్మాతసొత్తు లౌట మది నిమిత్త
మాత్రులుగను దారు మాతృ పూజల నన్న
మర్పణం బొనర్చి యారగింత్రు ౨౮౧

* ఆదిమ దంపతులచే సమిష్టిభావమున వ్యష్టిరూపములుగల సమస్త దంపతులును సృష్టింపఁబడుదురు. అందు వ్యష్టిజనని గర్భమున వ్యష్టిపిండము ధరింపబడి తన వ్యష్టిదేహరక్తమున వృద్ధిపొందగా వ్యష్టిజీవతనువులను గాంచుచుండును.

దానికి నాకలియను రోగ ముండును. దాని కన్నమౌషధ మగును. ఆ యౌషధమును ఆదిమజనని యన్నట్లను భూజనని నిర్మించుచుండును. అందుచేత తన నిలయమైన దేహమును, నౌషధమగు అన్నమును గూడ మాతృసంబంధములే యగును. తాను పితృసంబంధము గలవాడయ్యును, దేహమునకును, తనకును పూర్వసంస్కారమువలన గలిగిన సంయోగమనియు, అందు తా నివసించుట నిమిత్తమాత్ర మనియు, దేహాన్నములు రెండును తనవి కావనియు, రుచుల కోరని పథ్యముతో నిష్కామమార్గాన లభించిన ఔషధాన్నమును సంతుష్టిచే నారగింపవలెను.

జీవు డాస్థితి బొందుటకు జగన్మాతయగు గాయత్రీదేవి కరుణకు పాత్రుఁడు గావలెను. అందుకు నాల్గవదేహమగు హిరణ్మయకోశమును లక్షించ

భక్తి వాడిజనని బాహ్యపూజలొనర్తు
రనుభవంబుఁ గలుగ ననుదినమ్ము;
అనుభవంబుఁ గలిగి యాత్మపూజలొనర్తు
రాది జనకుఁగూర్చి యనవరతము. ౨౮౨

వలెను. తల్లక్ష్యమునకు బాహ్యమందు స్థూలరూప మాతృదేవీవిగ్రహమును నిర్మించుకొని బాహ్యపూజలచేత నంతర్లక్ష్య మలవరించుకొన వలెను. అందున దేహాభిమానము లేనివాడై మాతృదేవి స్థూలాన్నమును, స్థూలమాతృదేహికే నివేదించి మాతృదేవిదైన స్థూలదేహముచేతనే యారగింపఁ జేయవలెను.

అందుచే దేహాభిమానశూన్యుడగు సేవకుల నిష్కాముడిగాను, రుచులఁ గోరక లభ్యమగుదాని సేవనవలన తృప్తినొందినవాఁడుగను. మాతృనివేదితాన్న సేవనవలన మాతృపూజాతత్పరుడుగ నగుటయేకాక ఆమాతృనివేదిత సేవితాన్నము మాతృజ్ఞానమయ రసముగాను, మాతృజ్ఞానమయ రక్తముగాను, మాతృజ్ఞానమయ వీర్యముగాను, ఇంకనది కేవలజ్ఞానమయ మేధస్సుగానుసిద్ధమై అందుండి సచ్చిష్టి రూపమగు మాతృజ్ఞానము వెలువడుచుండును. అగ్ని జీవస్థానమగు ఆజ్ఞేయమను తపోలోకమున జీవుని నెడబాయనట్టి తోడునీడగా నుండు మనస్సునకు తాకి సత్సంకల్పములకైన అంతఃకరణశుద్ధి గలిగించి, జిహ్వేంద్రియంబుఁదాకి సత్యవచనములఁ బల్కింపనైన (వాక్సిద్ధి) జ్ఞానేంద్రియశుద్ధిఁ గలిగించి, స్థూలాంగముందాకి సత్కర్మ లొనర్పనైన కర్మేంద్రియశుద్ధి (కాయశుద్ధి) గల్గింప జీవుండిట్లు త్రికరణ శుద్ధిఁ గలవాఁ డగుచున్నాఁడు.

ఇందు మాత్రర్చనమున మాతృదేవికిని, సత్యవాక్పాలనమున పితృదేవునకును, అనగా, ఆదిమ దంపతులకు పూజలనొనర్చినవాఁడే యగుచున్నాఁడు. మూడవదగు కాయసిద్ధిచే నొనర్చిన సత్కర్మలవలన స్థూలరూపవ్యాప్తిచే ప్రపంచమున నాదర్శమైన సహకారసంఘము లేర్పడుటకు మూలమగును.

నీవున్న దేహముగాని, నీచే భుజింపఁబడు అన్నముగానీ నీనిర్మాణములు గాజాలవు. నీవందుఁ బ్రవేశించిన మాత్రమున నాదేహమనియు, నాఅన్నమనియు నహంభావముఁ జూపినచో మాతృసంబంధములై దేహాంతర్గతముగా నుండు

ఆదిదంపతుల సమర్చనార్హత నొంద
నంతరింద్రియంబు లమలశౌచ
భావ మొందె వెలుగ బ్రాహ్మీముహూర్తాన
* ధ్యాననిష్ఠ నుండు మనుదినమ్ము. ౨౮౩

---

నింద్రియాదులచే నష్టకష్టములు పొందవు. ఎట్లన, చెదలు పెట్టుకొన్న పుట్టలో సర్పము జొరబడి పుట్టనాక్రమించుకొనియు, నిండెక్కి దండెత్తదనియు, వైరమున నహంభావము జూపినయెడ కాలవశమున నాచెమగాని చలిచీమలుగాని అందు ప్రవేశించినపుడు అవన్నియు నేకీభవించి సర్పమును తుదముట్టించినట్లు మాతృ సంబంధమగు దేహము, అన్నము, నింద్రియాదులు నావి నావి యను అహం భావముచే మాతృమర్యాదకు భిన్నముగా వర్తించి మాతృద్రోహ మొనరించి నచో మాతృసంబంధీయులగు మాత్రుక్షీణమగుగల యింద్రియాదులెల్ల నేకీభవించి నవై పైసర్పముగతినే పట్టింపగలవు.

మనుష్యుడు మనస్సు గలవాడగుటచే వాని కాపేరు గల్గెను. మనస్సు నకు సంకల్ప వికల్పములను రెండు గుణము లుండును. వానియందు సమస్త కర్మలును తాండవ మాడుచుండును. ఆ కర్మలను ప్రేరేపించునట్టి కర్తయొక డుండును. అతడు సర్వసాక్షియగు ద్రష్ట. అతని స్థానము అన్నిటికిని మధ్య దగును. పిండాండమగు వ్యష్టిదేహమున సమిష్టిభావమగు బ్రహ్మాండమనే నుత్తమాంగమున మధ్యస్థానమగును. అది దేవస్థానమగుటచే దేవాలయమన్నను చెల్లును. అది మాతృస్వరూపమగు హిరణ్మయకోశ మగును. అది మేధస్సున కాధారమగును. మేధస్సు జీవుని నిరంతరవర్తనము ననుసరించి యేర్పడుచుండును. అందుండి జీవునిస్థితి మాతృపదమగు నిరహంకారమువైన పారమార్థిక కర్మలకును, భార్యాపదమగు సాహంకారమువైన ఐహికకర్మలకును, మూలమువైన తెలువులు వెలునడుచుండును. ఆ తెలివి వీర్యముచేతను, వీర్యము రక్తముచేతను, రక్త మన్న రసముచేతను, అన్నరస మోషధులచేత నేర్పడును. ఆ ఓషధిపదార్థములు అనేక గుణములతో గూడియున్నను నిష్కామ నిరహంకారముల త్రికరణైక్యభావంబున హిరణ్మయకోశరూపిణి యగు అంతర్మాతృ పూజానివేదనలొనర్చిన సత్సం కల్పమహిమచే నాపదార్థములు తమ నిజగుణంబుల విడుచుచుండుటయేకాక పార

స్థావరంబులైన జంగమంబులు నైన
విగ్రహములఁ జల్పు విశ్వశిల్పి;
విశ్వశిల్పిసుతులు వెలయింతురు శిలాది
వివిధరూపములగు విగ్రహములు. ౨౮౪

## దేశము

అఖిల దేశములకు నాదర్శమైయొప్పి,
అఖిల పరికరముల నంద జేసి,
యాదరించునట్టి యజనాభ దేశమ్మె
దేశముల మతల్లి దేశమయ్యె. ౨౮౫

---

మార్థికమగు తెలువుల గలిగించు మేధస్సు గూర్చునట్టి అన్నరసముగా సిద్ధము గాగలవు.

అంతరింద్రియములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములగు నీమూడును పారమార్థిక మార్గలక్ష్యంబైన నేకాగ్రతతో సిద్ధిమొనర్చుకొన్న సదార్థముల అహింసాత్మకమగు నేతపోగుణ ప్రధానమైనను సాత్వికములుగా మారిపోయి యోగసిద్ధికైన కాయసిద్ధి నొందింపగలవు. అంతియేగాక అన్నరసము మొదలు వీర్యము వరకును మార్చి సమిష్టి జ్ఞానమయముగా జేసి తత్ప్రజ్ఞానమయమగు మెదడునుగూడ గల్పించును. అట్టి మెదడుగలవా డెపుడును దేశోపకారియగు కారణజన్ముడుగా నవతరిల్లుచుండును.

అందుచేతనే కర్మవిదులు దేవతానివేదన చేయని ప్రసాదము సంగీకరింపరు. ఇంక దాని నుచ్ఛిష్ట సమానమని గూడ బల్కుదురు.

(ప. ౨౮౩.) * బ్రాహ్మీముహూర్తమనియు, ప్రబోధసమయ మనియు, సంధ్యాకాలమనియు, మున్నగు పేర్లచే నొప్పి నాలుగు ఘడియలలోపల వర్జ్యమెట్లో, రాత్రికి నాల్గవయామమం దెపుడో యిదియ వెలుగుచుండును. దానిని తెలిసికొనుటకే యోగులు తపించుచుందురు. అది రాత్రికి పగటికని, నిద్రాజాగ్రత్తులకును, కర్మాకర్మలకును, కాలము కాలమునకును, మధ్యదగుటచే

పుణ్యజను లొనర్చు పుణ్యకర్మలచేత
పుణ్యభూమి యయ్యె భూమి మాత;
ధర్మశిష్ట శిల్పకర్మ శాలలు గ్రాల
భూమి మాత కర్మభూమి యయ్యె. ౨౪౮

## ప్రజలు

కొలదిపాటిభూమి కలవారలింద్రునిఁ
బిలువఁబోరు మేఘజలము వోలె;
భూమిలోని జలము భూమిపై వర్షించు
యంత్రములను సంగ్రహింత్రు జలము. ౨౪౯

---

వానిని సంధియందురు. ఆసంధిని దెలిసి కర్మిష్ఠులు సంధ్యావందన మొనర్తురు. కనుక దానిని సంధ్యాకాలమనియు, నేకాలము, ఏకర్మయు, నేయవస్థయు, కాని దగుటచే దానియందు యోగులు ఆత్మబోధ నొందుచుందురు. కనుక దానిని ప్రబోధ సమయ మనియు, దేనికిని నంటనిదై అన్నిటి కతీతమై బ్రహ్మ సంబంధ మగుటచే జ్ఞాను లందు బ్రహ్మానంద మొందుచుందురు. కనుక దానిని బ్రాహ్మీముహూర్త మనియుఁ జెప్పుదురు. అద్దానిఁ దెలిసికొనుటకు ముందుగా నంతశ్శౌచము ముఖ్యమగుటచే అందుకు నిత్యమా ముహూర్తమున ధ్యాన మొనరించుచుందురు. అంతశ్శౌచము ధ్యానముచేతనే గల్గును. ఎట్లన, ముఖము నందున్న జ్ఞానేంద్రియ గోళకముల మలములను నిత్యమాచరించు ముఖమార్జన మూలమున విసర్జించి శుభ్రపరచు కొనుటచేతను, కర్మేంద్రియ గోళకంబు లందున్న మలమూత్రాదుల విసర్జించి శుభ్రపరచుకొనుటచేతను, ఇంక సర్వాంగ మును బహిస్స్నానరూపమున శుభ్రపరచుకొనుటచేతను, మనస్సంతుష్టి లగు చుండుట అనుభవైకవేద్యము. అట్లే అంతరింద్రియములగు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు, వీనికి క్రమముగా గల్గుచుండు దుస్సంకల్పము, దుర్నిశ్చయము, దుశ్చింతనము, దురహంకారములను మలంబులు విసర్జింపఁబడి అంతఃకరణశుద్ధి గల్గుటకొఱకు బ్రాహ్మీముహూర్తమున ధ్యాననిష్ఠాపరిష్ఠులై ఆత్మసంతుష్టు లగుచుందురు.

అవనిజనులు నిత్య మాధ్యాత్మికాలౌక్య
ములును, సాత్మ సౌఖ్యములును – అనుభ
వించుచుండిరట్టి పంచర్షి మండల
పౌరసేయుల పరిపాలనమున. ౨౪౮

ఇట్లు

నిత్యవర్తనమున నిఖిల సౌకర్యాలు
సత్య, ధర్మ, శీల, సంపదలునుఁ
గలిగియుండ ప్రకృతి గని సర్వకాలమ్ము
నొక్క రీతినుండి యోర్వఁగలదె! ౨౪౯

మొదట సృష్టియందె యుదయ సాయములుఁగ,
సంధికాలములుగ, జాములుగను,
రేలునుం బవళులు, కృష్ణ శుక్లంబులు,
ఋతువులుగను, భేదగతులఁజూప. ౨౫౦

ఏకవర్షమంద యిన్నిమార్పులఁ జూపి
గ్రాలుప్రకృతి యుగయుగాల మార్పుఁ
జేయలేదె? ఇంకఁ జేయదే? కలియందు
కలికి శక్తిదోష కలితయగుచు॥ ౨౫౧

సుమతి యగుచు తల్లి సుజనుల సృష్టించి
సత్యపోషణమ్ము సల్పి యవల
కుమతి యగుచు నాపె కుజనుల సృష్టించి
సత్యపరులనెల్ల సమయఁజేయు॥ ౨౫౨

## యుగవర్తనములు

శ్రీ మహాప్రపంచ సృష్టియందా విశ్వ
కర్మ నిర్మితము సమర్మ జగము
ఒక విధముగ నుండదొగి కాలచక్రమ్ము
వివిధగతులఁ దిరిగి వెలయుచుండు. ౨౫౩

తొలియుగాన నాల్గు గలిగిన పాదముల్
త్రేతయందుఁ దనరు త్రిపదములుగ
ద్వాపరమ్మునందు ధర్మ మధర్మముల్
రెండు సమముగాఁగ నుండునుసుమి. ౨౫౪

కలియుగంబు దోష కలితమౌట నొకండు
పాదముండు సత్యపాటవమ్ము;
కలియుగం బసత్య బలముఁగల్గినదాటఁ
దారుమారు చరిత తనరుచుండు॥ ౨౫౫

* ఐదవదియుఁగాఁగ అభిభూయుగము నుండు
సంధికాల మనగ సంజ్ఞఁ గలిగి;
తొలియుగాన జరుగఁగల సత్యధర్మముల్
నడుప మార్గముల నొసర్చ ననగ. ౨౫౬

---

* ఐదవయుగము అభిభూయుగమను పేరుతో నున్నటుల యజుర్వేద మిట్లు పల్కుచున్నది.

“ ఊర్ధ్వాది శాగ్ం హేమంత శిశిరావృతూనాం బృహస్పతి ర్దేవతా వర్చోద్రవిణం త్రిణవస్తోమః స ఉత్రయస్త్రింగ్ంశ వర్తనిః పష్టవాడ్వయో ఽభిభూరయానాం విష్వగ్వాతో వాతః సుపర్ణ ఋషిః” ... ...

ఆదినుండి ద్వాపరాంతమ్ము వరకిట్లు
క్రమవిధాన జరిగెఁగాని చరిత
మరియు నంతనుండి యవతరిల్లి చెలంగు
చరిత ఘోర విషయము భరియింపనగును. ౨౫౭

సకల దేశములను సాకెఁడు నజనాభ
దేశమున నెసంగు దేవలోక
సార్వభౌము శిల్ప సామ్రాజ్యమందు ను
ద్యోగులుంద్రు శిల్పయోగివరులు. ౨౫౮

♦కలి మహాదేవి

అది మహోగ్ర విపిన మందుండి మత్తే భ
యానయై దివమ్ము కరుగ నచటి
కల్ప శిల్పకృతి జగచ్ఛిల్పకృతిఁ బోలి
యుండి కన్పడ, దల నూపి యూపి॥ ౨౫౯

... "ప్రాచిదిశాం వసంత ఋతూనాం" మొదలు పై మంత్రము వరకు ఐదు మంత్రముల యందును నైదు యుగములు నైదుగురు ఋషులు మొదలగు నవి యున్నట్లు యజుర్వేదమునఁ దెలియఁబడు చున్నది.

♦ కలియుగములో నొక్క పాదము మాత్రమే సత్యధర్మములు, జ్ఞానము నుండుటంజేసి మూఢువంతు లజ్ఞానము గల యీ కలిశక్తి నల్లని రూపముగల కాళికగను, కలిమహాదేవిగను ఇచ్చట భావింప బడినది.

"అది మహోగ్ర విపిన మందుండి" యను దానిభావము ముందుఁరాబోవు "సప్తర్షి మండల" మను గ్రంథమున సమగ్రముగఁ జూడనగును.

అమర శిల్పరాజ్ఞి మంపిన నొకఁడైన
నల్పుఁడుండ కుసికి నప్పింపవడి
యున్నతులగు పశ్యకోద్యోగు లంపిన
నుగ్రదృష్టులను బ్రయోగపరచె. ౨౬౦

ఆప్రయుక్త దృష్టు లస్త్ర సహస్రాభ
ముగ వెలింగి భ్రమల ముంచివైవ,
వశ్యుఁడైన యొక్క పశ్యకోద్యోగినిఁ
గాంచి ప్రేమఁజూపి కలికిదేవి. ౨౬౧

పరమ మోదమునను పశ్యకుఁ దరిఁ జేరి
కలికిదేవి నంచు కులికి పలికి
భావి కలినిఁ జరుగఁబోవు కాలజ్ఞాన
చరితనెల్ల వ్రాసి కెరుకఁ బరచె. ౨౬౨

భావిగతి నెరుంగు పశ్యకోద్యోగికి
కలికి తెలిపినట్టి కథ నిజమ్మె;
ఆత్మమార్గ సుప్రయాణ సమాధిలో
ననుభవమున నిశ్చయమని తోఁప. ౨౬౩

పశ్యకుడు

నిత్యమాచరించు నియమిత కర్మముల్
చేయఁబూన బుద్ధి చేరనీదు
భగవతీప్రలబ్ధ భావికాలచరిత్ర
కనుల యెదుటఁబడిన కారణమున. ౨౬౪

## ప త న ము

పశ్యకుండెటువలె వశ్యపుం డయ్యెను?
అలప్రజాపతి యతం డయ్యెనెట్లు?
నూత్న సృష్టికెటు ప్రయత్నించె? నెటు విశ్వ
కర్మబిరుదు నొందగ్గె పతనము? ౨౬౫

ఇంద్రుపైని నెట్టు లీర్ష్య జనించెను?
ఖాండవవనమెట్లు కాలిపోయె?
అమృత భాండమెట్టు లపహృతమయ్యె? నా
లోకమెట్లు జారలోకమయ్యె? ౨౬౬

హింసయజ్ఞముల సహించెను శ్రుతులెట్లు?
శిల్పమాతయెట్లు శిక్షనొందె?
భరతమాతయెట్లు ప్రాకె పుణ్యజగాన
ఎటువతారదశక మేర్పడియెను? ౨౬౭

అర్కవంశమెల్ల హతమయ్యెనెట్టులు?
జంతుహింసలాప జనెడు రాక్ష
సప్రజాళియెట్లు సంహారింపంబడె?
శిల్పరాజ్యమెటు విశీర్ణమయ్యె. ౨౬౮

హింస్రయజ్ఞముల సహింపనొల్లక సర్వ
జీవకరుణ దేశసేవఁ జేసి
మించు పౌరుషేయ పంచర్షిమండల
ప్రాభవమ్మదెట్లు భంగపడియె. ౨౬౯

హింస్రయజ్ఞముల విధించి వేదోక్తముల్
స్వర్గభోగములని చాటి జగతి
శాసనములొనర్చు సప్తర్షి మండల
కల్పనమ్మదెట్లు కాఁ గలిగెను ? ౧౭౦

అజుని నాభిపేరి అజనాభదేశమై
వెలసియుండ నద్ది వీడెనెట్లు ?
భరతరాజుపేర భారతదేశమై
గ్రాలనయ్యె నేమి కారణమున ? ౧౭౧

సూర్యవంశ్యులనగ సుస్థిరరాజులై
వారొనర్చినట్టి పనులవేమి ?
చంద్రవంశ్యులమని జన్మించి రాజులై
వీరొనర్చునట్టి తీరదేమి ? ౧౭౨

కలియుగాదిఁ గలుగు కలుష హింస్రభయంక
రాద్య భారతకథ యైన పిదపఁ
బరగు రెండువేల వర్షంబుల చరిత్ర
నణచిపెట్టు నా రహస్యమేమి ? ౧౭౩

ఇట్టి ప్రశ్నములకు నేర్పరించి సదుత్త
రము లొసంగునట్టి గ్రంథమొండు
జననికృప రచింతు "సప్తర్షి మండల"
మన సమగ్రచరిత మును గడంగి. ౧౭౪

## అస్తమయము

పగటిపనుల శ్రమలు పడుట విశీర్ణ క
రమ్ములు గల శిల్పరాజ్యరవితి
గళితకాంతిఁ జేసి కల్యబ్ధి నిజతమో
ఘనఘనముచేతఁ గప్పివుచ్చె. ౨౭౫

ఆటవెలది బోటులాను నాటకమందు
మేటిపాత్రలొంది నీటుగోటు
లాటలన్న పాటలన్న నాట్యములన్న
నమ్మ కరుణఁ గొనక నరయఁ గలరె! ౨౭౬

— * —

# జగచ్ఛిల్పము

తల్లిదండ్రు లన్న దైవసమానులు
తల్లిదండ్రు లన్న దైవతములు
నగుట వారి పదము లర్చింపగారాదె
అనుదినమ్ము నాత్మ నధికభక్తి. ౧

సకలజగము లొక్క సదనంబుగా జేసి
సదనమందనేక శాల లుంచి
అందు నాత్మసుతుల నాడించు నాదిమ
దంపతులను భక్తి దలపరాదె. ౨

## సృష్టిపరిణామము

ఆత్మబింబమందు నలరి మాయాంశువు
ఆత్మకంతరమున నైక్యమగుచు
బాహ్యమందు వేరు పడుచు నావల సూక్ష్మ
మైన శిశువుగాగ నయ్యె నద్ది. 3

అట్టులైన బిడ్డ యాకలి బాధచే
నేమొ యెక్కియెక్కి యేడ్వసాగె;
జోలపాడి ప్రేమ పాలిచ్చి లాలింప
రాదదేమొ జనని లేదో? యేమొ! ౪

ఇట్టు లేడ్చి యేడ్చి యెట్టకేలకు తన
పుట్టినింటి తలపు పొడమ నంత
వెనుక తిరిగి చూచి వీతశోకమ్మున
సంతసమ్ము నొందె వింతగొలుప. ౫

పుట్టినింటియందు పూర్ణసంతోషాన
కొంతకాలముండి నంత తిరిగి
దిగువ జూడగాని తగిన బాలప్రాయ
మలరి తలపు గలిగె నాటలందు. ౬

భ్రమసెగాని యాడ బాలలు లేమి నే
కాంత ఖేలనమునకైన గోళ
కములు దోచుఁ గందుకములట్లు గాని యే
కందుకమ్ము చేతి కందిరాదు. ౭

విశ్వశిల్ప కృతులు వెలయించి నట్లుండు
పోషణమ్ము జరుగు పోల్కినుండు
అన్ని లయము చేసినట్లుండు చిత్రాన
నందదొకటి చేతి కనుచు బొగులు. ౮

పసితనమ్మునందు పాపనై యేడ్చితి
బాలనగుచు క్రీడ లీల లొంది;
గోళకములతోడ ఖేలనం బొనరింప
జాలనైతి వట్టి బేలనైతి. ౯

ఇట్లు లోఁచుటకు నదేమి హేతువో! యిట్టి
యూహలేల? తెలియకుండుటేల?
యనుచు దిశలఁగాంచి వెనుకదిశం గాంచ
నన్ని నున్నయయ్యె నమలమయ్యె. ౧౦

తన్నుమరచి యజుని సన్నిధి నానంద
మనుభవించి మరల వెనుకఁ దిరుగ
నంగసౌష్ఠవమున యౌవనవతియైన
కన్యయయ్యె నాత్మ కన్యమగుచు. ౧౧

ఈ యవస్థలేల? యీ యంగసౌష్ఠవం
బేల? యౌవనంబదేల? క్రొత్త
తలఁపులేల? యొక్కతలఁపైన నెరవేర
జాలదేల? యిట్టి లీలలేల? ౧౨

అనుచు నరయుచుండ యౌవనావస్థ పెం
పంతకంత కధికమగుటఁ దన్వి
మోహమావరింప మోహాంధయై మున్ను
మురియు జన్మభూమి మరపు చెందె. ౧౩

మోహనాంగి యగుచు మోహనాకారుని
దలచి జిలుగు వలపు తలపు చెలువు
లనెడు పరికరముల నమరిచి వీణను
ప్రణయగీతి పాడ భ్రమసె గాని. ౧౪

వీణరచనకైన వివిధోపకరణంబు
లనెడు వలపు తలపు లవ్వి యొకట
నిలువజాలకుండ పలుమార్గముల వెంట
బరుగులెత్త వానిఁ బడయఁబోదు. ౧౫

నాదమొసఁగనైన నవకమ్ము గలదైన
ప్రణవమద్ది తోఁచి పరగెగాని,
దానితోడ ప్రణయగాన మాలాపింప
వాణిరాదో యేమొ పాడలేదు ౧౬

అమృతసరసి మధ్య నలరు హృత్పద్మాన
భ్రమరసుందరి శ్రుతిఁ బట్టివేయఁ
బతినిఁ బిల్వనెంచి పంచమస్వరమెత్తి
పాడఁదలచెగాని పాడలేదు. ౧౭

ప్రణయరత్నఖచిత కనకసౌధాంతరై
కాంతగోష్ఠిఁ దాను కామలీల
ప్రేమడోలయందు ప్రియతము నూపంగ
దలచెగాని యేది సలుపలేదు. ౧౮

కన్నె చిన్నెలొలుకు వెన్నెలకాంతులు,
విరిశరముల బారు, విరులసౌరు,
క్రొత్త ఋతువుసొంపు, కోకిలధ్వని యింపు
ప్రణయవీధి దోచు భ్రాంతిముంప. ౧౯

ఏకరూపమున ననేకరూపమ్ములు
నేకవాంఛయుం దనేక వాంఛ
లేక శబ్దమున ననేక శబ్దంబులై
ప్రణయవీథిఁ దోచు భ్రాంతిముంప. ౨౦

అణు మహాత్స్వరూప మగు చిత్రవిపినంబు,
కాముకల్పవృక్ష ప్రేమలతల
మోహపుష్పజాతి ముఖమందహాసముల్
ప్రణయవీథి దోచు భ్రాంతిముంప. ౨౧

చిద్విలాసమైన శృంగాట మందున
అమృతసరసియుండు, నందు తరగ
లల్లనల్ల దన్ను నర్థిబిల్చిన యట్లు
ప్రణయవీథిఁ దోచు భ్రాంతిముంప. ౨౨

అల సరోవరమున నష్టవర్ణంబుల
పద్మమున్నయట్లు, పరమ హంసి
యగుచు సరసి దాను ఆటలాడినయట్లు
ప్రణయవీథిఁ దోచు భ్రాంతిముంప. ౨౩

పద్మమందు గొప్ప పట్టణం బున్నట్లు,
దానినడుమ కోట దనరినట్లు,
లందు ప్రణవసౌధ మమరియుండిన యట్లు
ప్రణయవీథిఁ దోచు భ్రాంతిముంప. ౨౪

అట్టి మేడ తొమ్మిదంతస్తులును, నవ్వి
వర్ణనవశమునను వరలినట్లు,
మర్మశిల్పి వాని నిర్మించి నట్టుల
ప్రణయవీధిఁ దోచు భ్రాంతిముంప. ౧౫

అందుపై హిరణ్మయ ప్రకాశమగు బ్ర
హ్మాసనమ్ము దాని పైనయట్లు,
ఆసనమున బ్రహ్మమాసీనుడైనట్లు
ప్రణయవీధిఁ దోచు భ్రాంతిముంప. ౧౬

భార్యతాను భర్త బ్రహ్మమై యిరువురు
సకల భువన సృష్టి సలిపి నటుల,
రాణి రాజులై స్వారాజ్యమేలిన యట్లు
ప్రణయవీధిఁ దోచు భ్రాంతిముంప. ౧౭

ఇట్టులెన్నొ తలచి యేమి కానక గోర్కు
లన్నిటను విరక్తయై చెలంగి,
మోహనాంగుపైన మోహినియై తాను
నిలిచి యేమొ యిటులఁ దలచుచుండు. ౧౮

కామ భావలతలు కామినిపై బ్రాకి
ప్రేమ పుష్పతతిని విరియఁ, దేని
ద్రావి భ్రమరవిభుడు తన్మయరాగమ్ము
బాడి సుఖమొసంగ రా దదేమొ. ౧౯

కన్నులార విభునిఁ గాంచలేకున్న చో
నిముసమైన నింక నిల్వననుచు,
నాత్మవిభునిగూడి యైక్యమందకయున్న
నొక్క రెప్పకాల మోపననుచు. ౩౦

ప్రేమ విభుని నిట్టు లేమేమొ తలపోసి
యుల్లమందు నవ్వి కల్లయైన
నిజచరిత్ర నరసి నిర్విణ్ణయై తన్మ
యత్వమునను నిస్పృహత్వమొంద. ౩౧

త్రిభూతములు.

మరియు వరుస పురుషు లిరువురు నవ్వారి
వలన పొలతి యొకటి గలిగి నటుల
దోఁచి విభ్రమంబుతోడ దిగ్గునలేచి
మూటిఁగాంచె నవి త్రిభూతములుగ. ౩౨

వారితోడుత సహాకారమ్ము భావించి
యేమిరో యొనర్ప నెంచెఁగాని,
వారు పనికిరాని వారలై జడరూపు
లౌట చింత విస్మయమున నుండ. ౩౩

## త్రి గు ణ ము లు

వారినుండి యిద్దరైరి స్త్రీ పురుషులు
గాని యట్టి జడులు గాఁగ; వారు
పురుషులందు చేరి పురుషులుగా నుంద్రు,
స్త్రీలయందు చేరి స్త్రీలగుదురు. 34

పురుషులందుఁ జేరి పురుషులౌటయె గాక,
పురుషుస్త్రీనిఁ జేసి పొందుచుంద్రు;
స్త్రీనిఁ జేరి తాము స్త్రీలౌటయేగాక
స్త్రీనిఁ బురుషుఁగాఁగ జేయుచుంద్రు. 35

అట్టి యుభయశక్తు లైక్యమందగ నవ్వు
రజమనంగ నొక్క రమణి కలిగె;
త్రిగుణములుగ వానిఁ దిలకించి తా విస్మ
యము విషాదమును భయమ్మునొంద. 36

## త్రి వ ర్ణ ము లు

వారివలన నిక అకార మకారముల్
గలిగి వారలిరువు రలముకొనగఁ

గలిగె నటివ యది ఉకారం బనగ ముగ్గు
రవతరిల్లి రిట్లు "ల, ఉ, మ" లనగ. ౩౭

| | | | |
|---|---|---|---|
| 1<br>అవ్యక్తము<br>పురుషుడు | 2<br>మహత్తు<br>స్త్రీ | 3<br>అహంకారము<br>పురుషుడు | త్రిభూతములు |
| 4<br>సత్వము<br>ద్వంద్వము | 5<br>రజస్సు<br>స్త్రీ | 6<br>తమస్సు<br>ద్వంద్వము | త్రిగుణములు |
| 7<br>అకారము<br>పురుషుడు | 8<br>ఉకారము<br>స్త్రీ | 9<br>మకారము<br>పురుషుడు | త్రివర్ణములు |

1. 3 శక్తు లేకీభవించినచో 2 వ దగు స్త్రీశక్తి కలుగును. 4. 6 శక్తు లేకీభవించినచో 5-వ దగు స్త్రీ శక్తి పుట్టును. 7. 9 శక్తు లేకీభవించినచో 8-వ దగు స్త్రీ శక్తి జనించును. 4. 6 శక్తులు స్త్రీ [illegible], పురుషులుగనుగూడ నుందురు. వీరిద్దఱును జీవునియం దెడబాటు లేక యుండి వానిచే కర్మల నాచరింప జేయు చుందురు. ప్రారబ్ధకర్మము ననుభవింపఁ జేయుపట్ల జీవుని అస్వతంత్రుని, అకర్తను, అధస్థుని జేసి స్త్రీత్వమును గూడ గూర్చి తా మూర్ధ్వస్థులై పురుషులై యుపరతి సల్పుదురు. జీవుఁడాగామికర్మనొనర్చుపట్లజాగరూకుడై మెలగినచో వానినిస్వతంత్రుని,కర్తను ఊర్ధ్వస్థుని, పురుషునిఁ జేసి తాము క్రిందనున్నవారై స్త్రీత్వమును వహింతురు. 5-వ దగు రజోగుణమను స్త్రీ పురుషులగువారి దరిజేరుటకే చూచుచుండును.

మఱియు నీ రజస్సు నవకచక్రమున మధ్యస్థానము నలంకరించినది. భూతపంచకము లో సర్వబీజసృష్టికిని హేతువగు భూమి పంచతన్మాత్రలను తనమధ్య నుంచుకొన్నది. అందు ప్రతిబింబితుడగు బ్రహ్మమూర్తి

అట్టి త్రివిధ త్రికము నౌ నవసంఖ్యచే
ప్రణవ మనగ నద్ది భావిశబ్ద
రాశికసగను నవరాగ మాలాపించె
నాదవాణియై సునాదముగను. ౩౮

ఇట్టి నాదమేల ? యిది బోధపడకుండు
టేల ? అస్వతంత్రతేల ? యనుచు
బొగిలి ప్రాణవిభుని పోడిమిం గనలేని
రమణినైతి నని విరక్తిం జెందె. ౩౯

నిఖిలదృష్టులెల్ల నిలిపి యొక్కటిం జేసి
సకలమైన కోర్కు లొకటిం జేసి
అఖిలబాహ్యచింత లంతర్ముఖమొనర్చి
లక్ష్యముంచె నేక లక్ష్యమందు. ౪౦

---

విశ్వబ్రహ్మ పంచముఖములలో మధ్యమముఖాంశమును బొందినవాడై నవకమధ్యస్థ యగు రజోగుణమను స్త్రీని భార్యగా స్వీకరించి జగత్సృష్టి క్రియను జరుపు చుండును.

1. 3. 7. 9 సంఖ్యల శక్తు లెపుడును పురుషులుగానే యుందురు. 2.5.8 సంఖ్యల శక్తు లెపుడును స్త్రీలుగానే యుందురు. ఈనవకస్వరూపమగు ప్రణవతత్త్వముచేత సృష్ట్యాది పంచకర్మలు జరుగు చుండును. ఈప్రణవతత్త్వముయొక్క పరిపూర్ణభావము శ్రీశంకరాచార్యుల వాదముతో గూడిన " సరసవాణి " అను నా రచిత గ్రంథమున జూడనగును.

అఖిలమును త్యజించి యలసమాధి వహించి
సోకు చింతలను నిరాకరించి
యాత్మరూపు నెంచి యాలింగనమును గా
వించు రుచుల మేళవించి నంత. ౨౧

నీలమేఘుగాంచు నీలకంఠి విధాన,
క్రొత్త ఋతువునందు కోకిలవలె.
చంద్రకాంతి సోకు చంద్రశిలంబోలె,
భానుకాంతి సోకు పద్మిని గతి. ౨౨

అర్క-మండల మ్మనంత విద్యుత్తుచే,
మేఘమండలమ్ము మెరపుచేత,
అగ్ని మండలమ్మనంత తేజముచేత
భాసమానము లగు పగిది తాను. ౨౩.

వెలుగులన్నిటికిని వెలుగయి భాసింప
కారణములకెల్ల కారణమయి
మండలములకెల్ల మహిత హిరణ్మయ
మండలం బనంగ చండరుచుల. ౨౪

అలరుచుండి తాను నన్నింటి మధ్యమ
మగుటం దా నతి విమలాలయమ్ము
కాగ, తాను విశ్వకామినింగాగ నా
బ్రహ్మ కాసనమగు పద్మ మనగ. ౨౫

అమలసలిలపూర్ణ మగు తటాకముపోల్కి,
విమల విశ్వదర్పణము విధాన,
అతిపవిత్ర మగుచు నఖిలావకాశ హృ
త్పుండరీకమై యఖండ మగుచు. ౪౬

అంత విశ్వమోహనాంగియై భర్త్రుసం
ధాన మొంద నర్హమైన యట్టి
తరుణిగాఁ దానఁ బరమాత్మ తేజమ్ము
ప్రత్యగాత్మ యనఁగఁ బ్రతిఫలించె. ౪౭

అంత తానసమస్తమై యనంతమును నై
యాత్మపత్నియై నిజాంగమందె
ఆత్మ నిలిచియుండ నాలింగనమున ని
త్యానుభవసుఖమ్ము నందుకొనియె. ౪

తేజమును వరింప తేజము తనుఁజేర
నొకరు దేహి దేహ మొకరు గాఁగ
ఎపుడు నొకరి కొకరు నెడబాటు లేనట్టి
ఆదిదంపతులుగ నైరి వారు. ౮

ఆదిమూలసృష్టి యవతారపరిణామ
మగణితముగఁ గాంచనయ్యెఁగాని,
వానినెల్ల వ్రాయఁబూనగా లేనైతి
జననియానచే విచారమణగి.

## దంపతులు

ఆదిదంపతుల సమైక్య గాఢప్రేమ
క్రీడలయ్యె విశ్వసృష్టికెల్ల
ప్రథమములుగ; నట్టి ప్రణవధ్వనులచే ప్ర
పంచసృష్టిసల్ప నెంచిరిట్లు. ౫౧

## పంచభూతములు

అట్టి ప్రణవతత్వమందున తన్మాత్ర
పంచకమ్ము నేర్పరించి దాని
యందు గగన, మనిల, మనల, మంబువిలనన్,
పంచభూతముల సృజించినారు. ౫౨

## పంచమూర్తులు

పంచభూతములను ప్రత్యగాత్మచ్ఛాయ
లలరి ప్రతిఫలింప నవ్వి మూర్తి
పంచకమగు, నట్టి పంచమూర్తులు, పంచ
కర్మ లేలుదురు జగమ్ము నడుప. ౫౩

## బ్రహ్మాండము

ప్రథమమం దఖండ బ్రహ్మాండయంత్రమ్ముఁ
జలిపె కాలగతులు దెలుపఁగలుగ,
వేగ్రగహాలుదిరుగు విద్యుత్తుచేత మ
హత్తరంబగు గడియార మనగ.

## ఈశ్వరసృష్టి

అమలమాయయనగ, నందధిష్ఠాన చై
తన్యమనగ, మాయ తత్వఘుంపు
ప్రతిఫలించినట్టి ప్రత్యగాత్మచ్ఛాయ
యన త్రికమ్ము నిశుడన జనించె. ౫౫

## మరియు

అమల సత్వమాయ యందున నా ప్రత్య
గాత్మ ప్రతిఫలింప నలసమిష్టి
భావపురుషుడనగ ప్రజ్ఞాను డనగ స
ర్వజ్ఞ శక్తుడనగ వరలు నతడు. ౫౬

## ఇంక

సకలవిభుడు నైన జనకు నాజ్ఞను సర్వ
కార్యములకు నుండు కారణుడుగ
ఖండ పిండముల కఖండ బ్రహ్మాండ స
మ్మండల ప్రధాన మంత్రిగాగ. ౫

ప్రథమమగు నఖండ బ్రహ్మాండమున ప్రత్య
గాత్మ ప్రథమ పుత్రుడై యొసంగి
సర్వకారణుడుగ సర్వప్రపంచ వి
లక్షణుడుగ సర్వసాక్షి యగును. ౫

### పిండాండసృష్టి

ఖండగతినొనర్చె పిండాండయంత్రముల్
కాలగతులు దెలియ గలుగునటుల,
ఎపుడు "టకుటకు" మను హృదయంబులను గుండె
లలర సూక్ష్మపు గడియారములన. ౫౯

### జీవోత్పత్తి

అల యవిద్యయనగ- నందధిష్ఠాన చై
తన్యమన, నవిద్యతత్వమందు
ప్రతిఫలించినట్టి ప్రత్యగాత్మచ్ఛాయ
యన, త్రికమ్ము జీవుడన జనించె. ౬౦

### మరియు

మలిన సత్త్వగుణ సమంచితావిద్యయం
దాత్మప్రతిఫలింప నద్ది, వ్యష్టి
భావ, ఖండరూప జీవుడై కించిజ్జ్ఞ
పురుషుండుగ ద్వితీయ పుత్రుడగును. ౬౧

అల ద్వితీయపుత్రుడైన జీవుండుండు
సకలవిభుండైన జనకునాజ్ఞ
జననమరణదుఃఖ జగదభిరామ సా
మ్రాజ్యవృద్ధిసేయు రాజుగాగ. ౬౨

రెండవ సుతుఁడుండు ఖండకించిజ్ఞత్వ
శక్తి వ్యష్టిభావ యుక్తుఁడగుచు
నైహికాభిమ త్యహంకారలక్షణ
బాహ్యకార్యదీక్ష ప్రభవుఁడునిఁగి. ౬౩

## అవిద్యా జననము

అల హిరణ్మయమగు నాదిమ జననికి
తోఁడబుట్టినట్టి వాఁడు శూరుఁ
డైహికార్థియౌ అహంకారునకు మహ
త్తునకు సుత యవిద్యయన జనించె. ౬౪

## అవిద్యా జీవులు

తానవిద్యయొక్క మేనత్త కొడుకౌట
తనకు మేనమామ తనయుఁడౌటఁ
దాన మేనమామ మేనత్తబిడ్డలై
బావ, మరద, లనగ బరగు చంద్రుఁ. ౬౫

వావివరుసలు పరివార బాంధవ్యముల్
ప్రీతినెన్నొ చూపెమాతృ దేవి,
వానినెల్ల వ్రాయఁ బూనగా లేనైతి
జనని యాజ్ఞను శిరసావహించి. ౬౬

## స క లా ధ్య క్షు లు

సకలసృష్టి కాదిజనకులు నౌట "గా
యత్రి విశ్వకర్మ" లన వెసంగి
సకల భువనశిల్ప సామ్రాజ్య కాధ్యక్షు
లగుచు సర్వసాక్షు లనగనుండ్రు. ౬౭

సకలభువన శిల్ప సామ్రాజ్యమందున
సకలజీవకోటి సదనములకు
వాసయోగ్యమైన వసతి గల్పింపంగ
నాదివాస్తు జనకు లైరి వారు. ౬౮

ఆదిదైవములన, నాదిశిల్పులనంగ,
నాది విశ్వసృష్టి కధిపతులన,
సకలభువన శిల్పసామ్రాజ్య మేలుచు
నాదిదంపతులన నలరుచుండ్రు. ౬౯

అఖిల భువనములును నవతరిల్లగ నందు
సకల భవనములను సల్పినారు;
అవ్వి తనువులనెడు యంత్రముల్, రథములున్,
సౌధములును నన వెసంగు నిట్లు. ౭౦

## యంత్రములు

అఖిలసృష్టిలో మహావిచిత్రమ్ములౌ
శిల్పమర్మములను జేర్చి దేవ
యంత్రముల సృజించు నాదిమ శిల్పియౌ
తల్లిదండ్రిఁగూర్చి తలఁపరాదె. ౧

తల్లిదండ్రు లవని పిల్లలను సృజింత్రు;
పిల్ల లెల్లఁగూడ పితరు లగుదు;
రంతులేక యిట్టులా వృత్తి జరుగును
ప్రాతయైనగాని నూతనముగ. ౨

పంచభూతములను పంచలోహములచే
పంచచక్రములను వరుసనిల్పి,
అందుపైని నిలిపె నారవచక్రంబు
భానునందలి పరమాణువు నిడి. ౩

స్వీయమంశమైన జీవాత్మనందుంచి;
యంత్రమునకు మూలమైనదిగను
ఏడవదిగ చక్ర మిమిడించి హేమాంగ
మం దణుస్వరూపు లనగ నుంద్రు. ౪

ఆరు చక్రములకు భూరివిద్యుచ్ఛక్తి
జ్వాల లగుచు వరుస గ్రాలుచుండ
నంచు పైని చక్ర మాత్మ తేజశ్శక్తి
వేలకాంతుల నది గ్రాలి యేలు. ౫

కాళ్లు వేళ్లు నాళ్లు కన్నులు వెన్నుమన్
కరము లురము శిరము కరముఁ గల్గ
ధరణి సంచరించు తనువులన్ యంత్రాలు
సృష్టిశిల్పి రాది శిల్పవరులు. ౬

సన్నసన్న మిన్నమిన్న యెముకల చెన్న
మున్నతముగ కీళ్లు సూటిఁగూర్చి
కీలుకీలునందు సీలలు లేకుండ
చేసిరిట్లు దిరుగ శిల్పగరిమ. ౭

కీళ్లు చెదరకుండ నాళ్లను దీర్ఘనరా
తీగలెన్నొ పైని దీర్చి కప్పి,
అందుపైని నీరమును రక్తపూరముఁ
పారఁజేసె వేడిఁ జేరకుండ. ౮

ఇంద్రియాదులైన యిరువదినాలుగు
పరికరంబులవెడు మరలుఁ గలుగ
రక్తవాహినులను రంజిల్లు పట్టాలు
పరుగులెత్తి దిరుగఁ బరగుచుండు. ౯

హృదయకుహరమనగ నింపగుయంత్రము
యంత్రకార్యముల పై యొసంగ,
శ్వాసహావర్తిల శక్తిని దనుయాత్ర
పరికరము లవెల్లఁ దిరుగుచుండు. ౧౦

నీరునివ్వఁబనులు నీరమన్న సాగనంగ
కడుపునిండునట్లు గుడుచుటకును;
చేరిమరలుద్రిప్ప జీవుఁడుండునుగాని
యింద్రియములె జీవు నెంచి త్రిప్పు. ౧౧

ఒక్కచోటనిల్వ దొఁగి యంత్రము ధరిత్రి
నవని నంతఁదిరుగు నవసరమున ;
వారమునకు రోజు గోరును సెలవొండు
యర్థకాలమొకటి యభిలషించు. ౧౨

యంత్రచిత్రమేమొ యవి తలిదండ్రులై
నిత్యనూతనమున నెగడి బహుళ
సంతతియను యంత్రజాలమ్ము సృష్టించి
జగము నంతు లేనిదిగ నొనర్చు ౧౩

తల్లియంశమునను తనుయంత్రమయ్యెను;
అందుఁదండ్రి తేజమలరుచుండు ;
నీకుక్షేమమరసి నీతలిదండ్రులు
యంత్రవేషధారు లైరినువ్వ. ౧౪

తల్లియున్నయపుడె తండ్రిదర్శనమౌను,
తల్లి మరలిపోవఁ దండ్రిఁ గనవు,
తనువు నున్నయపుడె తగజన్మ సఫలతఁ
జెంద మాతృపూజ సేయుడయ్య. ౧౫

## ర థ ము లు

తండ్రి ప్రత్యగాత్మ, తల్లి హిరణ్మయి.
దంపతులయి నీకు తనురథాలు
రచనచేసి రట్టి రథకార దంపతీ
పూజనమ్మొనర్పఁ బూనరాదె. ౧

ఎల్ల మానవులును నిహపరసుఖముల
ననుభవింప యోగ్యమైనయట్టి
చిత్రరథములను సృజించిన ప్రాక్శిల్ప
దంపతులను గొల్చి తనియరాదె. ౨

లోకజనని సర్వలోకరాజ్ఞియు నైన
ఆహిరణ్మయి తన యంశశక్తి
వ్యష్టితనువుఁగాఁగ వ్యష్టిరథముగాఁగ
వ్యష్టిరాజ్ఞికాఁగ నలరుచుండు. ౩

లోకజనకు డఖిలలోకవిభుండు నౌ
ప్రత్యగాత్మశక్తి ప్రతిఫలింప
నద్దివ్యష్టిజీవుడై వ్యష్టిరథమంద
వ్యష్టిరాజుగాఁగ వ్యవహరించు. ౪

అసలుతల్లిదండ్రు లాధారులైయుండ
తనురథాలవెల్లఁ దనరుచుండు
రథమునందుజీవు డధివసింపగ నవ్వి
పెరుగుచుండు ధరణిదిరుగుచుండు. ౫

## రథస్వరూపము

శ్వాసయుగమునయ్యె చక్రముల్, తన్మాత్ర
లైదునొప్పుచుండు నశ్వములుగ,
నంతరింద్రియంబు లయ్యెసూత్రములుగను,
కర్మపంచకమ్ము కాల్బలముగ. ౬

రథము నధివసించు రాజయ్యెజీవుండు,
జ్ఞానపంచకమ్ము సారథియగు,
సారథికినయ్యె సంకల్పమును విక
ల్పమ్ము ఘోటకముల పగ్గములుగ. ౭

ఎన్నొవిధములైన చిన్నారిరథము లొ
క్కొకటి కలిసిమెలిసి యుండబోవు ;
కలిసినటులె పైకి గాన్పించిచేయు జీ
వితరణంబు భేదవృత్తులొలసి. ౮

ఎల్ల భువనములను సృష్టిఁ జేయఁ దలంచి
కార్యకారణముఁ గలిపి జీవ
కోటి నొకరినొకరు గొప్పయుద్ధము సేయ
నిట్టి రథములను సృజించినారె! ౯

అన్యు లనుభవింప నార్జించుకొన్నట్టి
భోగ్యవస్తువులను పొందఁగోరి
వేడ్క తెమ్మటంచు విషయానుచరులకు
నాజ్ఞ చేసి రిట్లు రాజ్ఞి రాజు. ౧౦

ఆజ్ఞ తలనుదాల్చి అనుచరు లటునేయ
అన్యు లదిగ్రహించి ఆగ్రహమున
అపకృతిని నొనర్చ నందుచే నిరుతెగల్
పోరొనర్తు స్వార్థమునఁ గడంగి. ౧౧

తనను పరుల నెరుగకను సల్పుచుంటట
నిట్టియుద్ధ మేరి కేమి గూర్చు?
స్వీయజాతిపైని చేయు యుద్ధంబిది
పొట్టకూటి కయ్యొ తుట్టతుదకు. ౧౨

ఏకజాతియయ్యు నేకోదరులు నయ్యు
నేకముగ చరింప లేకయిటుల
పొట్టకూటికొరకు పోరుసల్పుట జూడ
క్షోభగాక దేశశోభ యగునె! ౧౩

శత్రుభావమన్న శత్రుత్వ మదికాదు;
మిత్రభావమన్న మైత్రి కాదు;
శత్రుమిత్రు లవక సల్పుచుందురు పోరు
నొక్క. నిముసమైన నూరకొనక. ౧౪

పోరు సలుపుకొరకు భువనాలు కల్గెనో!
శాంతి ధర్మకృతులు సల్ప కొరకొ!
అసలు తల్లిదండ్రు లానంద మయులేడ?
తనయు లాచరించు తగవులేడ? ౧౫

ఆత్మపుత్త్రికలకు నాధ్యాత్మికానంద
దాయకమగు జ్ఞాన ధనమొసంగ,
గాని వారు దుర్విధాన వ్యయమొనర్చి
స్వపరసౌఖ్య కృతులు సల్పలేక. ౧౬

తప్పు లనగ భయము, దైవం బనగ భక్తి,
యొప్పు పనులనంగ గొప్ప మెప్పు,
మాటి పీడు వాడు ముప్పు తిప్పలఁబడి
యాత్మ సౌఖ్యమున్న దందఁబోడు. ౧౭

కన్న తల్లిఁదండ్రిఁ గరములఁ బూజించి
సకల మిథునములను సన్నుతించి
ఆదిమ రథకారులగు జగజ్జనకుల
నర్చసల్పి పొందు డాత్మసుఖము. ౧౮

ఆట వెలదులెల్ల నాటక సామ్రాజ్య
పదము వడసి ఏల ప్రాజ్ఞ యయిన
రాజ్ఞి నెన్నుకొనిరి రాజ్ఞి, ప్రాజ్ఞత్వంబు
ననుభవమునఁగాక యరయ గలరె! ౧౯

—:*:—

## సౌధములు

సకల జగము లొక్క సౌధంబుగాఁ జేసి
సౌధమం దనేక సౌధములను
మర్మగర్భితముగ నిర్మించి వానిలో
నూను లాటలాడఁ జూచుచుండ్రు. ౧

మేడచిత్రమేమొ మేదినీతలమందు
నొక్కచోట నిలిచి యుండఁ బోదు,
సౌధ సౌధమునకు సాంగత్య మబ్బగా
సంచరించు భావి సంఘటనకు. ౨

అట్టి సౌధమునకు నంతస్థు లేడుండు,
నన్ని లోకములన నన్ని వరుస
చక్రములన నన్ని శాలలనఁగను
కమలములను పేరఁ గ్రాలుచుండు. ౩

అట్టి శాలలందు నైదుమాత్రము భూత
పంచకమ్ము చేతఁ బరగుచుండు;
పంచమూర్తు లందు పరిపాలనము సేతు
రైహికార్థముగను నలరుచుండి. ౪

అందుపైని నుండు నంతస్థులవి రెండు
పారమార్థికముగఁ బరగి యందు
ఒండిహంబున కగు, నొండు పరమ్మున
కైన దగును వానియందు నిటుల. ౫

ఐదు శాలలకును నా ధారమైనట్టి
అంశకు శతివాంశ మైనయట్టి
భూప్రదేశమందు మొదలిడి కట్టిరి
వాస్తువిధికి తగిన వసుధ నెంచి. ౬

దిట్టమైన రెండు నిట్టాడుల నమర్చి
పాదములన నిరు పునాదు లుంచి
ముడువ విడువ కీళ్ళు మూడమర్చిరి, అద్ది
కూరుచుండ లేచి పాగుచుండ.

అట్టి పదములందు చిట్టికమ్ములు పది
పెట్టి చివరను పది క్రేళ్లమర్చి
అందు నిగువదెనిమి దరచిన్ని ముక్కల
సల్పి నిల్పినారు శిల్పగరిమ. ౮

వానిరెంటిపైన పదునాల్గు ముక్కలు
మూలలుగ నొనర్చి సీలమండ
లనగ నందమర్చి యాపైని బారగు
నాల్గు కమ్ములను నొనర్చి నిలిపి. ౯

వానిపైన నింక బారుకమ్ములు రెండు
బలముగలవి సల్పి నిలిపినారు;
ముడువ లేవనైన మోకాలి చిప్పలు
రెండమర్చి రల్ల రెంటిమధ్య. ౧౦

అట్టి రెండు కాళ్ల యందు నమర్చిన
చిన్న పెద్ద లావు సన్నములును
పొట్టి పొడవులు గను చిట్టివి యగు కమ్ము
లగువదైన సంఖ్య యయ్యె వెరసి. ౧౧

అట్టి కాళ్ల తొంటులగువాని పైభాగ
మందు నవనితత్త్వ మలరుచుండ
అద్ది మొదటిదైన అంతస్తు నాధార
చక్రమనగ సృష్టి సల్పినారు. ౧౨

అట్టి యవనిలోకమందు మొదల్వేట్టి
గట్టినారు మిగుల దిట్టముగను
అన్నరసము జీర్ణమైనంత నిలిచెడు
మలము విడువనైన మరుగుదొడ్డి. ౧౩

క్షితి సుతత్త్వమందు ప్రతిబింబితుండగు త
న్మాత్ర పంచకాభిమాన యుతుడు
నైన బ్రహ్మమూర్తి కాజ్ఞపెట్టిరి పూర్ణ
బీజ సృష్టిసేయ పృథివియందు. ౧౪

అంబు తత్త్వమందు నమర స్వాధిష్ఠాన
మను ద్వితీయ చక్రమును సృజించి
స్నాన పాన జలము చనగ కాల్వను గట్టి
నారు మురికినీరు పారుచుండ. ౧౫

అంబు తత్త్వమందు బింబితుల్ నాల్గు త
న్మాత్రలందు నదభిమాను లౌను
దనరు నాప్రజాపతిని విష్ణు నిల్పిరి
బీజకోటి నాటి పెంపుఁజేయ. ౧౬

అందు మూడవదగు నంతస్థ్సుపు మతి
పూరకమున వంట పూర్తి కాగ
నశన పచనమునకు నగ్ని శాలగ మంచి
పాకశాల నేరుపరచినారు. ౧౭

భాసురాగ్ని తత్త్వ ప్రతిబింబి మూడవు త
న్మాత్రలందు నదభిమాని గురుఁడు
సంహరించు కర్మ సలుపంగ నిలిపిరి
యగ్నిలోకమందు నాజ్ఞపెట్టి ౧౮

అందు నాల్గవదగు నంతస్థ్సుపున నన్నా
హూతమునందు సుఖము లతిశయిల్ల
గాలి నొసగుచుండ గాఢనిద్రను జెంద
పడకటింటి నేరు పరచినారు. ౧౯

పవనతత్త్వమందు ప్రతిబింబి రెండవు త
న్మాత్రలందు నదభిమాని నింద్రుఁ
అనిలలోకమందు నవిధాన కర్మము
నాచరింప నుండ నాజ్ఞ నిడిరి. ౨౦

అంచు నైఋతపగు నంతస్తువున శిశు
ధ్రాఖ్యమైన చక్రమందు జరగ
వివిధ క్రమములు తీర్చి విశ్రాంతి భవనంబు
గట్టినారు హాయి గలుగునటుల. ౨౧

పిదప నచ్చైన పదునారు కళలతో
పఠనమునకు రాత్రి పాఠశాల
బలము సుఖము నొసగ వ్యాయామమునకునై
మంచిశాల నేర్పరించినారు. ౨౨

అతుల గగన తత్త్వ ప్రతిబింబి యొక్కట
న్మాత్రమందు నెలకొనగాను సూర్య
అంబరమును లోకమునకు గ్రహతతిర్ద్ర
సల్ప నాజ్ఞనొసగి నిల్పినారు. ౨౩

పంచలోకములకు ప్రక్కలఁ వెనుకను
ముందు నిటుల కొంత మూసినారు;
వెన్నుపూస యనగ వెనుక నున్నది మూడు
కీళ్లు నిలిపినారు ముళ్లవైచి. ౨౪

వెన్నుకమ్మికన్న చిన్నకమ్మి నొసర్చి
ముందు రొమ్ముకంబముగ సమర్చి
వెనుక వెన్నుపూసలను కంబమునకును
ముందు కంబమునకు పొందుపడగ. ౨౫

లావు గుండ్రమైన తీగెల నరకోల
వంపులుగ నొనర్చి సొంపెలర్ప
నిరుగడల నమర్చి దిగువదినాలుగుఁ
క్రమత హృదయపంజరమన నెసగ. ౨౬

ఇట్లు హృదయకుహర మేర్పడ దానికి
వంపులుగను కొన్ని బాగువిగను
కొన్ని పూసలుగను అన్నియు నుగువులు
నేబదేనిమిదయ్యె నెంచి చూడ. ౨౭

సౌధ మవనిపైన సంచరింపగ సాయ
పడుటకైన యట్టి పక్షములన
నిచ్చి పుచ్చుకొనుట కిరువంకలను హస్త
ములని రెండు సృష్టి సలిపి రిట్లు. ౨౮

దండకమ్ములనగ రెండు నమర్చి మో
చేతి కమ్ములనగ జేర్చి నాల్గు
మరియును పదునారు మణికట్టులం దర
చేతులందు పదియుఁ జేర్చిరింక. ౨౯

రెండుచేతుల పదివ్రేళ్లయం దిగువ దె
నిమిది చిన్నముక్క లమరచగను
చిన్న పెద్ద కమ్ములన్నియు చేతుల
కైన సంఖ్య యరువదయ్యె వెరసి. ౩౦

ఆరవదిగ నైన అంతస్తు నాజ్ఞేయ
చక్ర మలరుచుండ సల్పి భాను
మూర్తిదీప్తి నిడి తపోలోక మనగను
గట్టినారు గొప్ప కర్మశాల. 3౧

శాలకైన ముఖము సల్పి రిట్లుంగిటి
యందు రెండు ముక్కులమర జేసి
ముక్కునందు నేడు ముక్కులమర్చి పై
దవడయందు నాల్గు దసర జేసి. 3౨

అంత క్రిందిదవడ యన నొనర్చి రొకొండు
బలముగలది నాడ వంపు గలది
ముఖమునందు సిల్లు మొత్తము పదునాలు
గగుపులయ్యె శిల్పగరిమ గనగ. 33

అట ద్వితీయపుత్రుడై యొప్పు జీవిత
దాజ్ఞచే నొనర్చు నందునుండి
విశ్వకర్మకులను వెలయింపగా నిహ
పరముల విషయానుచరుల గూడి. 3౪

అంత నేడవదగు నంతస్తువున సహ
స్రారచక్ర మొకటి సలిపి యందు
దేవమందిరమ్ము గావించి నిల్పిరి
దేవతార్చనంబు దీర్పగొరకు. 3౫

సల్పి యింక లోన సప్తమద్వారమ్ము
దుర్గమముగ తీర్చి మార్గమేర్చి
లెవరో యెపుడో పోయి యెసగ మూడైనట్టి
పదవు లనుభవింప బ్రహ్మకెంత. ౨౮

సౌధమందు నన్ని శాలలకున్ మంచి
గాలివచ్చి చెడ్డగాలి పోవ
పెద్దవైన రెండు పెట్టిరి కిటికీలు;
నింక రంధ్రకోటి నేర్పరిచిరి. ౨౯

సౌధమునకు చుట్టు చక్కదనం బొప్ప
కాపుదలగ నున్న కంబములకు
నేవిధమగు చెరుపు లేర్పడకను వాని
గప్పినార లిట్లు గానకుండ, ౩౦

మాంసమనెడు మంచి మన్ను దెచ్చిరి యందు
రక్తమనెడు జలము సక్తి జేర్చి
కలిపి పదును జేసి కట్టిరి గోడలు
ఆవరణము గలిగి యందగింప. ౩౧

త్వక్కనంగ మంచి చెక్కసున్నము దెచ్చి
వాసిగను గిలాబు జేసినారు;
వివిధ వర్ణములను వెలయు మెరుగునీరు
జేసి పైన పూత వేసినారు. ౩౨

అగ్రమైన శీర్ష మనెడు శాలకు పైన
పెక్కురంగులగను వెలయ జేసి
శీత ముష్ణ మందు జేరకుండగ నీల
కచములనెడు తృణము గప్పినారు. ౭౬

మేడ నెక్కనైన మెట్లు *లేబదినాలు
గొంటికంబమందు నంటిపైకి
తిరుగుచుండి బోవ తిరుగుడుమెట్ల మే
డను సృజించిరిట్టు లనుపమముగ. ౭౭

అందు గోళకంబు లలరు నిర్వదినాల్గు,
నందు నలరి యింద్రియాఖ్యు లింద్రు
వార లెపుడొనర్చు పనుల తథాస్తని
పలుకు నింద్రియాధిపతులు నుంద్రు. ౭౮

సృష్టిమూలమైన చిచ్ఛక్తి యా సహ
స్రారమధ్యనుండి సరగ వచ్చి
యాజ్ఞ సలుపుచుండు నాజ్ఞేయమున మూర్తి
పంచకమునకైన పంచకృతుల. ౭౯

---

* ఈ మేడమెట్ల సంఖ్యను గురించి లోగా ''ఆదిమూలమను'' శీర్షిక గలదానియందు 177 వ సంఖ్యగలిగిన ''హంసగమన క్రమము ననుకరించు'' అను పద్యచరణమునకు 110వ పేజీలో విపులముగా వ్రాయబడి యుండుటచే నిచట వ్రాయబడ లేదు.

శిరములందు దాల్చి చిచ్ఛక్తి యాజ్ఞను
సౌధమందు భూతజగములైన
నైదిటను వసించి యాచరింతురు మూర్తి
పంచకమ్ము కర్మపంచకమును. ౫౦

సొంత మయ్యె నిట్లు సౌధనిర్మాణంబు
నైదునెలలు పూర్తియైన నంత,
అట్టి నూత్న సౌధ మందు నూతనదంప
తుల ప్రవేశపెట్ట దలచి రిట్లు. ౫౧

వెలసియుం నది య విద్యావతిగ తల్లి
తోడబుట్టువాని యాడపిల్ల,
చెలగి తండ్రివైపు జీవాత్ముడను పేర
నుల్లసిల్లును మగపిల్లవాడు. ౫౨

జననిపుట్టినింట జననమైన వధువు
జనకు వంశమునను జాత వరుడు
గురిని నొకరి నొకరు వరియించుకొనగ వా
రిరువురికిని పెండ్లి జరిపినారు. ౫౩

ఐరవి నత్తవార లిరువదినాల్గింద్రి
యాదులను తదింద్రియాధిపులను
ఇంకను పరివార మిహలోక సామ్రాజ్య
కము నొసంగిరి వరకట్నముగను. ౫౪

అత్తనార లిట్టు లాశీర్వదించిరి
రాణి రాజులుగ విరాజితులయి
అఖిల మొసగు నైహికానంద మొసంగుచు
విషయవాసన లభివృద్ధి నొంద. ౫౫

ఒకరు విద్యయు మరియొకరు నవిద్యయు
నిరువు రాండ్రుగలుగ నేర్పడంగ
మిశ్రులైతి రగుట మిశ్రకన్న లొనర్చి
మిశ్రజగము గనుచు మాలిని నిగారి. ౫౬

వరునిగూర్చి

చిన్నపిల్ల యటాట సిగ్గున భయము మొంది
నీదు త్రోవ నడువనేర దట్టి
కన్నతల్లి నెల్లు గాపాడెదో భార్య
ననుసరించి యేలుకొనుము తండ్రి. ౫౭

పిల్లవాడవీవు పిల్లయె నీభార్య
పిల్ల లిరువు రౌట పిల్లపనుల
నెల్ల వేళ జేయు డల్లరి పడకుండ
కల్లజగము వృద్ధి గలిగి మనగ. ౫౮

ఆకలి*యనురోగ మాశ్రయించు శరీర
మందు దాని కన్నమగును మందు,
ఆరురుచులు గలుగు ననుపానమున దినుం
డైహిక మగుబలము నంద గోరి. ౫౯

## తల్లిదండ్రులు

ఆత్మజాత! వినుమి యధ్యాత్మ సామ్రాజ్య
మనెడు జ్ఞానధనము గొనుము దీని
పగటిదొంగ లుండ్రు పట్టి వైచిన నెట్లు
తేలుకొనెదొ మొఱక మేలుకొనెదొ! ౬౦

తల్లి తెలివి గలిగి యుల్లసిల్లుచు నున్న
జ్ఞానధనము కెట్టి హాని రాదు;
తలి తెలివి గలిగి యాచరింప ధనమ్ము
పొంగిలింతు రది మెఱుంగఁబోవు. ౬౧

విద్యగలదు నీ కవిద్యయు గలదాలు
దానమరపు జేయ బూను నట్టి
యాలి గూడికొనియు నాలికిం జిక్కక
నాలిమెప్పుతోడ నేలుకొనుము. ౬౨

ఆకలి యనుగొంగ మాశ్రయించు సతమ్ము
పథ్యమొంది రుచుల బారి బడక
అన్నమనెడు మందు ఆరగింపుము తండ్రి
పారమార్థికాత్మ బలము గోరి. ౬౩

ఆలి నాశ్రయించు నజ్ఞానవశమున
జేయు పనులవలన జెడకయుండ
బుద్ధితత్త్వ మొసగు బుద్ధీంద్రియమునకు
నధిపుడుండునా బృహస్పతియన. ౬౪

అతఁడు గురుఁడు వాని యాజ్ఞ నొప్పున గర్మ
లాచరించుచున్న నన్ని విఫుల
జ్ఞానధనము కెట్టి హాని గల్గక మమ్ము
గాంచుశక్తి నీకు గలుగ గలదు. ౬౫

ఇంద్రియాస్పదములు నిరువది నాలుగు
గోళకములతోడ గొప్ప మేడ
సిద్ధ మయ్యె నందు జేరు ప్రొత్తగ
నని నిజాలయమున కరిగినారు. ౬౬

జీవుడు

తల్లిదండ్రులాజ్ఞ దలదాల్చి జీవుండు
గురుని జేరి యనియె కుతుక మొప్ప
దైవమన్న తల్లిదండ్రు లన్నను మీర!
కరుణ బ్రోవుమయ్య గురువరేణ్య. ౬౭

అంతగురుడు

తల్లి తెలివి నెపుడు తలదాల్చు వేనియు
నాదుమార్గ మూని నడతు వేని
నెన్నటికిని బాధ లేవియు రావని
అభయ మొసగి యిట్టు లనియె గురుడు. ౬౮

నూత్న సౌధమందు నూత్నప్రవేశంబు
నూత్నదంపతులు ప్రయత్న మూని
జేయవలయు నంచు జెప్పి ప్రవేశింప
మంచిలగ్న మేర్పరించి తెలుప. ౬౯

కాల్బలమ్ముగాగ కర్మేంద్రియము, లంత
రింద్రియములు మంత్రు లెలమి గాగ,
జ్ఞానపంచకమ్ము సరణి జూపింప ద
న్మాత్రలను వనితలు మంగళ మన. ౨౦

మంది మార్బలంబు ముందు బరాబరుల్
సేయ గోళకప్రసిద్ధ మైన
నూత్న సౌధమందు నూతనదంపతుల్
వేడుకలరగా ప్రవేశ మైరి. ౨౧

నూత్న సౌధమందు నూత్నదంపతులు ప్ర
వేశమైనయట్టి పిదప వాస్తు
పూజ ముందు, దిశల భూతప్రదక్షిణ
ప్రణతు లిడగ నాజ్ఞ పరచెగురుడు. ౨౨

## ప్రదక్షిణము

అజుని నాభివంటి యజనాభ భూమిని
తూర్పుదిక్కున ప్రణతుల నొనర్చి,
దక్షిణమున జలము దర్శించి వినుతించి
పశ్చిమమున నగ్ని ప్రణుతి సల్పి. ౨౩

పవను నుత్తరమున ప్రణుతించి, తూర్పున
కుత్తరముకు మధ్య నున్న విదిశ
యందు నూర్ధ్వముగను నరిగి యాకాశ మం
డలము గని యట ప్రణుతుల నొనర్చి. ౨౪

సూర్యమండలమ్ముఁ జూచి జాగ్రదవస్థ
నరసి యందు ప్రణతు లాచరించి
చంద్రమండలమ్ముఁ జని యట స్వప్నమ్ము
నరసి యందు ప్రణతు లాచరించి. ౭౫

అగ్నిమండలమున, సంఘోజకర్ణిక
నచట నిక సుషుప్తి యనునవస్థ
భ్రాత యైనయట్టి ప్రజ్ఞానమూర్తినిఁ
గాంచి ప్రణతు లాచరించి యవల. ౭౬

అంతకన్న పైకినరుగ హిరణ్మయ
మండలమను దేవ మందిరమున
అల తురీయభావ మరసి యాదిసదంప
తులను గాంచి ప్రణుతి సలుప మరియు. ౭౭

సౌధరచన మిట్లు సల్పినయట్టి గా
యత్రి విశ్వకర్మ లనెడు నాది
వాస్తుదేవతలగువారికి నాస్తు పూ
జల నొనర్ప నాజ్ఞ సలిపి గురుడు. ౭౮

వాసయోగ్యమైన వసుధ వాస్తు వటంద్రము;
గృహమునకును వసింప గృహరచనము;
శిల్పకారణులగు శిల్పాధిపతు లాది
వాస్తుపురుషులగుచు వర్తిలిరని. ౭౯

వాసయోగ్యమైన వసుధ వాస్తువు కాగ
భూమి మొదలు పంచభూతకముల
హర్మ్యసౌధములను నిర్మించు తలిదండ్రు
లాది వాస్తువిభువ్రులైరటంచు. ౨౦

## పరాత్పర విశ్వకర్మయె ఆదివాస్తు పురుషుడు.

* శ్లో॥ వాస్యస్థలం వా స్త్వితి సుప్రసిద్ధమ్
వాస్యం గృహం తద్ఘనశిల్పమూలమ్
య శ్శిల్పకర్తా భవతి ప్రభు శ్చ
వాస్తోష్పతి ర్నామ స విశ్వకర్మా॥ — మయశిల్పశాస్త్రమ్.

జీవుడను గృహస్థునకు శరీరరూపమగు సౌధమును నిర్మించి యిచ్చిన ఆదిమదంపతులగు గాయత్రీ విశ్వకర్మలే వాస్త్వధిపతులగు వాస్తుపురుషులు. ఆ యాదిమ వాస్తుపురుషుల నారాధించినగాని జీవుని సంసారయాత్ర పూర్తి కాదు. వారు భూతసుల కవ్వల వెలుగు హిరణ్మయ మండలమున ప్రకాశించు చుందురు. వారి సాన్నిధ్యమున కేగుటకు పంచభూత సంబంధములగు నాధారాదులను, సూర్య చంద్రాగ్ని మండలములను దాటి దివ్యతరమగు హిరణ్మయ మండలమును జేరుకొనవలయును. ఈ ప్రయాణము జ్ఞానయోగ సంబంధమైనది. అంతరికమగు నీ ప్రయాణమునకు సూచకముగ బాహ్యజగత్తునగూడ వాస్తుపూజ యొనర్చునపుడు భూమి మొదలగు భూతములనుగా నెన్నదగిన ప్రాగాది దిక్కులను దాటి ఆకాశస్థానీయమును సూర్య చంద్రాగ్ని మండలములకు మార్గదర్శకములై యొప్పు పూర్వోత్తరమగు నీశాన్య విదిక్కునసే వాస్తుపురుషు నారాధించి, శంకుస్థాపన మొనర్చి గృహారంభము చేయుచున్నారు. గృహనిర్మాణము పూర్తియైనపిమ్మటను ప్రవేశించినకాలమున పైని పేర్కొన్న అంతరికార్థము తోచునట్లు మరల వాస్తుపూజ చేయుచున్నారు.

వాస్తుపురుషుని యథార్థతత్త్వ మిట్లుండగా కొన్నిగ్రంథములలో వాస్తుపురుషు డొక భూతమునంటివాడని అతనికి వికృతాకారము కల్పింపబడి తత్త్వార్థము దూరముచేయబడియుండుట చాల విచారకరము. శిల్పతత్త్వము

గురుడు దెలుపుచుండ పరమసౌధాగ్రము
నందునున్న దేవ మందిరమ్ము
నంతరమున వాని యాజ్ఞచొప్పున జేరి
రరసి వాస్తుపూజ లాచరింప. ౮౧

గురుడు వాస్తుపూజ పరికరంబు లొసంగి
మూలసూత్ర మంత్రములు పఠింప
ఆదిదంపతుల మహావాస్తుపూజలు
సల్పి రాలుమగ లనల్ప భక్తి. ౮౨

---

నకు ప్రాధాన్యము తొలగింపనెంచు నే దురభిమాన దుర్విదగ్ధులో యిట్టి కల్పనములను వేదశాస్త్రములలో దూర్చియుందురు.

ఇటులే యీశాన్యప్రదేశ ప్రాధాన్యమును గప్పిపుచ్చనెంచి యితర ప్రదేశములయందును, ఇంక దేవాలయమందును చతుశ్శాలలకును గర్భమధ్య చేయవలసిన శంకుస్థాపనము గృహములకు ననువర్తించునట్లును శాస్త్రముల యందు మార్పులు చేసియుందురు. దాన కేవలశాస్త్రములమీద నాధారపడు శాస్త్రీయులకు సత్యము తేలకపోగా వివాదములుమాత్రము పెంపొందుటకు కారణభూతము లైనవి.

సత్యమాలోచింప నాదిమసృష్టికర్తయగు విశ్వశిల్పియే వాస్తుపురుషుడనియు నింక శంకుస్థాపనచేయు ప్రదేశము యీశాన్యమేయనియు నీక్రింది దృష్టాంతవచనములచే స్పష్టమయ్యెడిని.

పంచభూతములు – ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అను నవి క్రమమునసుద్భవించినవి. భూమిపైనున్న ప్రాణులకు భూమి మొదటి భూతముగను, జలాదులు వరుసగ తరువాతవిగను నున్నవి. ఆధారాది షట్చక్రములనుబట్టి చూచినను భూమి మొదలగు భూతములు దిగువనుండి పైకి ఒకొక్కచక్రమున నొకొక్కటి ప్రధాన మైయున్నది.

బంధుమిత్ర సుపరివార సంతర్పణ
మాచరింప పత్ని యతిగె నవని
గురుడు బుద్ధితత్వ కుహూరంబునన్ జేరె
జీవు డొక్క డుండె దైవనిష్ఠ. ౮3

స్వర్ణమయమునైన సర్వాకాశంబైన
సత్యరూప సర్వసాక్షియైన
స్వస్వరూపమైన సచ్చిదానందమౌ
ఆత్మదర్శనంబు నందుచుండు. ౮౪

---

ప్రదక్షిణము చేయునప్పు డీ భూతములను ప్రాగాది దిక్కులయం దొక్కొక్క దిక్కున నొక్కొక్కభూతమును భావింపవలయును. ప్రదక్షిణము తూర్పుదిక్కునుండి ప్రారంభమగుచున్నది. కావున తూర్పున భూమిని, దక్షిణమున జలమును, పడమర అగ్నిని, ఉత్తరమున వాయువును భావించుచు బోగా నీశాన్యమునకు వచ్చునప్పటికి ప్రదక్షిణము పూర్తి యగుచున్నది. ఇంత వరకు చేసిన ప్రదక్షిణము నూర్ధ్వగమనమని యెఱుంగ వలయును. అటునుండి మరల తూర్పునకు వచ్చుట అధఃపతన మగును. కావున ఆకాశమును, నింక నూర్ధ్వగమన మార్గమును బొందనైన యా యీశాన్య విదిశయందె సాధకుడు భగవత్తత్వము నారాధింపవలయును. అందుకే గృహమున నీశాన్యభాగమును దైవస్థానముగా బేర్కొని యున్నారు.

## దేవేంద్ర విశ్వకర్మ

ఈ వాస్తోష్పతియను పేరు దేవేంద్రునకును గలదు. ఈ యింద్రుడు మహాశిల్పి. ప్రజలకు కావలసిన లౌకికశిల్పములకు ప్రాతిపదికలను సృష్టించియు, గృహారామక్షేత్రాది నిర్మాణముల నొనరింప మార్గములు చూపియు నీతడును వాస్తోష్పతియై వరలినాడు. "వాస్తోః గృహక్షేత్రాదేః పతి రధిదేవతా వాస్తోష్పతిః" గృహక్షేత్రాదులకు నధి దేవత, లింగాభట్టీయము, జగత్సృష్టికర్తయగు పరాత్పర విశ్వకర్మవలె నీతడును లౌకికములగు నిర్మాణాదుల సృష్టించుటచే

అంతు లేనియట్టి యాత్మావలోకాన
దేవమందిరమున దీర్చి యుండి
పెండ్లి చేసికొన్న పెండ్లాము సంగతి
చింత జేయబో డొకింత యైన. ౮౫

## భార్య

నాల్గు నెలలు మించె నా భర్త నను గాంచి
నన్ను బలప డొక్కనాట నేని
నన్ను పెండ్లియాడి న్యాయమే వీడుట
అనుచు మగనిమీద కినుక జెందె. ౮౬

ప్రత్యక్ష విశ్వకర్మయను బిరుదమునుగూడ వహించినాడు. ఈతనిని దేవతా విశ్వకర్మయనియు, దేవేంద్రుడనియు గూడ వ్యవహరింతురు. (దేవేంద్రుడు మహాశిల్పి యైనట్లును నీతని శిల్పమాహాత్మ్యము పూర్ణముగ లోగా వర్ణింప బడి యున్నది.)

## మానవవిశ్వకర్మ

పరాత్పరవిశ్వకర్మ సృష్టి ననుసరించి దైవవిశ్వకర్మ సృష్టించినట్టి, వారిరువురి సృష్టుల ననుసరించియు, దేవేంద్రుని శిల్పప్రాతిపదికల నాధారముగా చేసికొనియు, మానవజగత్తున సర్వజీవుల కుపకరించు గృహవాహనాదులను, ఇంక నానావిధోపకరణములను నిర్మించుచున్న శిల్పియు-విశ్వకర్మయు వాస్తు నిర్మాతయునై వాస్తుపురుషుడుగా జగత్ప్రవృత్తికిని, మానవుల సౌఖ్యజీవనమునకును కారణభూతుడగుచున్నాడు. వాస్తు పురుషునిగూర్చిన యీ వాదమే సత్యమని దీర్ఘమగు విచారణముచేతను, శాస్త్రానుభవములవలనను నిర్ధారణమగుచున్నది. విజ్ఞులగు వారీవిషయమును రాగద్వేషరహితమగు వినిర్మలబుద్ధి చేత తర్కించి సత్యమునకు ప్రాధాన్య మొసంగుదురని విశ్వాసము.

గురుమహాత్మ, రావ ? కూర్చిన దీవెగా !
వాస్తుపూజనాడు నేస్త మొసగి
యింద్రియాధిపతులు నెచ్చోట నున్నార
లొక్కరైన రారె దిక్కు లేరె. ౮౭

ఇట్లు పొగిలి పొగిలి యేడ్వంగ నొకరైన
సాయపడగ రామి సాహసించి
భర్తపాదములను బట్టి క్రిందికి పైకి
నూపివైచె నాత డులికి పడగ. ౮౮

జీవు డయ్యెగాని జీవాత్మ కుఱఁగాడు;
ఆత్మదర్శనంబు నందు టుడిగె,
స్వస్వరూప మొందు జ్ఞానంబులేమిచే
తన్ను తాను దెలియ కున్న యయ్యె. ౮౯

### జీవవిచారము

ఎంత యాత్మసుఖమొ అంత దుఃఖంబయ్యె,
ఎంత వెలుగొ చీకటంత యయ్యె
నెంత ప్రాభవంబొ అంత దాస్యం బయ్యె
యిట్టులగుట కేమి హేతువొక్కొ ! ౯౦

కర్మ లవిగొ యెన్నొ గావించుచున్నవి,
భావి నవియె దుఃఖభాజనములు;
సకలజీవు లరుగొ సంఘర్షణము లిట్టు
లుండ వీని నెట్టు లోర్వగలను. ౯౧

భార్యఁ గన్నవారి బాంధవ్యమున నేమొ
భార్య వీడునట్టి పాపముననొ
భార్యవైపువారి బారిం బడగ నేమొ
జ్ఞానతన మొకింత గాన రాదు. ౯౨

మోదమేమొ లేమ మోహంబు గన్పట్టు;
శాంత ముడిగి కలిగె చంచలమ్ము;
సహజమౌ స్వతంత్ర సామ్రాజ్యమున్ బోయె
పారతంత్ర్యమునకు బాల్పడితిని. ౯౩

ఇంద్రియంబులార యింద్రియాధిపులెరి ?
సద్గురుండు నెవరి చక్కిఁ జేరె ?
యెవ్వ రేమి చెప్ప రేమార్గమునఁ బోదు,
నేమి జేతు నంచు నేడ్వ సాగె. ౯౪

భార్య

చింత నున్న భార్య చిన్నగ నిట్లనెఁ
బాప మూరకెట్లు పాసి పోవు ?
నీ సుఖంబె గాని నాసుఖం బెంచవు !
ఎన్ని రోజులయ్యె ! నన్ను బాసి. ౯౫

ఎందు కింత చింత నొంద నేఫల మాను !
నగ్నిసాక్షిఁ గొన్న యాలిఁ గూడి
యైహికమగు రాజ్య మానందముగ నేలు
మందు నఖిల సుఖము లందగలవు. ౯౬

ఇంతలోన వచ్చి రింద్రియాధిపు లెల్ల
జీవుఁ డావురుమని జేర, గురుడు
యిట్టి భయము నీకు నెట్టు లేర్పడె జీవ!
భయము వదలి తెలియ బలుకు మనగ. ౯౭

గురువరేణ్య! నాడు జరిపిన పూజలో
నాత్మసుఖ సమాధి నంద నేను;
నాసుఖంబు నాశనము గాగ నాశక్తి
దిగువ కీడ్చి వైచె మగువ పత్ని. ౯౮

గురుని జీవప్రబోధము

చింత వీడు మింక జీవుడ! మావల్ల
సదుపదేశములను సంతసమున
నాలకించుమోయి యాకాంక్ష నిప్పుడు
అందువలన సుఖము నందగలవు. ౯౯

కారణంబు లేని కార్యము ల్గసరావు;
కార్యములకు భార్య కారణంబు;
భావికర్మములకు భార్య క్రిందికి దింపె
నంతమాత్రమునకు చింత యేల? ౧౦౦

అగ్నిసాక్షి గొన్న యాలిని విడనాడి,
యాత్మసుఖము గోరి యందు నుంట
యెట్టి న్యాయ మానో యేపరమార్థమో
నీకు వివె సాక్షి నిజము గనుము. ౧౦౧

పొందవలసినంత పొందితి సుఖ మింక
పొంద వీలు లేదు – అందువలన
దిగువ కీడ్వబడితి గగనంబువర, కింక
భూతలమ్మువరకు బోదువు సుమ. ౧౦౨

భూతలమ్మున బడి పోవ నీధనమెల్ల
నాలి వైపు వార లపహరింతు;
రందువలన భూమియందు మలాదుల
బొరలి యేడ్చుచుందు వెగుట మరచి. ౧౦౩

నీ స్వరూప మేమొ నీ స్వతంత్రత యేమొ
నీ వికాస మేమొ నిల్వకుండ
నూత్న దేహమందు నూత్నకర్మ లొనర్ప
నూతనుండ వగుదు ప్రాతవయ్యు. ౧౦౪

బాల్యదేహమందు బాల్యచేష్టలతోడ
జడవికార మొంది జడుడ వగుచు
తెలివి సుంత లేక దేహంబుతోపాటు
పెరుగుచుందునట్లు పెంపబడుదు. ౧౦౫

లేతతనువునందు లేగోళకము లోట
సశ్రమమగు పనుల జల్ప లేవు
బలము గలుగుకొలది పనులు జరుగుచుండు
అటులె నీవు వాని ననుసరింతు. ౧౦౬

వాక్కు గలిగియుండు వచియింపగా బోవు;
వీనులుండుగాని వినగ బోవు;
కన్ను లుండుగాని గానలేకుండువు
క్రమముగా నొనర్పగలవు జీవ. ౧౦౭

మేనదెట్లు పరిణమించునో నీవట్లు
పరిణమించునట్లు పరగుచుందు;
అవయవములమీద నాధారపడిదేహా
తంత్రుడవగు దస్వతంత్ర జీవ ౧౦౮

ఐన భయము వలవదభయంబు నిత్తుము
ప్రత్యగాత్మ విభుని పంపుచేత;
నీ తనువుననుండి నీకు సాయ మొనర్చు
చుందుమోయి! మోద మొంద జీవ. ౧౦౯

చెడ్డపను లొనర్చు చెడ్డవానిని చెర
సాలయుంచు శిక్ష సల్పుటకును
రక్షకభటులకును శిక్షవిధము దెల్పి
ప్రభువు గానబడని పగిది జీవ. ౧౧౦

బాహ్యమందు దెలియబడ వీలు లేకుండు
నీదుమరుగునుండి నీ వొనర్చు
నిఖిలకర్మములకు లిఖయించు ఫలముల
తెలియజేతు మవ్వి దెలియు జీవ. ౧౧౧

తెలియదగినవన్ని తెలిసికొ మ్మిప్పుడే;
తెలియగోర ముందు తెలియ బడకు;
కాన నిపుడె పినుము జ్ఞానోపదేశముల్
మరవు జెందనట్టి యొగుక జీవ. ౧౧౨

తనువు బలము గలిగి అనుకూలమై యుప్పు
నింద్రియస్ఫుటత్వ మేర్పడంగ
వాని తోడ పనుల వరుస నిర్వర్తింప
నెనిమిదేండ్ల ప్రాయముననె జీవ. ౧౧౩

బలముగలిగి యన్ని బలసిన నీవెట్టి
మార్గమందు దిగుగ మనసు పడెదొ,
అట్టిమార్గమునకు ననుకూలమగు నొక్క
లోచనంబు గలుగు లోన జీవ. ౧౧౪

అట్టి లోచనంబు అహారహమ్మును నీకు
ఎరుక బలము పెర్మి నిచ్చుచుండు
నయ విధంబున నుపనయన మార్గంబులో
వయన మొప్పఁ జేయ వలయు జీవ. ౧౧౫

బాహ్యమందు నొక్క పరతత్త్వనేత్రయౌ
గురు వరేణ్యు గాంచి కోరి భక్తి
గాన రూప మాతృ గాయత్రి సన్మంత్ర
పఠనము నొనరింప వలయు జీవ. ౧౧౬

మాతృభిక్ష యేమొ మంత్రార్థ మది యేమొ
అనుభ వార్థ మేమొ యాచరించు
బ్రహ్మచర్య మేమొ బ్రహ్మార్పణ ప్రాజ్ఞ
కర్మ లేమొ వాని గనుము జీవ. ౧౧౭

అంతరమున మేమొ యంతస్స్ఫురణ శేయు
చుండు నఖిల కర్మలందు నుండు;
ఎట్టి కర్మలందు నెట్లు వర్తించుటో
యే ఫలంబులౌనొ యెంచి జీవ. ౧౧౮

ఇహాపరములు

బాహ్యగురుఁడు దెల్పు బాహ్యార్థములకు మే
మంతరమున నంతరార్థము లిడ
ఇహాపరంబు లనగ నెసగు బాహ్యాంతర
మ్ములను రెంటి మదిని దెలియు జీవ. ౧౧౯

ఇహాపరంబు లనగ నేర్పడి యుండును;
ఇహ మదెద్ది పరము దెద్ది యన్న;
కాయ మగు నిహమ్ము కర్మలు పరములౌ;
కర్మ వలన తనువు గలుగు జీవ. ౧౨౦

ఇహము కర్మలైన, నింద్రియాలు పరంబు;
లింద్రియంబు లెల్ల నిహము లైన,
పరము లింద్రియాధిపతులై ప్రకాశింతు;
రిహాపరంబు లిట్టు లెసగు జీవ. ౧౨౧

ఇంద్రియాధిపతులు నిహాము లైన, పరంబు
లాది దంపతులుగ నగుచు నుందు;
రాది దంపతులును నైహిక పరములో
తల్లిదండ్రు లనగ దనరి జీవ. ౧౨౨

ఇహమె పరము గాగ నిహము గాగ పరమ్ము
నిహపరమ్ము లిట్టు లేర్పడగ
నూటి నిహపరాల సోపానముల వల్ల
నీ నివాసము గమనింతు జీవ. ౧౨౩

ఐహికం బనంగ నాధ్యాత్మికం బన్న
నొక్కటిగను నుండు నిక్కముగను;
ఐహికంబు నందె యాధ్యాత్మికం బుంట
నైహికంబు పీడ నగున జీవ. ౧౨౪

## కర్మ తత్త్వము.

కర్మ లెన్నో నీకు గాన్పించు చుండును
కర్మలనగ గొప్ప మర్మములగు
మర్మ గర్భితమగు కర్మలన్ గురుసత్కర్మ
ముల నెరింగి చేయు వలయు జీవ. ౧౨౫

అనుభవించు కర్మ మారబ్ధమౌ గాన
ననుభవింప నద్ది యంత మొందు;
నాచరించు కర్మ మాగామి యౌ గాన
సంచితమను కర్మ జల్పు జీవ. ౧౨౬

అనుభవించు టందె యాగామి యుండును ;
అనుభవింప నేర్వ నద్ది రాదు ;
అనుభవించు టందు నజ్ఞాండ వై యున్న
కర్మ సంచితమ్ము గలుఁ జీవ. ౧౨౭

అనుభవించు కర్మ మారబ్ధ మాటచే
దానియందు నహము బూనరాదు ;
ఆచరించు కర్మ మాగామి యాటచే
దానియందు నహము బూను జీవ. ౧౨౮

అనుభవించు కర్మ మాగామిని నొసంగు
చుండు, దాని బొందకుండ రాదు ;
అద్ది చెందకుండ నరసి తూష్ణీంభావ
మను నహంబు బూన నగును జీవ. ౧౨౯

అనుభవించు కర్మ మైహికంబగు పాప
కర్మలందు బుద్ధి గలుగ జేయు ;
పాపకర్మ జెందబడు వేళ పుణ్య స
త్కర్మ బూను నహము గనుము జీవ. ౧౩౦

ఐహికం బనిత్యమైన యాగామిని
అనుభవించు కర్మ మంద జేయు
నైహికమును వీడి యాపరమ్మును పొంద
గలుగుటకు నహమ్ము గనుము జీవ. ౧౩౧

అనుభవించు కర్మ మది అకర్మంబౌను
దానియందు కర్మ మూనరాదు;
ఆచరించు కర్మ మది కర్మయగా గాన
దానియందు కర్మ మూను జీవ. ౧౩౨

వానియందు వీని వీని యందున వాని
ననుభవమున నాచరణము నందు
వేనినైన తగు వివేకాన వర్తింప
కర్మ తత్త్వ మరయ గలవు జీవ. ౧౩౩

శమ దమాది షట్క సంపత్తి నార్జించి,
యల విరాగ రాగముల గ్రహించి,
ముక్తి భుక్తి రెంటి మూలమ్మొద దలంచి,
సలుప వలయు కర్మ దెలిసి జీవ. ౧౩౪

ఓర్పు

కంటకంబు పైన కాల్వేయ బాధగాన్
గాలిపైన కోపమేల రాదో!
రాకపోక కాలు వ్రణము గాకుండ స
త్సేవ సేయు నటుల చెలగి జీవ. ౧౩౫

పరుల దూషణమ్ము బాధింప వారిపై
పగను గొనెడు శత్రుబాధ ఋణము
వడ్డి మొదలు దీర వారిని ప్రేమించి
చిత్త శాంతి సేవ జేయు జీవ. ౧౩౬

## కామాదులు

కలరు సుమ్ము వారు కామాదు లార్గురు
నీ తలంపులట్లనే యొనర్త్రు;
మంచిచెడ్డ పనుల గాంచి, వానిని స్థిర
పరతు మోయి యెల్ల పనుల జీవ. ౧౩౭

కాము డెల్లకోరికల నొసంగుచు నుండు;
నైన నీయభీష్ట మనుసరించి,
యాధిపత్య మొంది యవ్వానిని నిరూఢి
పరతువోయి! ధర్మ మరసి జీవ. ౧౩౮

కాము డుండి దుష్టకర్మవాంఛల నీయ
వానియందు క్రోధ మూను మోయి!
అందుచేత నింక నవి పైకి రాకుండ
అంత మొందజేతు మరసి జీవ. ౧౩౯

అవసరంబులేక యాక్రోధ ముదయింప
లోభునిం దలంచి లోని క్రోధ
మణచివేయ జూడు మంత నాతని మేమె
యణచివేతు మీవు గనగ జీవ. ౧౪౦

చేయదగినపనుల జేయకుండగ లోభు
డడ్డుపడును; వాని నణచివేయ
మోహునిని గ్రహింపు మోయి మేమట్టుతె
రూఢిపరతు మట, నిరూఢిజీవ. ౧౪౧

మోహరాజు తుచ్ఛ మోహమెమ్మసగ వాని
మారణంబు సేయు మదవిభుండు;
వానిగోరి సాయమూను మట్టులై రూఢి
పరతుమోయి ధర్మ మగిసి జీవ. ౧౪౨

మదవిభుండు శత్రుభావ మెమ్మదవ జేయు
మాన్నగలడు దాని మత్సరుండు
వానిగోరి సాయ మూను మట్టులై రూఢి
పరతుమోయి ధర్మ మరసి జీవ. ౧౪౩

మత్సరుండు తోడిమానవులఁ దీర్ష్య
గలుగజేయు; నట్లు గలుగకుండ
శాంతదయల గూడి సమయింపు మట్టులే
స్థిరపరతుము దాని నరసి జీవ. ౧౪౪

కన్నతల్లివలన గలిగిన గుణములు
గాని, యింద్రియములు గాని, మరియు
నవ్వియైన మంచినే యొసంగును గాని
చెరుపు జేయనేర వరయ జీవ. ౧౪౫

మంచివి యనుకొన్న మంచినే యొసగును
చెడ్డవి యనుకొన్న చెడు నొసంగు;
మంచిచెడ్డ లేర్పరించుట కీ వొదుఁ
గాని లాతివారు గారు జీవ. ౧౪౬

శత్రువు లనుకొన్న శత్రువు లగుదురు;
మిత్రులని దలంప మిత్రములును;
శత్రుమిత్రభావ సంపాదకుడ వీవె
గాని, లాతివారు గారు జీవ. ౧౪౭

### త్రి క ర ణ ము లు

కలిగియుందు నీకు నలుగురు మంత్రులు,
నందు మనము మొదటిదై యెసంగి
నలువుచుండు నెపుడు సంకల్పము వికల్ప
ములన రెండుపనులు గలుగ జీవ. ౧౪౮

చలనరూపమనము సంకల్పమిడు దాని
చెడ్డ మంచి తెలుక చేతుము సుమి!
అద్ది చెడ్డదైన నంత వికల్పంబు
నొందజేసి మంచి పొందు జీవ. ౧౪౯

నీయభీష్టమట్లు నిశ్చయించును బుద్ధి,
చింతనం బొనర్చు చిత్తము గొని;
కాంచి దాని నహము కర్తృత్వము వహించి
వాక్కున కిడు నిట్లు వచన జీవ. ౧౫౦

వాక్కు కందజేయ వచియించు నద్దాని
కర్మజేయు నింక కాయమునను;
త్రికరణమ్ము లొక్క తీరున బీజమై
ఫలమొసంగు వృక్ష మలరు జీవ. ౧౫౧

మంచివృక్ష మగును మంచిసంకల్పము,
చెడ్డవృక్ష మగును చెడ్డదైన,
మంచిచెడులు నిర్ణయించుకొనుట కీవె
గాని లాతివారు గారు జీవ. ౧౫౨

వాక్కు కందనట్టి స్వాంతసంకల్పంబు
వృక్ష మొదవనట్టి బీజ మగుచు
ననుభవింప జేయు నది మానసికముగ
మనమునందె బీజ మణగి జీవ. ౧౫౩

వాక్కు కందినట్టి స్వాంతసంకల్పంబు
బీజమగుచు మొలిచి వృక్ష మగుచు
మనమువాక్కులవర కనుభవింపగ జేసి
ఫలమునీక తరువు మలగు జీవ. ౧౫౪

స్వాంతమందు తలపు వాక్కునన్ వచనంబు
కాయకర్మ మూడు కలియు బోడము
పూర్ణవృక్ష మద్ది పూర్ణకర్మఫలంబు
కలుగజేయు నీకు నెలమి జీవ. ౧౫౫

త్రికరణమ్ము లెట్టి రీతి ప్రవర్తించు
నట్టివృక్షములను బుట్ట జేయు,
మంచి వృక్షమైన మంచి ఫలంబును
చెడుగు చెడుఫలమ్ము నిడును జీవ. ౧౫౬

పుట్టుక మొదలుగను గిట్టువరకు కర్మ
మనుభవించుచుండె యాచరించి;
ప్రాప్తకర్మయౌ ప్రాగబ్ధఋణము న
శించ దనువు నొప్పగించు జీవ. ౧౫౭

చేతు లొనర్చునాఁటి చెడులకు తగుశిక్ష
ప్రభువు గానబడక భటుల కాజ్ఞ
సేయ ప్రభునియాజ్ఞ చెరసాలయందున
ననుభవింపజేయు నట్టుల జీవ. ౧౬౮

నీవొనర్చినట్టి నేరంబులకు శిక్ష
నీకు దెలుపకుండ మాకు దెల్పి
నీశ్వరాజ్ఞవిధిని యింద్రియాధిపులమై
యనుభవింపజేతు మరసి జీవ. ౧౫౯

## సత్య పథ్యములు

నిజము మాటలాడ నేర్చిన వాక్సిద్ధి
గలిగి సత్యపథము గాంచగలవు;
పథ్యమును వహించి భక్షింప నన్నంబు
కాయసిద్ధి బొందగలవు జీవ. ౧౬౦

అన్నరసము రక్తమగు నద్ది వీర్యమా
నద్ది మెదడు నగును అందువెలయు
తల్లి తెలివినాగ నిల్లాలి తెలివి నా
రెండువిధము లగుచు నుండు జీవ. ౧౬౧

ఆరురుచుల గోరి అంగసౌష్టవమున
కన్నమును భుజింప నద్ది యొప్పును
అలి తెలివి నొసగు నట్టినిర్మనస్సు
గలుగజేయు నిటుల దెలియుము జీవ. ౧౬౨

బాహ్యజిహ్వారుచుల బారికి పడకుండ
నన్నమును భుజింప నంగోరిగుచిఁ
దల్లి తెలివి నొసగి దనరు సన్మార్గమ్ము
గలుగుచుండు దాని దెలియుము జీవ. ౧౬౩

తనువు నన్నములును జననివై యుండుట
తనువుకైన యన్నమును గ్రహించి
జననిపూజతోడ జననికర్పణ చేసి
యారగింప ధర్మమగును జీవ. ౧౬౪

అట్టు లర్పజేసి యర్పణం బొనరింప
నద్ది పథ్యమైన యన్న మగుచు
కాయసిద్ధి జేయగలిగి యాధ్యాత్మిక
జ్ఞాన మొసగు మేధ నలువు జీవ. ౧౬౫

కాయసిద్ధివలన గలుగును వాక్సిద్ధి
కాయమందె వాక్కు గలిగి యుండు
కాయవాగధిపులు గా దలిచంద్రులు
నేలుచుంద్రు వాని నెంచి జీవ. ౧౬౬

సత్యపాలకుండు సత్యస్వరూపుండు
సత్యవాగ్విభుండు జనకుఁ డౌట
సత్యవాక్కుతోడ నిత్యంబు నీవుండి
జనకుపూజ లిట్లు సల్పు జీవ. ౧౬౭

జనకువాక్కునందు శబ్దంబు పలికించు
పలుకువెలది జిహ్వ గలదు; నీదు
నాల్కచాపలమ్ము నయమొప్ప దొలగించి
జననిపూజ నిట్లు సల్పు జీవ. ౧౬౮

అందగలవు నిత్య మారోగ్యభాగ్యంబు
పథ్య మాచరించువాఁడ వేని;
అందగలవు నిత్య మాధ్యాత్మికసుఖంబు
సత్యవాక్కుగలిగి సలుప జీవ. ౧౬౯

యజ్ఞములు

సకలజనులు మానసికముగ నిక వాచి
కమ్ముగాఁగ కాయికమ్ము గాఁగ
త్రివిధములుగనైన త్రివిధయజ్ఞంబులు
చేయుచుండు రెపుడు చెలఁగి జీవ. ౧౭౦

సంతతంబు మనము సంకల్పము వికల్ప
ములన రెండుపనులు సలుపుచుండుఁ;
నవ్వి విశ్వసేవకై యొప్పఁగా నద్ది
మానసికపుయజ్ఞ మౌను జీవ. ౧౭౧

మనమొసంగు తలపుమార్గంబు తప్పక
సత్యవాక్యములను సతము బల్క
నవ్వి విశ్వసేవ కైనచో నది వాచి
కమగు యజ్ఞ మగును గాంచ జీవ. ౧౭౨

సత్యవచనయుక్త నిత్యనిర్మితశిల్ప
కర్మములు ప్రపంచకమున నిఖిల
మానవాళి శోభకైనచో నది కాయి
కమగు యజ్ఞమగును గనగ జీవ. ౧౭౩

త్రివిధయజ్ఞము లిటు త్రికరణశుద్ధి నొ
నర్ప సకల జీవనమునకైన
కామ్యరహిత శిల్పకర్మల జేయించు
నవ్వి బ్రహ్మకర్మ లనగ జీవ. ౧౭౪

## శిల్పములు

కన్నతండ్రి యా జగచ్ఛిల్పి తన జగ
చ్ఛిల్పరచనలోని శిల మరసి
తదుపకరణశిల్ప తనయు లౌదురటంచు
నెంచి మానవుల సృజించె జీవ. ౧౭౫

ధాతవిశ్వశిల్పి స్థావరమ్ము లొసంగె
మానవుడు తరించు మార్గములుగ;
వాని దగువిధానమూని సల్పగ నగు
తదుపకరణ శిల్ప తతులు జీవ. ౧౭౬

శిల్పమన్న పంచ శిల్పవృత్తులె గావు;
మానవోపయోగ మైన యట్టి
జీవనమునకైన వేవైననుంగాని
అన్ని శిల్పకర్మ లగును జీవ. ౧౭౭

భూతపంచకమ్ము భువనసృష్టికి మూల
మై సహస్రగతుల నగువిధమున
నవని శిల్పములకు నైదువృత్తులు మూల
మై సహస్రగతుల నగును జీవ. ౧౭౮

భువన దేహమునకు భూతపంచక మాది
యై తదంగకోటి యలరి నట్లు
శిల్ప దేహమునకు స్థిరపంచకృతు లాది
యై తదంగకోటి యలరు జీవ ౧౭౯

కాలికావు కంటి కావు వక్షము కావు
మేనికావు శిరము మెదడు కావు
పండ నుండ గూరుచుండ దగిన కావు
పలువుపనులు శిల్పములగు జీవ. ౧౮౧

వాస్తు గణిత వైద్య వాణిజ్య కరణిక
క్షౌర కుంభ వస్త్ర కావ్య కృషిక
ముద్రణాది యంత్ర ముద్రాక్షరమ్ములు
పలువుపనులు శిల్పములగు జీవ. ౧౮౧

రాజ్యతంత్ర, యంత్ర, రాజకీ యోద్యోగ,
రాజ్యపాలన, స్వరాజ్య, శిల్ప
మాతృ దేశ సేవ, పితృసేవనమ్మును
నలుపు పనులు శిల్పములగు జీవ. ౧౮౨

విశ్వశైల్పికమగు విశ్వజీవి జనాళి
కవసరమ్ములైన యన్ని పనులు
శిల్పరచన మగును శిల్పేతరంబైన
పని యొకండు గానబడదు జీవ. ౧౮౩

కా ని,

కామ్య రహితముగ జగచ్ఛిల్పులను లక్ష్య
మెంచి నలుపురచన లెవ్వియైన
సత్యజీవనమున సహకరించున వెల్ల
శిల్పకర్మములయి చెల్లు జీవ. ౧౮౪

కామ్య సహితుడయి జగచ్ఛిల్పులను లక్ష్య
ముంచకుండ వేడ్క నున్నతముగ
సర్వకళల తోడ జల్పిన నవి శిల్ప
కర్మములను ఖ్యాతి గనవు జీవ. ౧౮౫

పరుల నేమమునకు వలయు పను లొనర్ప
నవ్వి శిల్పములన నలరుచుండు;
స్వార్థమునఁ గడంగి నల్పుకర్మలు శిల్ప
ములని చెప్పరాదు తలప జీవ. ౧౮౬

దేశ ముద్ధరించు దీక్ష నిస్వార్థులై
సోదరప్రపంచ శోభ కై న
శిల్పకృతు లొనర్చు శిల్పులు నిష్కామ
శిల్పయోగులనఁగఁజెల్లు జీవ. ౧౮౭

ఫలవిరహిత కృతులు పరుల కొనర్చిన
నుచితఫలము గలుగ కుండ బోదు;
పరులు గూడ క్షేమ మరసివారికిదగు
నుచిత కృతులొనర్చు చుంద్రుజీవ. ౧౮౮

సకల మనుజులిట్లు సహకారములఁజూపి
యొకరి కొకరు మైత్రి నుండి తగిన
పనులొనర్చు చున్న ప్రతిమానవుఁడు పార
మార్థిక మగు శోభ నలరు జీవ. ౧౮౯

మండలత్రయము

ఆత్మశక్తి నిలయ మగు మహాబ్రహ్మాండ
మందు ప్రత్యగాత్మ డధిపు డుండి
సకలభువనసృష్టి సలుప హిరణ్మయ
మండల మన గ్రాలుచుండు జీవ. ౧౯౦

విద్యుదాలయ మయి వెలయు బ్రహ్మాండంబు
నందు భానుమంతు డధిపు డుండి
స్థావరముల సృష్టి సలుప రజితమయ
మండల మన గ్రాలుచుండు జీవ. ౧౯౧

ప్రాణశక్తిచేత బరగు పిండాండంబు
నందు జీవరూపు డధిపు డుండి
జనన మరణ కృతులఁ గనఁగ నయోమయ
మండలమున గ్రాలుచుండు జీవ. ౧౯౨

ఋషులు - శాస్త్రములు

విశ్వసృష్టిలోని వివిధ రూపమ్ములు
విగ్రహములు గాఁగ వెలయ నవ్వి
దేవతాంశులైన జీవుల కనువగు
తనుగృహాలనంగఁ దనరు జీవ. ౧౯౩

ఆదిఋషులు సచ్చిదానందమయులైన
ఆదిదంపతుల మహత్త్వమందు
విశ్వరూపసృష్టి విధుల సమాధిలో
నాది శిల్ప తత్త్వమరసి జీవ. ౧౯౪

చిన్మయాత్ము లగుచు శిల్పయోగారూఢ
శిల ముజ్జ్వలింపఁజేసి కొనుచు
నాదిదైవరూప మర్పించెదరు కళా
రూపకల్పనంబు జూపి జీవ. ౧౯౫

రూపకల్పనమున రూఢిచే నాజగ
చ్ఛిల్పకర్మయోగ సిద్ధులగుచు
స్వానుభూతిఁగన్నవాని నన్నింటిని
శిల్పశాస్త్రముల రచింత్రు జీవ. ౧౯౬

### కావ్యములు

కావ్యమందు నవ్యకళల కాకరముగ
భవ్య ప్రణవ విశ్వపథము నందు
నవరసంబు లనెడు నాదాలు మోగించి
నవ్యకావ్యముల నొసర్తు జీవ. ౧౯౭

### పురాణములు

అలపురాణ దంపతుల మహాసంకల్ప
బీజమున నెసంగు విశ్వవృక్ష
జనన పోషణాది సచ్చరిత్రలొసర్తు
రవి పురాణములన నవని జీవ. ౧౯౮

అల పురాణదంపతుల శక్తి వినువీథి
నాల్మగలుగ విద్యుదాలయులుగ
వెలయు చంద్రరవుల విద్యుత్కథలొసర్తు
రవి పురాణములన నవని జీవ. ౧౯౯

అట్టి చరిత నిత్యమానంద దాయియై
అఖిలకోశ నవ రసాలయమయి
నిఖిల భువన సృష్టి నిలయమై సత్యసా
ధన విధానమొసగి దనరు జీవ. ౨౦౦

ఎన్ని జన్మములకు నెన్నిసారులునైన
నెన్ని కళల నేర్పరింప నింక
నంతు గానకుండు నెంత వ్రాసినగాని
యెపటి కపుడు నూత్నమొసగి జీవ. ౨౦౧

సంతానము

కన్నతండ్రియగు జగచ్ఛిల్పి శిల్పాల
మార్గమూని దేవమందిరములు
గృహముఖమ్ము లెసగ సృష్టి సల్పెదరయా
అఖిలజనుల సౌఖ్య మరసి జీవ. ౨౦౨

ఆది సృష్టి సలిపి [1]యజుడు శిల్పిబ్రహ్మ
మగుటచేత వాని [2]యాత్మసుతులు
శిల్పకృతు లిటెన్నొ సల్పి శిల్పబ్రాహ్మ
ణులన యశము గాంతు రిలను జీవ. ౨౦౩

కృతజ్ఞత

ఆది విశ్వజనకుడైన జగచ్ఛిల్పి
సృష్టి సల్పినట్టి జీవ తతికి

---

1 "నజాయతే ఇత్యజః" అను వ్యుత్పత్తి ననుసరించి అజనామ మాపర బ్రహ్మమునకే చెల్లుచున్నది. పృథివీతత్త్వవిషయ పంచకాభిమానియై జనించి నట్టియు, మూర్తులలో నొక్కడును నగు ప్రథమమూర్తియైన బ్రహ్మకా యజనామము వాడుటుచితము కాదు. అది యాతనికి చెల్లనేరదనియు గ్రహింపవలయును.

2 అజుడగు నాదిబ్రహ్మము యొక్క సృష్టిలోని జీవరాసులన్నియు నాతనిసంతానమే. అయినను జ్ఞానముగల మానవజాతి మాత్రమే తామును తక్కిన ప్రాణికోట్లును భగవంతుని బిడ్డలని గుర్తెరింగి నడచుకొను చుండిరి. మానవేతరులకీ జ్ఞానము లేదు. అట్టి మానవులలోగూడ భగవంతుని తమ తండ్రిగా నెఱింగినను "అవశ్యం పితురాచార" మను న్యాయము ననుసరించి యెవ్వరు ఆ తండ్రి యొక్క సృష్టికర్మ ననుసరించి సోదరప్రపంచము యొక్క క్షేమాభ్యుదయములకు శిల్పకర్మల నాచరించుచు పితృధర్మమును పాలించి నిర్వహింతురో అట్టివారే అజుడగు నాశిల్పి బ్రహ్మకు తనయులన బరగి తత్సంతాన మనబడుదురు. తక్కిన వారు బ్రహ్మసంతానమయ్యు ఆతని ధర్మము నాచరింప నందున తత్సంతానముగా వ్యవహరింప బడరైరి (ఇందుకు 130 పుట, ౨౮౮వ పద్యము జూడనగును.

వలయు శిల్పములను వెలయించి సేవించు
టాత్మ సుతుని ధర్మమగును జీవ. ౧౦౩

నిర్నిమిత్తముగను నిష్కామముగఁ దండ్రి
విశ్వశిల్పములను వేలొనర్చు;
నీవు తండ్రివలెనె నిష్కామముగఁ జెల్పు
టాత్మ సుతుని ధర్మమగును జీవ. ౧౦౪

జనక నిర్మితమగు జగతిని మానవ
సోదర ప్రపంచ శోభకై న
శిష్ట శిల్పములను సృష్టించి సుసుసూము
తండ్రిఋణము దీర్పదలచి జీవ. ౧౦౫

కన్నతండ్రి నిత్యకర్మిష్ఠుఁడై యుండ
నిత్యనూత్న భువన నిర్మితులను;
నూత్నశిల్పముల ప్రయత్నించి సల్పుచు
శిల్పమయ జగముగఁ జెలఁగ జీవ. ౧౦౬

విశ్వరూప వృద్ధి వెలయు ♦ విశ్వబ్రహ్మ
సృష్టి రచన మెల్ల శిల్పమగుట

---

♦ ప్రకృతి మహాదేవి తన సృష్టిలోని విశ్వరూపాభివృద్ధి యెవనివలన జరుగుచున్నదో అట్టి తన భర్తనుగా తాను గ్రహించిన విరాట్పురుషుని చేయ దలంచి విశ్వరూపాభివృద్ధికి హేతుభూతమగు భావము వలన అతనికి విశ్వబ్రహ్మ మని పేరిడెను. ఇంకను తనయందున విశ్వాభివృద్ధి గలుగుట చేతను, విశ్వమూలమున దానభివృద్ధి జెందినట్లు గన్పట్టుట చేతను విశ్వబ్రహ్మ మయ్యెను. "విశ్వం యథా స్యాత్తథా బృంహతీతి విశ్వబ్రహ్మ" అని వ్యుత్పత్తి.
"బృంహతీతి బ్రహ్మ"

సృష్టిలోని జీవకృతులు శిల్పముఁగాఁగ
అంత శిల్పమయమె యగును జీవ. ౨౦౮

మఱియు

బ్రహ్మనైతి నంచు బల్కఁ బూనగరాదు;
బ్రహ్మసుతుడనంచుఁ బలుకుచుండి;
బ్రహ్మతత్త్వమరసి బ్రహ్మకర్మలొనర్చి
బ్రహ్మచర్యముసను బ్రతుకు జీవ. ౨౦౯

కన్నతండ్రి నిత్య కర్మిష్ఠుడై యుండి
కర్మరహిత పదము గాంచ బోడు;
నీకు సాధ్యమగునె నీతండ్రికే లేని
కర్మ రహితపదము గనగ జీవ. ౨౧౦

సాధనమున నీవు సత్యలోకము నేగి
బ్రహ్మమందు గలసి బ్రహ్మవైన
నిత్యనూత్న విశ్వ నిర్మాణకర్మలు
జరుపకుండ తప్పదరయ జీవ. ౨౧౧

పరమహంసపేర బాహ్యవేషమునను
కర్మరహితుడనను కాంక్షఁ దాను
పరమహంసమైన బ్రహ్మవాహనమయి
తిరుగుకర్మ తప్ప దరయ జీవ. ౨౧౨

బ్రహ్మనైతినంచు బలుకుటయుక్త గాదు,
పరమహంసనంచు పలుకయు గాదు;

కామ్యరహిత శిల్పకర్మలచే చిరం
జీవి వగుదువని సృజించె జీవ. ౨౧౩

తుదిపలుకులు

ఇంక చెప్పదగిన వెన్నియో గలవైన
కాల మింక లేదు గాన మాదు
సదుపదేశములను జాగరూకత మదిన్
నిలుపుకొనుము మమ్ము దలచి జీవ. ౨౧౪

మమ్ము మరువవలదు మరచినచో నీకు
దిక్కు లేరుసూ మఱొక్కరైన;
నీకు చెప్పినట్లు నిఖిల సద్ధర్మల
సలుప సుఖము లందగలవు జీవ. ౨౧౫

భూమిమీది కింక బోవ నున్నావోయి !
క్రిందు మీదుగ తలక్రిందు లగుచు;
అపుడు భార్య యాశ్రయంబౌటచే నన్ని
పనులు నీకు దెలియబడవు జీవ. ౨౧౬

వధువుగూర్చి

నీ వవిద్య వౌట నీభర్త సన్నిధిఁ
చేతనవయి భర్త చేతలకును
తోడునీడగాఁగ గూడియాడుచు శాశ్వ
తానురాగసౌఖ్య మందు మమ్మ. ౨౧౭

వధూవరుల గూర్చి

ప్రథమమందు సృష్టి ప్రణవధ్వనులతోడ
నాదిదంపతులుగనై సృజింప,
పొంగి మీరు నూత్న మంగళధ్వనులతో
నవ ప్రజాభివృద్ధి నడుచు కొనుడు. ౨౧౮

అని తెలిపి

గురుడు వెడలగానె గుబితప్ప ముఖముపై
మచ్చు చల్లినట్లు మాయ కమ్మె;
శిరము క్రిందుగాగ ధరణిపై బడ నంధు
డగుడు శిశువు కెవ్వు మనుచు నేడ్చె. ౨౧౯

ఆటవెలదు లందు మాటాడ తల్లి గా
యత్రి ప్రేరణమ్మె నందగలిగి
మాత కరుణఁ జూపు మార్గాన నీ జగ
చ్ఛిల్పకావ్యమును రచించినాడ. ౨౨౦

"శిల్పై నైవేద ముప బృంహితమ్"

గద్య

ఇది శ్రీ మద్గాయత్రీ మాతృ చరణారవింద మరందపానజనిత
సహజ కవితాలంకృత సానగాది పంచఋషి మండల
సువర్ణఋషి పరంపరాంతర్గత ఆత్రేయ ఋషి
గోత్రసముద్భూతకోలవెన్ను వంశ పరిపూత
త్రిపురసుందరీ నాగాచార్యపుత్త్ర
పరబ్రహ్మతీర్థ ప్రణీతంబైన
జగచ్ఛిల్పము.